స్వల్పధర ! ఫల మధికము !! పూర్తి తృప్తి !!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు




# లోకామయహార కస్తూరి మాత్రలు

పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, గూరలు, శీతలముచే కాళ్లులాగుట్ను కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమందు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగు లగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు. 1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-3.0.

**సారస్వతాసవం :**—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుము (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను వడువనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

---

## నేషనల్ యిన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

హెడ్ ఆఫీసు: నేషనల్ యిన్సూరెన్సు బిల్డింగు,
7, కౌన్సిల్ హౌస్ వీథి, కలకత్తా.

1933 ఫలితములు :—ముగించిన క్రొత్తవ్యాపారము రు. 1,67,00,000. అన్నివిధముల దినదినాభివృద్ధి గాంచుచున్న సంస్థ. తక్కువరేట్ల ప్రెమియములపద్ధతులలో అన్నిరకముల భీమాలు చేయబడును.

ప్రత్యేకలక్షణములు:—స్త్రీలజీవితములు, సమష్టిజీవితములు శాశ్వతసంరక్షణ పాలిసీలు, మూడులాభముల పాలిసీలు. వివాహము, భావిజీవితసౌకర్యపాలిసీలు.

ఏజన్సీలకొరకై దయచేసి దరఖాస్తు చేయుడు.

బ్రాంచిశెక్రటరి, 362, చైనాబజారురోడ్డు, మద్రాసు.

లేక ఆర్. జి. దాస్ అండ్ కో., మేనేజర్లు.

అగ్ని, మోటారు, ఆకస్మిక ప్రమాదముల పాలసీలకు సంప్రదింపుడు.

నేషనల్ ఫైర్ అండ్ జనరల్
యిన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

హెడ్ ఆఫీసు: నేషనల్ యిన్సూరెన్సు బిల్డింగు,
7, కౌన్సిల్ హౌసు వీథి, కలకత్తా.

వివరములకు: ఆర్. జి. దాస్ అండ్ కో., మేనేజర్లు.

## ఇన్కంటాక్సు ఆఫీసర్లు:—

"కేసరి డెంటల్ క్రీం" వాడుటకు యింపుగానుండి సంతృప్తికరముగా నున్నది.

యల్. డబ్లివు. తాంప్సన్,
ఇన్కంటాక్సు ఆఫీసరు, 2-వ సర్కిల్, మద్రాసు.

"నేను కేసరిడెంటల్ క్రీం వాడితిని. అది మిక్కిలి ప్రయోజనకారిగా గనబడెను. దంతధావన నవనీతమును గురించి సాధారణముగ నితరులు గోరునది రెండువిషయములు. పండ్లను శుభ్రపరచుట, మంచిసువాసనగలిగియుండుట. ఈరెండువిషయములలోను సదరు క్రీం చాల బాగుగానున్నది. ఈదంతధావన నవనీతము బజారులలో విక్రయింపబడు యితరములకంటె నెక్కువ శ్రేష్ఠముగా పనిచేయునని నాతలంపు.

జే. యస్. వి. రాజు, యం. ఏ. (ఆనర్స్)
ఇన్కంటాక్సు ఆఫీసరు, మద్రాసు.

ప్రతిచోటను దొరకును.

## కేసరి కుటీరము

ఎగ్మూరు. మద్రాసు.

# భారతి

## సచిత్ర మాసపత్రిక


అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౧౨, సంచిక ౨

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౫


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—పూజకు; కృష్ణద్వితీయ; కృష్ణతృతీయ.

సాధారణ చిత్రములు:—ఢిల్లీనగరము; జుమ్మామసీదుద్వారము; అనంతపథము; దినజీవనము; కలత్తా ఓషధివనచిత్రములు; సృష్టి; చిదంబరచిత్రములు ౬; నామకల్లు కోట; విశ్రాంతి; శ్రీకూర్మము దేవాలయము; బకింగుహాం కాలువ; భారతి; వ్యంగ్య చిత్రములు; ఇతర చిత్రములును.

# ఆంధ్రుల వ్యాపార నిపుణత

జి. రామ కృష్ణ రావుగారు
(బి. కాం ; ఎఫ్. ఆర్. ఇ. యస్.)

మన రాజధానిలో ప్రతిసంస్థయు, తమిళసోదరుల హస్తగతమై యున్నది. ఇందులకు కారణము ఆంధ్రులు ప్రతివిషయమునందును వెనుకంజ వేయుటయే కాని ఆంధ్రులలో వ్యాపారనిపుణులు లేక కాదు. ఆంధ్రులచే స్థాపింపబడి, అచిరకాలములోనే అభివృద్ధి గాంచిన, ఆంధ్రాబ్యాంకు, ఆంధ్రభీమాకంపెనీ, స్టార్ ఆఫ్ ఇండియా భీమాకంపెనీలచరిత్ర గాంచినచో, ఆంధ్రుల వ్యాపారధురీణత విశదము కాగలదు.

పై సంస్థలలో స్టార్ ఆఫ్ ఇండియా స్థాపకులు శ్రీయుత యమ్. యస్. ఆర్. ఏ. గుప్తగారు. వీరు వైశ్యయువకులు. కావలిపట్టణ వాస్తవ్యులు. వీరు కొంతకాలము ప్రభుత్వోద్యోగమునం దుండిరి. కాని, అందు స్వాతంత్ర్యాభిలాషులకు తావులేదనియు,



ఎం. ఎస్. ఆర్. ఏ. గుప్తగారు, కావలి

వ్యాపారనైపుణ్యమున కవకాశము లేదనియు గ్రహించి, కొన్ని జాయింటుస్టాకు కంపెనీలయందు ప్రాతినిధ్యము వహించిరి. తదుపరి కొన్ని భీమాసంస్థలలో ప్రాతినిధ్యము వహించి మిక్కిలి గణుతి కెక్కిరి. 1928-వ సంవత్సరములో స్టార్ ఆఫ్ ఇండియా కంపెనీని, ప్రావిడెంటు కంపెనీల చట్టముక్రింద, మరికొందరు ప్రముఖుల తోడ్పాటుతో రిజిష్టరు చేయించిరి. ఈ సంస్థ దినదినాభివృద్ధిగాంచి ప్రభుత్వమువారి మన్నన బడసినది.

పిమ్మట 1932-వ సంవత్సరములో ఈసంస్థ ప్రావిడెంటు కంపెనీ వ్యాపారమునుండి, అసలు భీమావ్యాపారము ప్రారంభించి ప్రథమసంవత్సరములో 16 లక్షల రూప్యముల వ్యాపారము జరిపినది. ప్రభుత్వమువారివద్ద 1 లక్ష రూప్యములు డిపాజిట్ చేసినది. ప్రొఫెసర్ కే. బి. మాధవగారు ఈసంస్థనుగూర్చి, అభిప్రాయ మిచ్చుచు, ఇది హైందవభీమాచరిత్రయందు అగ్రస్థానము వహించెననియు ఈసంస్థాపకుల వ్యాపార నైపుణ్యము సువర్ణాక్షరములతో లిఖింపదగి యున్నదనియు అభిప్రాయ మిచ్చిరి. అనేక భీమాపత్రికలును, ఆంధ్రపత్రిక మొదలగు పత్రికలును యిట్టి అభిప్రాయమునే వెలిబుచ్చియున్నవి.

వైశ్యసంఘములో భీమావ్యాపారమును స్థాపించి దాని అగ్రస్థానమునకు తెచ్చినవారిలో గుప్తగారే ప్రథములని చెప్పవలసియున్నది. ఈ సంస్థకు చేకూరిన వ్యాపార మంతయు ఆంధ్రదేశమునుండియే చేకూరినది గుప్తగారు స్వయముగా వివిధమండలములయందు పర్యటనము గావించి స్వయముగా ప్రతినిధులను ఏర్పరచి వారిద్వారా గొప్పవ్యాపారము సాగించుచున్నారు. శ్రీ గుప్తగారిచరిత్ర ఆంధ్రుల కెంతయు అనుకరణీయము. ముఖ్యముగా ఆంధ్రవర్తకశిఖామణులకు యిది మిక్కిలి గర్వించదగినవిషయమై యున్నది.

ఆంధ్రపత్రిక, ఆంధ్రభీమాపత్రిక, ఆంధ్రభూమి, సమదర్శిని, ప్రజామిత్ర మొదలగు పత్రికలుగూడ వీరిని గూర్చి మిక్కిలి ప్రశంసించియున్నవి.

# ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము)

శతావధాని,
వేలూరి శివరామశాస్త్రిగారు తెనిగించినది

ప్రకాశకులు:
కాశీనాథుని నాగేశ్వరరావుగారు

వెల మొదటిభాగము రు. ౦-౧౨-౦.
రెండవభాగము రు. ౧-౦-౦.

కొలదిప్రతులే కలవు. త్వరపడుడు.

మేనేజరు,
ఆంధ్రగ్రంథమాల,
నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

# జీవనప్రభాతము

అనువాదకులు: శ్రీ పోలవరపు రామబ్రహ్మముగారు, B. A., Murugan the Tiller (మురుగన్ ది టిల్లరు) అను పేరున శ్రీ కే. యస్. వెంకటరమణిగారు ఆంగ్లభాషను రచించిన సుప్రసిద్ధనవల కిది యనువాదము. ఇది రమణీయమయిన సాంఘిక నవల. పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్యాదర్శములు మొదలగువానివలన గలుగు కష్టములు ఇందు చక్కగ వర్ణితములయినవి. ఆంధ్రవాఙ్మయమున నిట్టి కథావిధానము గల యీ నవల క్రొత్తది. ఆంధ్రులెల్లరు చదువవలసినది. క్రౌను ౪౭౬ పుటలు. వెల రు. ౧—౮—౦ మాత్రము.

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి    పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందు గలదు. ఆకాలపుటపూర్వసారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.



సంపు. ౧౨ భావసంవత్సరము, మాఘమాసము (ఫిబ్రవరి ౧౯౩౫) సంఖ్య ౨

# ప్రణయ పత్త్రికలు

బాలాంత్రపు వేంక॰ రావు

(వీనికి జీవసూత్రములు పదునెనిమిది.)

౧. ప్రణయపత్త్రికలన్న నొకరు వ్రాసిన వనిగాని, ఒకరికొకరు వ్రాసికొన్న వనిగాని భావించుకోరాదు.

౨. ప్రణయపత్త్రికయన్న ప్రేయసీప్రేమభావపత్త్రికయనియు, ప్రేమికప్రేమభావపత్త్రికయనియు గ్రహించినఁ జాలును.

3. పత్త్రికలన్న వారపత్త్రికలును, పక్షపత్త్రికలును గావు. ప్రేమభావ పత్త్రములను వహించిన పక్షులని మనవి.

౪. పూర్వము మన ప్రబంధములలో నాయికానాయకులనడుమఁ బ్రణయపత్త్రికలు మోసిన పక్షులవంటి వీపక్షులు కావని తెలిసికోవలెను.

౫. ప్రేయసిపేరు సారి; ఆమెభావసఖి పేరు శారి; సారి కిష్టముగా శారి మాటాడు చుండును. శారిమాటలలో సారి నడుచు చుండును.

౬. ప్రేమికునిపేరు హరి; ఆతనిభావసఖిపేరు కీరి; హరికిఁ దోఁచినదే కీరి పలుకు చుండును.

౭. పూర్వ మెప్పుడో కలిసికొని యున్నారు గాని, మనకథలో సారి, హారి కలిసికోరు. శారి, కీరి మాత్రము కలిసికొని వారి లాగు తలపోసికొనుచుందురు.

౮. సారి హారి పక్షమున, శారికీరి మాటాడుకొనుచువచ్చినవే ప్రణయపత్త్రికలైనవి.

౯. సారి రాజకుమారియుఁ గాదు; హారి రాజకుమారుఁడును గాఁడు.

౧౦. దేవరాజు వారి నొకప్పుడు చేరఁదీసి పెంచనులేదు; ఇప్పుడు విడఁదీయనులేదు.

౧౧. పూర్వజన్మమునందు వారు ప్రేమికులై యిప్పుడు దంపతులు కాఁదలఁచుకొన్నారో—అప్పుడు దంపతులై యిప్పుడు ప్రేమికులై యుండఁదలఁచుకొన్నారో యింకను నిశ్చయింపఁబడలేదు.

౧౨. కీరికి పాలు, మీఁగడ, పండ్లు, పంచదార యిష్టము.

౧౩. శారికి పకోడీలు, పులి(యా)హారము, మసాలాకూరలు ఇష్టము.

౧౪. కీరి తియ్యనిమాటలలోఁ గారమున్నది. శారికారపుఁబలుకులలోఁ గమ్మఁదన మున్నది.

౧౫. అందువల్ల, తీపిలో మొగము మొత్తుటగాని, కారములో వికారమెత్తుటగాని లేదనుకోవల్లఁగాదు.

౧౬. కీరికి కారమన్నచో కళ్ల వెంట నీళ్లు వచ్చును. శారికి పాలన్నచో ఒడలు నీరగుచుండును. అవి ఆనందసూచకములనియు ఇవి సాత్త్వికభావచిహ్నములనియు గ్రహించుచుండవలెను.

౧౭. కీరికి శారికి దేశకాలపాత్రవివక్షత లేదు. ఇష్టపడినప్పుడవి యెగురఁగలవు; ఇష్టమైన పదార్థములు గ్రహింపఁగలవు; కామరూపము లెత్తఁగలవు; కావలసినచోటికి, బోఁగలవు; ప్రణయములోఁ బ్రపంచమంతయు పాడఁగలవు.

౧౮. అట్టి శారికీరి, సారిహారికి జీవసూత్రములు. సారిహారి అట్టి భావపక్షులను (తిర్యగ్జంతువులను) పెట్టుకొని మాటలాడుకొనుటయు, తమతమ ప్రేమలు వెల్లడించుకొనుటయు వివేకశూన్యతయో, విజ్ఞానధన్యతయో యనుభవజ్ఞులగువారే నిర్ణయించుకోవలెను.

(గున్నమామిడికొమ్మమీఁద కీరి, గూఁటిగుమ్మములో శారి కూర్చుండి, కొసరి కొసరి మాటాడుకొనుచున్నవి — సారిహారి మాటలుగ.)

౧

కీరి—సారీ! అప్పటికి – నీగూఁటిమెట్లపై నిన్ను మొదట చూచునప్పటికి — నాకుఁ బ్రేమయన్న నేమిమో తెలియదు. తళుకు తళుకుమని మెఱసిపోవుచున్న నీకన్నులలో నది నిండియున్నది కాఁబోలు! అప్పుడు నీచూపులతో నాకు "ఇంజక్షను" ఇచ్చినావు. నాచూపులు నీచూపులతోఁ గలిసి

కోఁగలిగినవో లేదో నే నెఱుఁగను. అప్పుడు నీకన్నుల నిండియున్న ప్రేమరసము నా చూపులలో నిండిపోయినది — నాహృదయములో పొంగిపోయినది — నాశరీరమంతయు విరిసిపోయినది. అది అమృతమో, విషమో యిప్పటికిని నేను గ్రహింపలేకుండ నున్నాను. ఎందుకన — అమృతమైనచో నా హృదయములో అంతబాధ యెందుకు? అమృతమయమైన యాహార మమితమైనప్పుడు విషమా నని వినియున్నాను. నాకది యెక్కువై విషమైనదో— నిజముగా నది విషమో యిప్పటికిని గ్రహింపలేకుండ బాధపడుచున్నాను. విషమునకు విషమే విఱుగుడు కావున నీ చూపులతో నీవు మరల "ఇంజక్షను" ఇచ్చి యీబాధ తగ్గింతువని నా యాశ. అట్టి యాశమీఁదనే జీవులందఱును జీవించుచున్నారనియును, ప్రపంచమంతయు నడుచుచున్నదనియును ఆనాఁడు నీచూపులవల్ల నేను గ్రహింపఁగలిగితిని. అది—నాఆశ— ఏమందువు సారీ!

శారి—(నిట్టూర్పువిడిచి) నామనోహారీ! నామొదటిసారి, నాతుదిసారి — ఆనాఁడు నిన్నుఁ జూచినప్పుడే నాకన్నులలో ఆజీవకళలు — ఆప్రణయకళలు — అప్రయత్నముగా స్ఫురించినవి. వానిని, ఆనాఁడే పరశురాముని శక్తినంతను ధనుస్సుతోఁగూడ లాగివేసిన శ్రీరామునివలె నీమోహనకటాక్షమాలికలతో లాగివేసినావు—ప్రాణములతోఁ పాటు. ఇఁక నాలో నేమున్నది? ఒంటిప్రాణముతో ఆరూపు కన్నులలోఁ బెట్టుకొనియున్నాను. కాని, ఇంక నీజన్మమున మరల నంతటి సౌభాగ్య నిమిషము వచ్చునా? — ఆయాశలేదు. ఈ నిర్బంధ జీవితమునకు, నీవు సుఖముగా నుండుటయే నా మొదటియాశ-తుదియాశకూడను—

కీరి—ఆశ లంతరించుటచేతనే అంధకారము ఘనీభవించినది. కన్నులకే కాదు, మనసునకును మబ్బుగ్రమ్మినది. నన్ను నే నెఱుఁగను—కాని, నీకోసమే నాప్రాణములు చీకటిలోఁ బడిపోయినవి. అప్పుడు నీవెక్కడ నున్నావు? నాతోడ నున్నావా?—నాలో నేనే వెదకికొంటిని. నిజముగా నాయొద్ద నీవు లేవని, నాదానవుకావని, నేననుకొనఁగలిగినచో, నాపాదములక్రింది భూమి జాఱిపోవుచున్నదేమి?—ఆకాశవీథిలో నా యొడలు తిరిగిపోవుచున్నదేమి?

శారి—ఆఁగుమాఁగుము - ఆఁగుము. అంతకంటెఁ బైకిఁగాని, క్రిందికిఁగాని తిరిగి పోకుము. కన్నులు మూసికొని నామూర్తిలోని వెలుఁగును బట్టుకొనుము. నేను నీదాననే-ఎప్పటికిని నీదాననే-నేను నీదాననుగాక నాదాననైనప్పుడు నీకీత్రిప్పులతోఁ బనిలేదు. నీవు నావాఁడవౌనోకాదో ఆకాశమునకెగిరి పోకుండ నిలిచియున్నచో, నేను నామనసులోనే నిన్నుఁ జూచికోఁగలుగుదును. నీవు నావాఁడవుకానిచో - అంతమాట నేననఁజా

లను—నేనిఁక లేనిదాననే-ఈ జగదంతరాళ
ములో నేను లేనిదాననే—

కీరి—లేనిదానవా ?-నీవు లేనిదానవా
సారీ ! ఈజగత్తులో నేను నీకోసమే-నీమూర్తి
కోసమే వెదకికొనుచున్నానుగదా ! నీవున్న
ట్టుగానే వెదకికొనుచున్నానుగదా ! నీమూ
ర్తిని-నీసుందరమూర్తిని పువ్వులలోఁ జూచి
కొనుటకై, నీ నిట్టూర్పులను నెత్తావులలో
గ్రహించుటకై, నీచక్కఁరపల్కుఁలను తరు
పత్రమర్మ్మధ్వనులలో వినుటకై, తిరిగిపోవు
చున్నానుగదా ! నీవు లేనిదానవా సారీ ! నీవు
నేను చూచినచోటనే, నేనుచూచినట్టుగనే
యుంటివని వెదకికొనుచున్నానే !-నీవు లేని
దానవా? ఇఁక నే నెవరికై వెదకుదును?
ఎవరికై జీవింతును ?

శారి—హారీ ! నీవు నీకై జీవింపుము -
నాసుఖమునకై-కాదు, కాదు. నీసుఖమునకై
జీవింపుము. నీసుఖమునకై నేను జీవించి
యుంటి ననుకొని జీవింపుము. నీ తలంపులలో
నేను జీవించియుండుటయే కోరుకొందును-జన్మ
జన్మములకు నాకంతియే చాలును - అప్పుడు
నేనున్నాను. అప్పుడు నేను నీ చెంతనే
యున్నాను-అట్లుకానిచో - నాకోసము నీవు
కష్టపడుచున్నచో నేను లేనట్లే—ముమ్మా
టికిని లేనట్లే—

కీరి— సారీ ! : నాప్రాణప్రియా ! నీవు
లేనట్లేనా? నేను నిన్నుఁబ్రేమించుచున్నానే!
లేని నిన్ను నేనెట్లు ప్రేమింపఁగలుగుచు
న్నాను! నీవున్నావు. నిజముగా నాకొఱకు
—నాప్రేమకొఱకు నీవున్నావు—కాని, నీ
ప్రేమకొఱకు—నన్ను నీవు ప్రేమించుటకొ
ఱకు నీవున్నావో లేదో—అందుకనియే నిన్ను
నేను ఈజగత్తులో వెదకికొనుచున్నాను.

శారి—ప్రభూ ! నన్ను నీవు ప్రేమింపు
చున్నావా ?—ఎంతసుఖము! నేనెంతసుఖము
ననుభవించుచున్నాను!— ఈమాటవినుటకొ
ఱకే నేను జీవించియున్నాను. ఇప్పుడు నిన్ను
నేనునీయింటనేకాదు—నాయింటను, నీకంటనే
కాదు—నాకంటను, నీభావమునందేకాదు—
నాభావమునందును, నాకమునందేకాదు—
నక్షత్రములందును, అవనీతలమునందేకాదు—
ఆపగావళులయందును, అనిలమునందేకాదు—
అణ్వంతరాళములయందును, అన్నిటియం
దును చూడఁగలను. సుఖపడఁగలను. ఎంత
సుఖము !— నేనెంతసుఖము ననుభవించు
చున్నాను! ప్రేమించుటలో ఎంతసుఖము
న్నది? ప్రేమలో నెంత నిత్యత్వమున్నది?
ప్రభూ! నేనున్నాను. నీకోసమే నేనున్నాను.
నీప్రేమకోసమే నేనున్నాను.

కీరి—నాప్రాణసఖి! అవును నీవున్నావు.
నాప్రేమజగత్తులో నీవున్నావు—జడజగత్తులో
నీసుందరముఖము నాకుఁ గానఁబడకున్నచో,
చంద్రు నుపాలంభించి యుపాలంభించి ముద్దు
పెట్టుకొనఁ జూచుట యెందులకు ?—నీమనో
హరాక్షులు నాకగపడకున్నచో, పద్మములను
పట్టి పల్లార్చి పల్లార్చి అల్లారుముద్దుగాఁ జూచి

కొనఁజూచుటయెందులకు? — నీమధురసంభాషణములు వీనులవిందుగా వినఁబడకున్నచో, విహంగకలకలారావములను విమర్శించి విమర్శించి విమలామృత వీచికలుగా వినోదింపఁజూచుటయెందులకు? — నీమనోజ్ఞమూర్తి కానఁబడకున్నచో, కమనీయకుసుమ వల్లికలను కౌఁగిలించి గారవింపఁజూచుట యెందులకు? సఖి! అవును నాప్రేమజగత్తులో నీవున్నావు—

శారి — నామనోహారీ! అవును. నీప్రేమప్రబంధజగత్తులో నేనున్నానని యిప్పటికిఁ దెలిసికొన్నాను. నీసుఖమయప్రేమప్రబంధజగత్తులో నేనున్నానని తెలిసికొన్నాను. నిజముగా నీప్రేమమందిరములో నే నున్నాను. నాప్రేమ మందిరములో నీవున్నావు. మన ప్రేమ మయ భావనాజగత్తులో మనమున్నాము. కాని — కాని ... పరితాప మింకను మిగులుచున్న దెందుకు? ఔను — పరితాపము నందే — ఈప్రణయవిరహ పరితాపమునందే పరమానందము కలదని స్వానుభవముచే బోధయగుచున్నది. ప్రణయమయజీవితమునకుఁ బరమాధారము పరితాపమే కాఁబోలు!

కీరి — సారీ! అందుకనియే యీ పరితాపము. ఈజడమూర్తులు జడజగత్తులోఁ గలిసిపోవుదాఁక, పవిత్ర ప్రేమమయ ప్రాణములు పవిత్రప్రేమలోఁ గలిసిపోవుదాఁక, బహిరంతర జగత్తులలోఁ బ్రత్యణువునందును నిన్ను వెదకికొనుచు వెదకికొనుచు యుగయుగాంతరము లిట్లే పరితపించుచు నన్నుఁ దిరుగనిమ్ము!

శారి — అంతే? అంతే? అంతేనా? అట్లయినచో నేనీజగత్తులో లేను — లేను.

౨

శారి — హారీ! నేను నిన్ను విడిచి పోయినను, నీస్మృతిమాత్రము నన్ను విడుచుట లేదే — నేను లేనంతమాత్రమున నీవు నన్ను మఱచిపోఁగలవా?

కీరి — ప్రియా! మంచిప్రశ్నయే వేసితివి. వినుము. ఈమానవప్రపంచము మఱపుతో నిర్మింపఁబడినది. వెనుకఁబడిపోయినది స్మృతిపథమున నిలువఁబోదు. ముందు రానున్నదియును స్మృతికి రాదు. తా నున్నా నన్న స్మృతిమాత్రము తనకు స్పష్టముగా గోచరించుచుండును. మఱపు మానవుని జన్మంపు హక్కు. స్మృతి దైవసంబంధ మైనది. దైవవరప్రభావమువలనఁ గలిగిన ప్రేమ యొక్కటియే మర్త్యత్వసంబంధ మైన మానవుని మఱపుతెరను ద్రోసివైచి, దివ్యస్మృతిరంగమున జీవిని చిరంజీవిగాఁ జేయుచున్నది. ఆప్రేమ జీవుల యన్యోన్యానుబంధమువలననే జాగరిత మగుచున్నది. అట్టి దివ్యప్రేమ కధిష్ఠాత్రివైన నిన్ను నే నెట్లు మఱవఁగలను? అట్టి పావనప్రేమను బ్రసాదించిన నిన్ను —

శారి — హృదయాధినాథ! ఎందుకీబాధ? నన్ను మఱచి సుఖపడరాదా?

కీరి—హృదయేశ్వరీ! నా మఱపే నీ స్మృతి యగుచున్నప్పుడు నేను నిన్ను మఱచుట యెట్లు? మఱచుటయందే సుఖమున్న దన్నమాట మనోదౌర్బల్యముచే నన్నదే కాని—నిజముగా నీవే చెప్పుము! తనంతనే కలుగవలసిన మఱపు ప్రయత్నసాధ్య మగునా? కాదు — సర్వమును మఱచుటకై యత్నించుట యనిన సుఖస్మృతికి సుస్థిరత్వముం గల్పించుటయన్నమాటే—ఔను—నీవు బోధించినట్లు నే నందుకే ప్రయత్నించుచున్నాను. నీవన్నట్లు నాకందే సుఖానుభవమగుచున్నది. అందుచేతనే—ఆసుఖస్మృతి సకలమును మఱపించుటచేతనే-నేను నిన్ను నిత్యమును నాహృదయసింహాసనమున నిలుపుకొని-పూజించుకొని-సుఖించుచున్నాను.

శారి—నేననవలసినది నీవు ముందుగనే చెప్పుకొనుచున్నావా? పూజించుకొనుచున్నది నేను-ఆరాధించుకొనుచున్నది నేను.

కీరి—(ఆనందముతో) అది కాదనఁ జాలను. ప్రేమించుట తెలిసినవారికే పూజించుకొనుట, ఆరాధించుకొనుట, ధ్యానించుకొనుట మొదలగునవి తెలియునని నే నొప్పుకొనుచున్నాను.

శారి—ప్రాణాధికా! నేనే ప్రేమించుచున్నాను. నిజముగ నేనే నిన్నుఁ బ్రేమించుచున్నాను. ఎందుకు ప్రేమించుచున్నానో చెప్పలేను. అది కష్టమో, సుఖమో, కష్టసుఖములకు వెలియైనదో కూడఁ జెప్పలేను. కాని, నీవు నన్నుఁ బ్రేమించుచున్నావని తెలిసికొన్నప్పుడుమాత్రము అనిర్వచనీయమైన సుఖమే యనుభవమునకు వచ్చుచున్నది. నీమూలముననేగాక ప్రేమించుటలో నింతటి సుఖమున్నదని నాకెట్లు తెలియును?

కీరి—ఔను. ఇప్పుడు నీవు గ్రహింపఁ గలిగినదియు, నే ననుభవింపఁగలిగినదియు నొక్కటే-స్నేహానుబంధరూపమైన యొత్తిడిచే హృదయమునందలి మఱపుతెర జాఱిపోయినప్పుడు సుఖానందసురుచిరమైన ప్రేమమూర్తియే ప్రత్యక్షమగును.

శారి—అట్లే యైనది. ఏమిచ్చిన నా దివ్యసుందరమూర్తి నాహృదయసింహాసనము నందు శాశ్వతముగ నెలకొనియుండునో సెలవిచ్చి నన్ననుగ్రహింపుము.

కీరి—నే ననుగ్రహించుటయు, నీవు గ్రహించుటయునా? ప్రేమార్ద్ర హృదయులకుఁ బరస్పరావిజ్ఞేయము లేమున్నవి?

శారి—హృదయేశ్వరా! లేవు. ఐనను నాకీవరమిమ్ము. ఈ హస్తములతో ఆ పాదపద్మసేవఁ జేయుదును. ఈ యానందబాష్పములతో అర్ఘ్యమొసంగుదును. ఈ యల్పభాషణములతో నామసంకీర్తనముఁ గావించుకొందును. ఈ చిన్ని హృదయముతో నా ప్రేమఫలము నర్పించుకొందును. ఇంకేమీయవలయునో చెప్పుము! ఇంకేమి మిగిలియున్నదో సెలవిమ్ము!—

కీరి—(ఆనందబాష్పములతో) హృదయేశ్వరీ! నీకీయరానిది లేదు. నాకుఁ గోరఁదగినదియును లేదు.

## 3

శారి—నావెన్నెలతేటీ! మగధీరుఁడవగు నీకా కన్నీటిబిందువులు?—

కీరి—ఆముత్యాల హారముతో నాబంగారుబొమ్మ నలంకరించుకొందమని—

శారి—నాకన్నులలో వెలుఁగా! జ్ఞానస్వరూపుఁడవగు నీకా శోకబహుళపథాంధకారము?—

కీరి— నామాణిక్యకిరీటము నాకటికిచీకటిముసుఁగులో దస్యులకంటఁ బడకుండ దాఁచుకొందమని—

శారి—నామన్మోహనమూర్తీ! గభీరహృదయుండవగు నీకా కరుణగీతములు?—

కీరి—నాప్రణయవిద్యాధిదేవతను ప్రస్తుతించుకొందమని—

శారి—సముద్రగామినినైపోవుచున్న యాసరస్వతీస్రవంతిలోఁబడి నీవును గొట్టుకొనిపోవుట యెందుకు?—

కీరి—అనంతమగు నాప్రేమసముద్రములోఁ గలిసిపోవుదమని—

శారి—కలసిపోవుదువా? ఎవ్వరితోఁ గలసిపోవుదువు? ఎంతటిస్వార్థపరుఁడవు? ఇఁక నామాటయేమి?

కీరి—వెఱ్ఱిదానా! ఎంతటిజేలవు! నా ప్రేమసుధాసాగరము నీలోనిదే కాదా?

శారి—నిజమేనా? అది నాలోనిదేనా? నాలో నేమున్నదో నే నింకను బరీక్షించుకోనేలేదు! నా కాపరీక్షయే యక్కఱలేదు. నాకు నీకంటె నన్యమేదియునుదలఁపునకుఁదట్టకుండవలయుననియే నాదీక్ష.

కీరి—సఖీ! సంకల్పసిద్ధురాలవగు నీవు నీయాత్మీయతను నాకుఁ బ్రసాదించుటచే నేను ధన్యుఁడనైతిని. ఇట్టి వరవర్ణినీవరప్రసాదముం గాంచిన నేను నిన్నేమని వినుతింపవలయునో నాకట్టి పదములు స్ఫురించుటయే లేదు. అన్యచింతలేని యీనాహృదయచలనశబ్దములలో నెట్టియర్థము గోచరించుచున్నదో నీవే గ్రహింపవలయునని యీ మూఁగకన్నులు నిశ్చలకటాక్షములతో నిన్నుఁ బ్రార్థించుచున్నవి. ఇంతకంటెఁ బ్రేమమయహృదయములకుఁ బ్రతిఫలాపేక్ష యేమున్నది?

శారి—(ఆనందబాష్పములతో) హృదయాధినాథా! నేను నిలువున నీరై పోవుచున్నాను. కరఁగిపోకుండ-కాలవాహినికిలోఁబడిపోకుండ—ఎన్ని జన్మములకైన నీపాదపద్మముల నాశ్రయించియుండునట్లునన్నాశీర్వదింపుము!

కీరి—హృదయేశ్వరీ! కాలవాహినులు కదలిపోవుఁగాక! లోకములు ప్రళయవిలీనములైపోవుఁగాక! నాభావాంతరాళమోహనజ్యోతిస్వరూపిణివగు నీకును నాకును విపర్యయము లేదు— విచ్ఛేదము లేదు —వినాశనము లేదు.

---

# రాయలనాటిచాటుపద్యములు: రమ్యతరము లగువానిగాథలు

నడకుదుటి వీరరాజుపంతులు

నిర్వక్ర పరాక్రమమహిమముచే దక్షిణదేశమంతయు స్వకీయైకచ్ఛత్త్రిమునకుఁ దెచ్చి రాజాధిరాజై, నిరుపమాన పాండితీగరిమముచే ననేకాంధ్ర గీర్వాణ గ్రంథములను రచియించి విద్వత్కవిసార్వభౌముఁడై, నిరతిశయభాషాగౌరవముచే (అష్టదిగ్గజాది) సత్కవి పండితబృందమును బోషించి పెక్కుకోశములకు (కృతి) నాయకుఁడై, నిర్మల యశశ్చంద్రికల దశదిశల వెలయించి నిరంతరకీర్తిశరీరుఁడై, భోజునినామమును దాను (ఆంధ్ర భోజ) బిరుదముగ నందినట్లే తన నామధేయము నితర ప్రభువులు (అభినవకృష్ణరాయ) బిరుదాభిధానముగాఁ గైకొనునంతటిభాషాపోషకుఁడై, నిత్యస్మరణీయుఁడై యున్న శ్రీకృష్ణదేవరాయలు, తన సామ్రాజ్యములోని గోపవరగ్రామమందు విదుషీమణియు, కవయిత్రియు నగు 'మొల్ల' యను వనితారత్నము నివసించుచున్న దను నుదంతమును విని, యామెకడకు దాసీజనంబుల,నాందోళికను బనిచి, తన నగరమునకు రావించెను. ఆమెయుఁ దనకై యేర్పఱుపఁబడిన యొకమందిరమునఁ బ్రవేశించి, చక్రవర్తింబోని మహారాజు, కవితాప్రియుఁడు తన్ను గౌరవించునంతటి మహాభాగ్యమును బ్రసాదించిన తన యిష్టదైవత మగు శ్రీరామచంద్రుని కారుణ్యాతిశయమున కెంతయు నానందించెను.

రాజ్యసంబంధము లగు వ్యాపారము లెల్ల ననుదినము ప్రాహ్ణసమయమునందే నిర్వర్తింపఁబడుచుండుటచే, కృష్ణరాయలు మధ్యాహ్నానంతరము విద్వద్గోష్ఠి నెఱపుచు వినోదించుచుండును. ఆనాఁటిమధ్యాహ్నము మొల్లకవిరత్నమును గౌరవించుటకై మహారాజు కవిపండితసభ నొకదాని నేర్పరించి, యక్కవయిత్రీమణిని దనయాస్థానికి రప్పించెను. వేదాధ్యయనసంపన్నులు, విచక్షణప్రకాండులు, విద్వత్కవితల్లజులు, వివిధకళానిపుణులు మొదలగువారాసదస్సు నలంకరించియుండిరి. ఆమానినీమతల్లియు రాజేంద్రునకును, సభాసదులకును బ్రణామములాచరించి, తనకై యయ్యాస్థానమున వేఱుగ నిర్ణయింపఁబడినపీఠముపై రాజునానతి నాసీనయయ్యెను. కుశలప్రశ్నాదికము, సముచితశాస్త్రప్రసంగాములు నైన పిమ్మట శ్రీకృష్ణదేవరాయ లామెకవిత్వవిశేషముల నెఱుంగనభిలషించెను. అప్పు డామె తన రామాయణములోని కొన్నిఘట్టములను మృదుమధురకంఠస్వరమున సభాస్తారు లెల్లరు నానందాశ్చర్యవారాన్నిధినోలలాడు నట్లు చదివి వినుపించెను. అయోధ్యాకాండములోని

"సుడిగొని రాముపాదములు
    సోఁకినధూళి వహించి ఱాయి యే
ర్పడ నొకకాంత యయ్యెనఁట!
    పన్నగ నీతనిపాదరేణు వి
య్యోడ వడి నోడ సోఁక నిది
    యెట్లగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాముపద
    కంజయుగంబు భయంబుపెంపునన్."

అనుపద్యమును జదివినప్పుడు కవిపండితాదులు దానిభక్తియుక్తుల కలరి,

"ఆహా! ఏమి మనోజ్ఞభావము! సంస్కృతాంధ్రరామాయణములయందు లేని యపూర్వభావమే యిది! మేలు! మేలు! మొల్లకవిమతల్లీ! నీగ్రంథరచన మపురూపముగ నున్నదే!" అని యామెను బ్రశంసించిరి. మఱియుఁ గిష్కింధాకాండములోని

* "ఓలము వంచి, యొయ్యనర
    ఘూద్వహుఁ డమ్మరిఁ బోసి శబ్దవి

* ఇది తాళపత్త్రిగ్రంథపాఠము. "సాలముపొంతనిల్చి రఘుసత్తముఁ" డని నాకు లభించిన యచ్చుప్రతులపాఠము. పూర్వపాఠమే మేలుబంతి; సరసమును.

న్మూలము దాఁక విల్దిగిచి
ముష్టియు, దృష్టియుఁ గూర్చి గోత్రభృ
త్తూలము వజ్రపాతహతిఁ
గూలువిధంబునఁ గూలనేసె న
వ్వాలిఁ బ్రతాపశాలి † మృడ
వందనశీలి సురాలి మెచ్చఁగన్."

అనుపద్యమును వినఁగానే యొకపౌరాణికాగ్రేసరుఁడు,

"ఆహాహా! కవనమా, అమృతమా యిది? ఈ ఘట్టమున, పూర్వరామాయణములందు, శ్రీరాముఁడు వింటినారిని బాణము సంధించునప్పుడు పొడమిన చప్పుడే ప్రళయకాలనిర్ఘోషమువలె నుండెననియు, నాధ్వనికి మృగములు, పక్షులు దిక్కుదెలియక నానాముఖములఁ బాఱిపోయెననియు, లోకములు ఘూర్ణిలె ననియు నింక నేమేమో వర్ణింపఁబడియున్నది. అట్టి జ్యానినాదమును విని వాలి యేల జాగరూకుఁడైయుండలే దనుసంశయమున కెడమీయకుండ నిక్కవిమతల్లి 'ఒయ్యన యమ్మురిఁ బోసి' నట్లు రచియించి యౌచిత్యమును లెస్సగాఁ బాటించినది. ఆహా! స్త్రీయైన నేమి? కవనపాటవమున నీమె పురుషులకు దీటుగుచు నచ్చటచ్చట వారికవితలకు మెఱుఁగులువెట్టుచున్నది!"

అని శ్లాఘించెను. అష్టదిగ్గజము లని యభినుతింపఁ బడు అల్లసాని పెద్దనార్యాదికవిశేఖరులు, అతిలలితంబగు నామెసుకుమారకవిత్వశైలికిని, పదార్థగౌరవమునకును, అతిశయరసభావమాధుర్య గాంభీర్యాదులకును గడుగడు నలరుచు, అభినందనసూచకంబు లగు నవలోకనంబుల నొండొరులఁ జూచికొనఁజొచ్చిరి. రాజేంద్రుఁడును పరమానందసంభరితస్వాంతుఁడై, మొల్ల నుద్దేశించి, యత్యంతగౌరవముమెయి "విదుషీమణీ, కవయిత్రీమతల్లీ, నీపాండిత్యవిశేషమునకును, నీగ్రంథరచనాసామర్థ్యమునకును, మృదుమధురపదప్రయోగకౌశలమునకును, ఔచితీనిర్వహణమునకును నే నెంతయు ముదము నందితిని. ఆంధ్రకవిత్వము ప్రబలి నేఁటికైదాఱువందల యేండ్లయినను నేఁటిదనుక నీవలెఁ గవిత్వమును జెప్పిన యబలామణి యెఱుఁగ రాలేదు. ఇవ్విషయమున నాంధ్రయోషారత్నములలో నీవే ప్రథమగణ్యవుగాఁ గానంబడుచున్నావు. సాధ్వీ, ఆశుకవిత్వమునందును నీవు మేటి వని విందును. ఏదే నొక పద్యము నాశువునఁ జెప్పి యీసభాస్తారులకు హర్షము నొడఁగూర్పుమా!" అని వచియించెను.

అప్పు డామె తనపీఠమునుండి లేచి వినయవినమితోత్తమాంగయై కరంబులు ముకుళించి, "ప్రభువరా, ప్రాజ్యవసుమతీరాజ్యమునకే కాక, ప్రకౢప్తకవితాసామ్రాజ్యమునకును మీరు పట్టభద్రులు. మీ యాస్థానకవిశేఖరులో, అష్టదిగ్గజము లను ప్రఖ్యాతి నందినవారు. తక్కిన పండితప్రకాండులు సమస్తవేదశాస్త్రపురాణేతిహాసవేత్తలు. ఇట్టి మీరు నా యల్పకవిత్వమును బెద్దగఁ బొగడియుంటిరి. తనయుల తొక్కుపలుకులు తండ్రులకు ముద్దు గాదొకో! దేవా, ఆసుపద్యరచనము ఇట్టిమహాసభయందు, ఇట్టి కవిసింహుల సన్నిధిని నను బోఁటిబోటికి సాధ్యమగునా? 'ఒక్క పద్యపాదమునేని వ్రాయవ్వఁగలనా?' అని భయపడుచున్నాను. అయినను శ్రీరామచంద్రుని యనుగ్రహాతిశయంబునను, భారతీదేవి కారుణ్యవిశేషంబునను, దేవరయాజ్ఞానుకంపాబలంబునను, సభాసదుల యాశీఃప్రభావంబుచేతను నా నేర్చినకొలంది నాశుపద్యరచనమునకై ప్రయత్నించెదను. ప్రభూ! ఏవిషయమునుగూర్చి యేవృత్తమును జెప్పవలయునో యనుగ్రహించి యానతీయవేఁడెదను." అని విన్నవించెను.

ఆమెవిజ్ఞాపనము నాకర్ణించి యమ్మహారాజచంద్రుఁడు తనదృక్చ్కారికలను కవివ్రాతంబుపైఁ బరగించెను. ఏదేనొక విషయమునుగూర్చి యడుగవలయునను భావము రాజవిలోకనములందు పొడకట్టుచుండెను.

---

† మృదునందన, మృగువందన-అని యచ్చుప్రతులు. మొదటిది బొత్తిగ తప్పు; రెండవది యర్థరహితము. కావున 'మృడవందనశీలి' అని యుండఁదగును. (వాలి శివభక్తాగ్రగణ్యుఁ డనుటకు:—"కపాలిపాదయుగ రాజీవాలి వాలింబడన్." హరిశ్చంద్రనలోపాఖ్యానావతారిక—ఇత్యాదులు ప్రమాణములు.

అప్పుడు పెద్దనార్యుఁడు ముక్కుతిమ్మనార్యుని మొగమును దృష్టించెను. తిమ్మనార్యుఁడును (మాదయగారి) మల్లనకవిశ్రేష్ఠుని మోమును గనుఁగొనియెను. మల్లనకవి యయ్యలరాజు రామభద్రకవీంద్రుని బుజమును గోఁకెను. రామభద్రకవి ధూర్జటికవిచంద్రునిఁ గాంచి కన్నుగిఱిచెను. ఇట్లే కవీంద్రు లందఱు నొండొరులకు సన్నలు చేసికొనుచుఁ దుదకుఁ దెనాలిరామకృష్ణకవిని ప్రాశ్నికునిగా నేర్పఱిచిరి. రామకృష్ణకవియుఁ గంఠమును మెల్లఁగ సవరించుకొనుచు లేచి మొల్ల నుద్దేశించి,

"కవిరత్నమా, నీ శేముషీవిశేషంబునకును, కవితాసామర్థ్యమునకును, వినయవిధేయతాది సద్గుణసంపత్తికిని మహారాజుఁదొట్టి కవిపండితవర్యు లెల్లరు సమ్మోహనిమగ్నమానసులైరి. ఇఁక నీయాశుకవిత్వమహిమను వెల్లడించి వీరిప్రమోదము ద్విగుణముగునట్లొనర్పుము. ఆశువున నీవు చెప్పవలసిన పద్యమున నుండవలసినసంగతులను దెల్పెదను వినుము :

"మకరికిఁ జిక్కి నకనకలుగుడుచుచు, వికలహృదయుఁడై తన్నుఁ గాపాడుమని ప్రార్థించు గజేంద్రునిఁ బరిరక్షింప సంభ్రమాయత్తచిత్తుఁడై, వైకుంఠనగరమునుండి చనుదెంచు శ్రీమహావిష్ణుని ప్రయాణవిశేషము నొకసీసపద్యమున నభివర్ణింపవలయును. సీసపాదములు నాలుగిట వరుసగా,

"సుమ్మ్ర, బుస్స్ర, జింగ్ర, బోణుఁగ్ర"

అనుపదము లుండవలయును. మఱియు, నితాంతభయాకులుఁడై, ప్రాణములమీఁది యాసను వదలుకొని మొఱపెట్టుచున్న యగ్గజరాజునకుఁ గడుదూరమున నుండియే శ్రీమన్నారాయణుని యభయప్రదానవాక్కులు వినఁబడుటయుఁ, దదీయసందర్శనచిహ్నము కనఁబడుటయు నొక్కమాఱే జరిగిన ట్లుండవలయును. ఈనియమములను బాటించుచు, నాశుపద్యరచనమునఁ గల నీప్రజ్ఞావిశేషమును జూపి యీసభాసదుల మెప్పునందుము." అని పలికెను.

"ఓహో! ఎంతవిషమమైనపరీక్ష!" అని రాయలు తలంచెను. "అకటా! ఒకయాఁడుదాని నాశుకవనమున నింత సేసి చిక్కులుగల నిబంధనములతోఁ బరీక్షింతురా?" అని సభ్యులు చింతింపఁగడంగిరి.

అప్పు డక్కవయిత్రీరత్న మొక్కనిమేషమాత్ర మాకసమువంక దృష్టిని బఱగించి, శ్రీరామచంద్రమూర్తిని మనంబున నిల్పి, తనయాశుకవితామహత్త్వము తేటపడ మృదుమధురగంభీరస్వరముతో నీక్రిందిపద్యమును జెప్పెను:

"అనిలాభిహత దక్షిణావర్త శంఖంబు
సుంపితంబై కేల "సుమ్మ్ర"రనఁగ*
సోడు గయి తఱచుగాఁ బడగ లొక్కెడఁ దట్టి
భుజగాధిపతి మీఁద "బుస్స్ర"రనఁగ*
చఱచి నిబ్బరముగాఁ బఱతెంచు ఖగరాజు
ఱెక్కగాడ్పులు మింట "జింగ్ర"రనఁగ*
దొంతిబ్రహ్మాండపంక్తులు బొజ్జలో నుండి
బెణఁకియొక్కొక్కమాఱు "బోణుఁగ్ర" రనఁగ*
కూఁకకనుమాపుమేరకుఁ గోక విసరి
వెఱకు! వెఱవకు! వెఱవకు! వెఱవ! కనుచు
నుద్దవడి వచ్చి గజరాజునొద్ద వ్రాలె
నార్తరక్షణచణుఁడు నారాయణుండు."

అత్యంతమనోహరమైన యిప్పద్యము నాలించి నంత సభాస్తారులయుల్లంబులు సంతోషాశ్చర్యాదులచే నొక్కమాఱుగ నుప్పొంగెను. వారినేత్రములనుండి యానందబాష్పములు వెల్లివిరిసెను. సభయంతయు నొక్కక్షణము నిశ్శబ్దమయ్యెను. తరువాత "ఆహాహా! ఓహో హో!" ఇత్యాదిప్రశంసనార్థకములు వెలువడెను. అప్పుడు రామకృష్ణకవి మొల్లకవి కిట్లనియెను:

"సెబాస్! కవయిత్రీమణీ! నీపద్యము హృద్యమై నీయాశుపద్యనిర్మాణప్రాగల్భ్యమును వెల్లడించుచున్నది. నీ ప్రజ్ఞావిశేష మసదృశము. భారతీదేవి కారుణ్యకటాక్షము నీపైఁ బరిపూర్ణముగఁ బ్రసరించుచున్నది. 'ఇతరు లెవ్వరైన నింత రసవత్తరముగఁ

* అనుకరణమున రేఫాగమము.

జెప్పఁగలిగియుండురా ? ' యని యాశ్చర్యపడఁ దగినం తటి భక్తిరసముతోడను, భావమాధుర్యముతోడను, మనోజ్ఞపదవిన్యాసముతోడను బరిఢవిల్లుచు, నీపద్యరాజ మమ్మహావిష్ణువు నగ్గజరాజునకేకాక మాకును సాక్షాత్కరింపఁజేయుచున్నట్లున్నది. నాయడిగిన పదములనన్నిటి నమితప్రౌఢి మెఱయ, నాయాసీనపాదములయందు సంపర్భశుద్ధిగా సంధానించి నాయాశయమునకనుగుణముగ నిరుపమానపద్యరత్నమును రచియించి సభ్యుల కంఠములకు సెనలేనిముదంబు నొనఁగూర్చితివి. కాని, చూడుము, మొల్లా, నీయాపద్యమును వచించు సమయమున నీకు శ్రీ మహావిష్ణుని జగన్మోహనావతారము ప్రత్యక్షమైనదా యేమి, యాదేవుఁడు 'కోక' విసరినట్లు చెప్పి యాతనికి 'కోక' నంటఁగట్టితివి?"

చిఱునవ్వుతోడి యక్కవిచంద్రుని వాక్యములను విని యాసీమంతినీమణి రామకృష్ణకవితో, 'కవిసత్తమా, హాస్యప్రియు లగుట మీ రట్లు చమత్కరించితిరి గాని, 'కోక' శబ్దము సామాన్యవస్త్రపర్యాయముగా నుండుటమాత్రము మీ రెఱుంగనిదియా? కవిబిడౌజా, నాయల్పకవనమును మీరు మిక్కిలియుఁ బెద్దచేసిపొగడియున్నారు. కాని, యది మీ కోక లెక్కలోనిదా? మీపదగుంభనం బొరులకు సాధ్య మగునదియా?" అని వక్కాణించెను.

పిమ్మట మహారాజు మొల్లను వీక్షించి, "కవయిత్రీమతల్లీ, నీపద్యము ప్రబంధరాజములలోని పద్యమువలెఁ గడుంగడుఁ బ్రౌఢమై, హృదయంగమమై, సరళమై యలరారుచున్నది. తొలుదొల్త రామకృష్ణకవీంద్రుఁ డేర్పఱచిన నిబంధనములనువిని నీ వీపద్యము నీరీతిని నిర్వహింతు వని నేను తలఁచియుండలేదు. ఆహా! స్త్రీవై యుండియు నిట్టి ప్రజ్ఞావిశేషమును జూపిన నిన్నెంతయైన పొగడవచ్చునుగద! ఇట్టి కవితాసామర్థ్యమును జెందియున్న నీకుఁ గానుకగా, నీవు నివసించు గోపవరగ్రామమును సకలస్వాతంత్ర్యములతోడను ఇచ్చితిని. ఇతోధికముగఁ గవిత్వాభివృద్ధి నొనర్చుకొనుచు సుఖముండుము." అని పరమప్రీతి మెయిఁ బలికెను.

మొల్లయు సెనలేనిముదంబు మనంబునఁ బెనంగొనఁ గృష్ణరాయలకు నమస్కరించుచు లేచి "రాజాధిరాజా, విబుధసంసేవితుం డగు శ్రీమహావిష్ణువుం బోలెఁ బ్రకాశించుచున్న దేవరసందర్శనము చేతనే నాజన్మము సార్థకమైనదని నేనానందించుచుండ, నొక గ్రామమును సైతము నాకు దయచేసి నా యానందమునకు మేరలేకుండు ననుగ్రహమును జూపినారు. నా జీవితకాలమంతయు శ్రీప్రభువువారికిఁ గృతజ్ఞురాలనై యుండెద ననుటకన్న నెక్కుడుగ నేను విన్నవింపఁజాలను. ఏలిక నిష్కంటకపరిపాలనముచేతనే నాయట్టియబల నిశ్చింతురాలై, నిరంతరాయ మగువిద్య నభ్యసించు భాగ్యమునకుఁ బాత్ర మైనది. ఇట్టి ధర్మప్రభువు చిరకాలము మమ్ముఁ బరిపాలించునట్లు శ్రీరామచంద్రుఁ డనుగ్రహించుఁగాక యని ప్రార్థించుచున్నాను." అని విన్నవించి రాజునానతి మరలఁ బీఠముపైఁ గూరుచుండెను.

రాయలమనంబున కానాఁడు మొల్ల చెప్పిన యొక్కపద్యముతోడను(ఆశుకవిత్వమున)సంతృప్తికలుగలేదు. అదియునుంగాక తనయాస్థానకవుల యాశుకవితామహిమము సైతము మొల్లయెదుట వెల్లడింపఁబడవలయు నను నభిప్రాయమును ఆయనకుఁ గలిగెను. అప్పు డా రాజేంద్రుఁడు అల్లసాని పెద్దనకవీంద్రు నవలోకించి, "ఆంధ్రకవితాపితామహా, మీరును నేడొకపద్యమును నాశువున రచియింపుఁడు." అనియానతిచ్చి, యాక్షణము ప్రధాన మంత్రివైపునకుఁ దన చూడ్కిని మరల్చెను. పరేంగితజ్ఞశిరోమణి యని ప్రసిద్ధిని గాంచిన తిమ్మరుసు మంత్రీంద్రుఁడు వేయునూటపదియాఱేసి సువర్ణములు గల వెండిపళ్లెరముల రెంటిని తెప్పింప సహాయమంత్రికి సంజ్ఞచేసి, యేవిషయమునుగూర్చి యేపద్యమును జెప్పుదునా యని యాలోచించుచు లేచు పెద్దనకవి నవలోకించి, "కవివర్యా, ఇప్పుడకదా మొల్లకవయిత్రి శ్రీ మహావిష్ణునింగూర్చి పద్యమును రచియించినది? ప్రత్యక్ష విష్ణుస్వరూపుఁడై మనలఁ బరిపాలించుచున్న మనరాజ పురందరునిగూర్చి యేదియే నొకవృత్తమున నభివర్ణిం

పుఁడు" అని పలికెను. అప్పుడు* కవిత్రయమున శుద్ధి యని పొగడుఁగాంచిన పెద్దనకవిసింహుఁడు,

† శరసంధాన, బల, క్షమా, గురుతరై
శ్వర్యంబులుం గల్గి, దు
ర్భరషండత్వ, బిలప్రవేశ, చలన,
బ్రహ్మఘ్నతల్ మానినన్
నర, సింహ, క్షితిమండ, లేశ్వరుల నె
న్నన్ వచ్చు నీసాటిగా,
నరసింహక్షితిమండలేశ్వరుల కృ
ష్ణా! రాజకంఠీరవా!"

అనుపద్యము నాశువున రచియించుచుఁ జదివెను. సభ్యులందఱు నాతనియల్లికబిగితోడి కవిత్వ గరిమకు నెంతయు నానందించిరి. మొల్లయుఁ బెద్దనార్యుని శబ్దచిత్రి గల కవనశక్తికిఁ గడుంగడు సంతసమందెను. పెద్దనకవి పద్యమును ముగించునప్పటికే వరాలపళ్లెరములు రెండును దెప్పింపఁబడి రాజసింహాసనముచెంతనున్న పీఠముపైఁ బెట్టింపఁబడెను.

అంతట, తెనాలి రామకృష్ణకవి "ఆఁగుఁడు! తాతగారూ! ఆఁగుఁడు!" అనుచు లేచి "పద్యము మేలైనదియే, మిక్కిలి ప్రౌఢముగ నున్నది. మఱియు మీకవనంపు సొంపును వెల్లడించుచున్నది. కాని, యొక సందేహము గలదు. గుహలో దూఱుచట్టి యవగుణము గలది యని యిప్పుడె సింహముపై దోషము నారోపించియు, మరల నాసింహమునే తోఁకఁబట్టుకొని లాగుకొనివచ్చి "రాజకంఠీరవా!" అని రాజుచెంత నిలుపఁ బెట్టితిరేమి? "కళంకము లేకున్న, చంద్రుని నీమోముతో సాటిచేయవచ్చు రాజచంద్రా!" అనినట్టు లున్నది మీ పద్యము!" అని దరహసితవదనుఁడై పలికెను. సభాసదులెల్లరు నాశ్చర్యము మెయి మహారాజుమోమువంకకును, పెద్దనకవిముఖమునైపునకును జూడసాగిరి.

మహారాజు చిఱునగవుతోఁ 'రామకృష్ణకవిచంద్రా, మీరును నొకపద్యము నాశువునఁ జెప్పుఁడు!' అని వచియించెను. అప్పుడు రామకృష్ణకవి గంభీరస్వరముతో

"కలనం దావక ఖడ్గఖండితరిపు
క్ష్మాభర్త ‡ మార్తండమం
డలనిర్భేద మొనర్చి యేఁగు నెడఁ ద
న్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీటధారి యగు శ్రీ
నారాయణుం గాంచి లోఁ
గలఁగంబాఱుచు నేఁగె నీవయను శం
కం గృష్ణరాయాధిపా!"

అనుపద్యము నవిలంబితరచనముగఁ జదివెను. "ఆహాహా! ఎట్టిరసవత్తరమైనపద్యము! బళే! ఇక్కవి చంద్రము పదగుంభనము! భావమో, హృదయంగమము!" అని సభ్యులు ప్రశంసింపఁదొడంగిరి. రాజేంద్రుఁడును రామలింగకవికవితాసామర్థ్యమునకు మిగుల హర్షించెను.

అనంతరము వేఱొక వేయునూటపదియాఱులు సువర్ణములు గల పళ్లెరమును దెప్పింపఁబడియెను. రాజు నానతిని పెద్దనార్యుఁడును, రామకృష్ణకవియు, మొల్లకవయిత్రీమణియు నొక్కొక్క పళ్లెరమును గైకొని యానందించిరి. సభవారును సంతసించిరి. మొల్లయు మహారాజునకు నమస్కరించి తదాజ్ఞను బడసి స్వగ్రామమును జేరి, తల్లిదండ్రులకును, దక్కినవారికిని నెనలేని ముదంబును గూర్చుచు సుఖముండెను.

* "ఇద్దఱుజోడు నన్నకవి, యెఱ్ఱన; తిక్కనసోమయాజి తా,నద్దగు వారికిన్; మువురి కొక్కఁడె దీటగు నల్లసాని మా,పెద్దన......"అని కణాదము పెద్దనసోమయాజి.

† నరసింహరాయల పుత్త్రుఁడవైన యోకృష్ణరాయా! బాణములనేర్పు (నేర్పు)ను, బలమును, ఓర్పును, గొప్పసంపదయుఁ గల్గియుండియు—అర్జునుఁడు, సింహము, భూమియు, ఈశ్వరుఁడును (వరుసగా, షండత్వము (బృహన్నలత), గుహయందు దూఱుట, కంపము (బీహారుభూకంపమువంటిది!), బ్రహ్మహత్యాదోషము (ఈ దోషముచేతనే శివుఁడు బిచ్చగాఁడయ్యెను.)—అనులోపములు లేనిచో నీతో సాటియగుదురని తాత్పర్యము.

‡ యుద్ధమునఁ జచ్చినవీరులు సూర్యమండలమును భేదించుకొనిపోయి వీరస్వర్గమును జూఱకొందురనియు, శ్రీమహావిష్ణువు భానుమండలమధ్యప్రవర్తియై యుండుననియు మనవారి యభిప్రాయము.

# భగీరథ నిర్వాహణము

**తుంపూడి భగవంతంగుప్త**

భగీరథుడు గంగను భూలోకమునకు తెచ్చినట్లు పురాణములు చెప్పుచున్నవి. గంగ అనగా ప్రవాహమని అర్థము గనుక, భగీరథుడు తెచ్చిన ప్రవాహము భాగీరథీనదియో, లేక హిమాలయపర్వతముల నుండి బంగాళాఖాతమువరకు వ్యాపించియున్న సంపూర్ణనదియో స్పష్టమగుట లేదు. కైలాసపర్వతప్రాంతమున పుట్టు భాగీరథీ అలకనందానదులు చేరి గంగానది అగుచున్నది. ఇందు ప్రయాగవద్ద యమునానది సంగమించుచున్నది. తర్వాత గంగయందు కలియు ఉపనదులలో భాగల్పూరువద్ద చేరు మరియొకభాగీరథి కలదు.

విష్ణుపాదమం దుండిన గంగ శివుని జటాజూటమందు చేరి భూలోకమున ప్రవహించినది భగీరథప్రయత్నమువలన నని చెప్పుచున్నారు.

భగీరథుడు గంగను తెచ్చినది కపిల శాపమున దగ్ధమైన తన ప్రపితామహుల భస్మరాసులమీద ఆ జలముల పారించి వారిని తరింపజేయుటకు. గంగ వచ్చుచుండగా భగీరథుడు వెనుక తిరిగిచూడగూడదట. చూచినచో గంగ అక్కడనే నిలిచిపోవునట. దారిలో గంగ జహ్నుమునిఆశ్రమమున ప్రవేశించగా ఆమహాముని దానిని పీల్చివైచినను భగీరథుడు ప్రార్థేయపడగా మరల విడిచెనట. అందుచేతనే గంగ జహ్నుసుతయై జాహ్నవి యనబడుచున్నది. భగీరథప్రయత్నము అసామాన్యప్రయత్న మగుటచే, విశేషకష్టములతోకూడిన గొప్పప్రయత్నములను భగీరథప్రయత్నములని వాడుకగా చెప్పుచున్నారు.

ఈపురాణగాథలను యోచించగా యూరపియనులు సూయజ్ కెనాలును, అమెరికనులు పనామాకెనాలును త్రవ్వినట్లు భగీరథుడు గంగానది ప్రవహించుటకు తగిన త్రవ్వకపుపనులు చేసినట్లు తోచుచున్నది. విష్ణుపాదమందు గంగ నివసించుచుండె ననగా ఆకాశమందు విహరించు మేఘములను సూచించుట. వర్షజలము హిమవత్పర్వతశిఖరములందు పడి మంచుగడ్డలగుటయే కైలాసశిఖరవాసియగు శివుడు గంగను తన జటాజూటమందు ధరించుట. ఎండకాలములో ఈ మంచుగడ్డలు కరిగి పర్వతములమధ్య సరస్సులుగా నిలిచియుండవచ్చును. ఆజలమును నదిగా ప్రవహింపజేయుటకు భగీరథుడు రాళ్లురప్పలు తీసి, గట్టులు తెగగొట్టి దారి చేసియుండవలెను. ఇట్లు జలము పర్వతముల నుండి వెలువడినను సార్థకముకావలెనన్నచో అది యొకదారిని ప్రవహించవలెను.

ఇందుకును అక్కడక్కడ త్రవ్వకము ఆవశ్యకమై యుండును. ప్రయత్నము ఎక్కడ ఆపినను అక్కడ జలము ఒక దారిని, కావలసినచోటికి నడవక నలుదెసల పొర్లి పోవును. కనుకనే భగీరథుడు నిరంతరకృషి చేయుచు గంగకు ముందుపోవుచుండెను. జహ్నుముని ప్రదేశములో గంగ ఒకపల్లము లోనో, భూమిలోని పగుళ్లలోనో పడిపోగా ఆమునీశ్వరుని సహాయముతో భగీరథుడు దానిని అచ్చటినుండి వెడలించియుండవలెను. భస్మరాసులమీద గంగ ప్రవహించుట భగీరథసంకల్పము. దీనిభావము కొంచెము యోచించిన గోచరమగును. భగీరథుడు తెచ్చిన గంగ పారుచుండినప్రదేశము పూర్వము నిర్జల ప్రదేశమైసస్యరహితమైయుండుటచే, యెండల కోర్వలేకను క్షామబాధపడలేకను జనులుమల మలమాడి చచ్చుచుండవచ్చును. కపిలాశ్రమమునకు పోవుచుండిన భగీరథప్రపితామహులగు సగరపుత్రులు ఇట్లే మడిసియుండవలెను. మానవసేవాపరాయణుడగు భగీరథుడు ఈ బాధల నివర్తింపజేసి దేశము పైరుపంటలతో తులతూగునట్లు చేయుటకుగాను ఈ పనికి పూనుకొని కృతార్థత పొందియుండవలెను. వర్షాభావముచే దుస్సహక్షామములకు లోనగుచుండిన వేగినాడు కృష్ణాగోదావరీకాలువలవలన నిరంతరసౌఖ్యదాయకము కాలేదా? భగీరథునికిముందు అతనితండ్రి దిలీపుడును, అతనికిముందు అతనితండ్రి అంశుమంతుడును ఈపనికి పూనుకొనిరిగాని వారి ప్రయత్నములు సఫలీకృతములు కాకపోయెను. అంశుమంతుని ఈపనికి పురికొల్పినది మహాత్ముడైన కపిలాచార్యుడు. ఇప్పుడు జరుగుచున్నట్లే పూర్వము జరిగిన ఘనకార్యములు జనులు సులభముగ జ్ఞాపకముంచుకొనుటకును, వినోదముగ చెప్పుకొనుటకును కథారూపమును దాల్చినవి.

కథను విప్పిచూడగా భగీరథుడు గొప్ప ఇంజనీయరయియుండినట్లు ఏర్పడుచున్నది.

---

## తృతీయాంకము

### రెండవరంగము - జయంతాశ్రమము

(పరమహంస కూర్చుండియుండును. ప్రవేశము ధర్మాంబ)

ధర్మాంబ—(కుమారునిఁ దలఁచుకొనుచు) చిరంజీవిమనోవృత్తి యెటులనున్నదో! తానొక యింటివాఁడై దేవేరితో రాజ్యంబొనరించుచుండ నిశ్చింతతో నేనును గురుసేవ లొనరించుదానను గదా! ఇంతకును గలవాని కేమయిన పట్టుచిక్కినదో లేదో! పాప మదిమాత్ర మేమిచేయఁగలదు. నేఁటి వేకువను జంద్రగిరినుండి వచ్చిన బ్రాహ్మణునివలన బుద్ధిమతి సదా నిరంజనధ్యానమునఁ బాటలుఁ, బద్యములు నతనిపైనల్లి తద్గుణకీర్తనంబు సఖీజనులకడఁ గావించుచుండునని వింటిని. నిస్తరంగ సముద్రమువలె నిరాకులముగనున్న నామనంబీపుత్రస్నేహమున మిక్కిలి కలతఁ జెందినది.

ఆసలఁ గోసితిన్ బరమ
హంసఘునీంద్రులఁ గొల్వరాజ్యమున్
బాసితి నాథుపద్ధతిఁ ద
పం బొనరించితినార! పుత్రుపై
వాసనపోకపోయె గృహ
పాశనిబద్ధమృగాక్షు లేక్రియన్
జేసెద రాత్మచింతనము
శ్రీగురు సన్నిధి భక్తియుక్తలై.

ఆమహారాజునిస్పృహత యెట్టిదోకాని తనయుఁడనఁడు, రాజ్యమనఁడు. నా కిందు సద్గురుచరణమే శరణమగు. (అని యాశ్రమమునుండి గోష్ఠీమందిరమునకుఁ బోవును.)

పరమ—(గోష్ఠీమందిరమున 'ఆనందః ఆనందః' అని యానందస్మరణముచేయుచుండును.)

ధర్మాంబ—(పరమహంసకు నమస్కరించి)

చ. ఎవనిపదాబ్జముల్ గొలువ
నిందుకళాపు ముకుందుఁగొల్చుటొ
నెవనియపాంగవీక్షణ మ
దీశునిఁజేయును ఛాత్రకోటినే
నవరసమూర్తిచర్యయ య
నారతమిచ్చుఁ బ్రబోధసార యా
ప్రవిమలమూర్తిసద్గురుఁ డ
పారముదంబిడు మాకునిచ్చలున్.

పరమ—(ఆశీర్వదించును) ఎన్నండును దైన్యమెఱుంగనిదానవు. నేఁడేమి యిట్లున్నావు?

ధర్మాంబ—స్వామీ! మీచరణయుగళమే నాకు శరణము. అనివార్యమగు పుత్త్రమోహము నెమ్మది కించుక భంగము కల్పించినది.

క. పుత్త్రాదుల నెఱనమ్మక
రాత్రిందివ మొక్కరీతి రాము భజన స
న్మిత్త్రులఁగూడి యొనర్పఁగఁ
బాత్రత నాకిమ్ము పరమపావనచరితా.

పరమ—సాధ్వీమణీ! నీత్రికరణశుద్ధికి మెచ్చితిని. నేఁ జెప్పుదానిని వినుము.

క. చేయమి జ్ఞానంబగునా!
చేయుట యజ్ఞానమెట్లు చేయఁగవలయుఁ
జేయుటలోఁ గామము తే
కేయెడ సుజ్ఞానమిద్దియేసుమి తల్లీ.

అదిగాక నీకుమారుఁడు వరమునఁబుట్టినవాఁడగుటఁ బరమేశ్వరీపాలితుండు. సిద్ధాశీర్వాదకవచితుండు. పెడత్రోవలం బట్టినట్లు కనఁబడినను ధర్మపథంబు విడువకుండు. లెమ్ము.

గీ. త్రిప్పిత్రిప్పిత్రిప్పి తిన్నన నిలుఁజేర్చు
గొడ్డువెంటనంటి గొల్లవాఁడు
త్రిప్పిత్రిప్పి జీవుదిద్దిబ్రోచుభక్త
తత్పరుండు హరి పరాత్పరుండు.

నీవు నిశ్చింత నుండుము.

ధర్మాంబ—చిత్తము.

పరమ—తల్లీ! అచిరకాలంబుననే శారద యను నొక్క మహాయోగిని యిటకు రానున్నది. ఆమెకు తోడు లేక యొంటిగనున్న నీ కామహానుభావురాలితోడి గోష్ఠి మహానందకరంబై యుండు.

క. ఈకలిని జగతి మహిళా
లోకంబునఁ బుట్టువారిలో వింతగదా!
యాకలువకంటి చరితము
సాకము త్వత్ప్రీతికోలెఁ జాలచనవునన్.

ధర్మాంబ—మహాప్రసాదము. ఎఱిఁగింపని యభిమానదోష మ్మాశితుల కుండిన నుండుఁగాక. ఎఱుంగఁ గలసామర్థ్యము మహానుభావులకుఁ గలదుకదా! అట్టి మహానుభావను బుత్రికగాఁ బడయుటకన్న భాగ్యము గలదే!

(ప్రవేశము రాజశేఖరుఁడు)

రాజశే—

శ్లో. వేదాంతశాస్త్రం బగళామహాస్త్రం
శ్రీభాష్యదాస్యం శివసూత్రభాష్యం
బోధామృతం సాధుజనైకసేవ్యా
రక్షంతుచాస్మాన్ భవసర్పదోషాత్.

(అని నమస్కారముచేయును)

పరమ—(ఆశీర్వదించును)

రాజశే—స్వామీ! తమయాజ్ఞానుసారము చిరంజీవినిఁ దోడ్కొనిరమ్మని సుదర్శనునికడకు నొక బ్రాహ్మణునిఁ బంపితిని. వారును వచ్చువేళయయినది.

పరమ—మంచిది. వత్సా! సోమశిలలోనున్న శారదను మనయాశ్రమమునకుఁ బిలుచుకొని వత్తునాయని శర్మయడిగినాఁడు.

రాజశే—దేవరహస్యము పాప మాతఁడే మెఱుఁగును!

**పరమ—(నవ్వుచు)దానికిఁదగిన సంధానము కాల పరిణామమున జరగునులెమ్ము. నీవిందుఁ బ్రయత్నమును మానుము అని మాత్రము చెప్పితిని.**

వటుఁడు—స్వామీ! ద్వారమున సుదర్శనముం త్రివరేణ్యులు మహారాజకుమారునితోఁ దమదర్శనార్థము వేచియున్నారు. సెలవైనఁ దోడ్కొనివచ్చెదను.

పరమ—అవశ్యము లోనికిఁ దోడ్కొనిరమ్ము.

(ప్రవేశము నిరంజనుఁడు,సుదర్శనుఁడు.పరమహంసకు నమస్కరింతురు.)

నిరం—

మునివర నిన్‌గనంగ విడెఁ
బోముడి డెందమునందుఁ బ్రీతి మ
జ్జనకుని బోలెఁ నన్నును వ
శంవదుగాఁగ ననుగ్రహించి నా
జననము ధన్యమౌనటు ప్ర
శాంతపథంబున నిల్పుమయ్య నా
దని యిఁక లేదొకింత యిదె
యాత్మసమర్పణ నీకుఁ జేసితిన్.

బుద్ధితెలిసినదాది పెద్దల బోధనంబు విన్నదేకొంతకాలమోతప్పఁ జిత్తవిశ్రాంతిలేక తపించుచున్న నాకు మీకటాక్షము నాపైఁ బ్రసరించినమాత్రమున మనస్సు చల్లఁబడియెను. ఇట్టి చిత్తవిశ్రాంతి నేనిదివర కెన్నఁడు ననుభవింపలేదు.

ఆ. వె. కొంతకాలమైన శాంతినిచ్చెడు నీను
మూర్తిఁ గాంచనిమ్ము కీర్తిఁగాంచు
మాయ వల్పమగుట హాయిగా బ్రతికెద
భక్తకుతుకసాంద్ర పండితేంద్ర.

సుద—(స్వగతము) ఏమీ! నిరంజనకుమారుఁ డెంతలో మారినాఁడు.

ఆ. వె. సాధుదర్శనంబు సన్మంగళంబను
మాటసత్యమాత్మమహిమగలిగెఁ
జదువులెల్ల నిపుడు సఫలత్వమునుగాంచె
సకల సంప్రదాయ సరణియౌర.

(రాజశేఖరునిచెవిలో నేమియోచెప్పును)

**పరమ—(నిరంజనునివంకఁ దిరిగి) కుమారా! స్వధర్మ పరిపాలనంబున నుతికెక్కి సకలసుకవినికర**

జేగీయమానుండనై పారమహంస్య ధర్మంబునకు రక్షకుండనవయ్యెదనులెమ్ము.

చ. సనకసనందనాదులకుఁ
　　జాలినవాఁడు ప్రపత్తిభావనన్
జనకునిఁబోలె యోగిజన
　　సమ్మతుఁడై హరుఁడై విరక్తి నీ
జనకుఁడు పూర్ణదీక్షఁగొని
　　స్వాశ్రితసంశయముల్ హరించు నీ
తని గని మ్రొక్కి చేకొనుము
　　దత్త్వము ధర్మమురాజనందనా.

రాజశేఖరా! తత్త్వార్థియైన నీబుధునికిఁ గర్తవ్యముపదేశింపుము.

రాజశే—చిత్తము. (పరమహంసకు నమస్కరించును)

పరమ—సిద్ధసంకల్పోభవ. (సుదర్శనునివైపునకుఁదిరిగి) సుదర్శనా! నీవచ్చిన పనిదీరినది. ఆశ్రమారామంబునకుఁ బోవుదమురమ్ము. (అని యిరువురు నిష్క్రమింతురు)

నిరం—

చ. గురుఁడుగురుండు బాంధవుఁడు
　　కోవిదుఁ డజ్ఞనశాయతాత్మునిన్
నిరతముఁ గొల్చుభక్తుఁడును
　　నిర్మలహృత్సరసీరుహుండు సం
సరణ మహాబ్ధితారకము
　　స్వామినిరంతరమత్పరాయణుం
డరమరలేక ప్రోచుత తు
　　- భాయతదృష్టిని నన్నునిచ్చలున్.

(రాజశేఖరునకు నమస్కరించును)

రాజశే—కుమారా! "స్వేతరశబ్దావచ్ఛిన్న పురుషైః సంగంత్యక్త్వా సుఖీభవేత్, జ్ఞానీ యోగీచ" అన్నమాట మఱవకుము. ఆదీయులసంబంధమున శాంతినెపొందినట్లు, తదితరసంపర్కమున భ్రాంతియు వృద్ధిఁజెందును.

కం. తనతోడనైక్యమొందిన
　　మనుజులసేవించి వారి మైత్రిని శాంతిం
　　గనుశాంతియ బ్రహ్మమగుటఁ
　　గనును గరతలామలకముగా మోక్షంబున్.

అనుగ్రహించు సద్గురుండును, ననురూపయైన సహధర్మచారిణియు, ననుకూలమైన యనుచరవర్గంబును మనంబునకు శాంతినొసంగుచుండును. ఎవరిసన్నిధానమునఁ ద్రికరణశుద్ధిగ సంచరించుటకు సర్వకాలసర్వావస్థలయందును సాధ్యమో యట్టి యాప్తబృందమందు సుస్థిరుండైన ధన్యుండే లోకులతోఁ దత్తదనురూపముగసంచరించియుఁ గలతఁ జెందఁడు.

కం. హితముం బ్రియముం దన కెది
　　హితు లడ్డానిని నడుగకయె యొనర్చుచు రా
　　మతి తగులుంగద యేకా
　　గ్రతఁ దా సాధింపఁగోరు కార్యమునందున్.

ఆత్మమనస్సంయోగంబు యోగంబునాఁబడు. పంచేంద్రియంబులకు విషయంబులైన శబ్ద స్పర్శ రూప రసగంధంబులనియెడు నీయయిదర్థంబుల నత్యుత్తమ భంగి ధరించు సుందరీమణితోడి సహయోగంబు భోగంబు నాఁబడు. భోగంబున మానసికానందమును, యోగంబున నాత్మానందమును కలుగును.

సీ. ఆదినారాయణు పాదాబ్జమందు సం
　　　　భవమొందు నమృతంపుబావి మోవి
　　బ్రహ్మసారంబైన ప్రణవాక్షరంబును
　　　　బ్రాణంబుగాఁదాల్చు ఘ్రాణపుటము
　　స్ఫటికాకృతిని వెల్గు పరమపూరుషునిల్పు
　　　　నిర్మలతేజంబు నేత్రయుగము
　　పతిరూపమునుదాల్చి సుతురూపమునఁ దేల్చి
　　　　విపరీతచర్య మెప్పించుమేను
　　యోగమూర్తియు నతులసంభోగమూర్తి
　　దానకీర్తియు సానందధర్మవృత్తి
　　గలిగి వెలిగెడు దివ్యవిగ్రహము నాత్మ
　　భక్తిభజియించు భాగ్యంబు భాగ్యమందు.

ఉపదేశమునకు గురుమూర్తియు, నుపచారమునకుఁ బతివ్రతయగు నారీమణియుఁ గుదిరిన ధన్యుండు మోక్షమున కర్హుండు.

ధర్మాంబ—నాయనా!

కం. దేశికుఁడుపదేశమున స్వ
దేశమునన్ హంసయానధీవృత్తికి నా
వేశము గల్గించి భ్రమల
నాశము జేయంగ దాఁటు నరుఁడు భవాబ్ధిన్.

కం. కందంబందము కవితకు
సుందరిహృదయంబు ధర్మసూక్ష్మజ్ఞునకున్
జందురుఁడందము రాత్రికి
నందఱకానందమందమౌ వేయేలన్.

రాజశే—కుమారా! పెక్కేల?

కం. శ్రీసద్గురూక్తవిధిని సు
దాసీనుండాసగోసి యర్హాసనమం
దాసీనుండయి ధ్యానము
చేసినసకలార్థసిద్ధి చేకురుజీవా.

(చెవిలో నుపదేశముచేసి)

ఆత్మతాదాత్మ్యమందున నఖిల విద్య
లణఁగియున్నవి గురుకృప నదియుఁ గల్గఁ
దాను దనయంద నిల్చి సంతాపముడుగు
జీవ! యావాడఁ జూడుము దేవుఁడౌను.

ధర్మాంబ—వత్సా! నాయనగారి బోధ మేమరక శుభములఁ బడయుము.

నిరం—మీయాజ్ఞానుసారంబు మెలంగి కృతకృత్యుఁడగున ట్లనుగ్రహింపుఁడు.

కం. తెలియమి పోయినపోకడ
లలయించెన్ మిమ్మ మంత్రి నాచార్యునిఁగే
వలకృప బోధంబొసఁగిరి
లలితాకృతినందఱొక్కలాగున నాకున్.

(పరమహంసయు, మంత్రియుఁ దిరిగివత్తురు)

నిరం—(నమస్కరించి)

క. జననీ జనకా మునివర
యనుపుఁడు నిజగేహమునకు నాశీర్వాదం
బొనరిచి మంత్రివరునితోఁ
జనెద నతఁడు తోడుగాఁగ సమకురు శుభముల్.

పరమ, రాజశే, ధర్మాంబ—వత్సా! పోయి రమ్ము, శుభములఁ బడయుము. స్వధర్మ మేమరకుము. (దామోదరశాస్త్రి యుత్తరముతోఁ బ్రవేశించును.)

మంత్రి, నిరంజ—ఏమిశాస్త్రిగారు! ఇట్లువచ్చినారు?

డామా—కుడువఁబోవుచుఁ గూరరుచి యడుగనేల? నేఁటిమధ్యాహ్నము కాశీనివాసియగు త్ర్యంబక యోగీశ్వరులవారు రామేశ్వరమునుండి శిష్యసమేతముగ నిటకువచ్చి విడిసిరి. అచటజరుగుచున్న యాగాంగము లన్నియు వారు చూచి మిక్కిలి సంతోషపడినారు. ఆదర్శప్రాయులగు చతురాశ్రమధారుల నిచట నిల్పుట మనయాశయమైయున్నది కదా! తురీయాశ్రమమున నున్న యుత్తమాధికారులు వీరు కావున వీరిని యాగశాలయందు స్థిరముగా నిల్వఁ బ్రార్థించుటకై మంత్రిగారవశ్యము వెంటనే బయలుదేరిరావలయునని సుశీల మునీంద్రులు కోరుచున్నారు.

పరమ—సుదర్శనా! నీవు త్వరగావెడలిపొమ్ము. ఆతఁడు క్రమముగా నాశ్రమమునుండి యాశ్రమమునకు వచ్చిన పరిపూర్ణుఁడు. సత్రయాగశాలయందు నిలుపఁదగిన ప్రామాణికుఁడు.

సుదర్శ—(నమస్కరించి) చిత్తము. మహాప్రసాదము. నిరంజన కుమారుండును, శాస్త్రియు వెనుకనుండి వత్తురు. నేనిదే పోయివత్తును. (శాస్త్రిచెవిలో నేమియో చెప్పును.)

డామా—నేనువచ్చిన వాయువిమానముపై మీరు పోయి రాజధానిఁజేరి యా విహంగమార్గమునఁ బోవు సన్యాసులగొడవ విచారించుకొనుఁడు. మేము గృహస్థమార్గముగఁ గడుపులోనిచల్ల కదలకుండ నెమ్మదిగ వచ్చెదము. (సుదర్శనునితో జనాంతికము) నాసంధాన

నై పుణ్యమునకు మీరే గంపెండేరము వేయింతురు గాక !

సుదర్శ—పరిహాసము కాదు. పని జరుగవలెను.

(అని నిష్క్రమించును.)

డామా—పాట:

దేవుఁడా యని వెదుకనేలర జీవుఁడు
జీవుఁడు మాజీవుఁడు మాభూవిభుని కుమారుఁడు
జీవుఁ డెవ్వఁడు దేవుఁడెవ్వఁడు జీవదేవుల తావ
దెక్కడ, భావమున సురుసూక్తి నాలెను దేవుఁ
డయ్యెను జీవుఁడోర.

(తెర వ్రాలును.)

## మూడవ రంగము

(ఉపవనముసమీపము)

(ప్రవేశము డామాడోలి, నిరంజనుఁడు)

నిరం—శాస్త్రీ! ఇదియేమి? ఇటువచ్చుచుంటిమి! మార్గమునం దిరుప్రక్కలనున్న యుద్యానవనములు మనోహరముగానున్నను మనము దారితప్పినటులున్నది.

డామా—దారితప్పలేదు. ఇపుడిపుడే దారికి వచ్చుచున్నావు. అతిశీఘ్రముగా వాంఛితపదమును చేరఁగలవు.

నిరంజ—రాజధానిఁ జేరవచ్చు సూచనలు కానరావు. ఈదూరమునఁ గానవచ్చు సౌధశిఖరములు రాజభవనములవలెఁ దోఁచుచున్నవి. ఈయుద్యానము సకలర్తుకుసుమ సౌరభయుతమై పరమాహ్లాదమును గలిగించుచున్నది. మనమిపు డెక్కడనున్నాము శాస్త్రీ!

డామా—ప్రాతదారి కాకపోవుటచేఁ గొంత క్రొత్తగనున్నను జిత్తమునకు వేడ్క లిసురొత్తఁజేయునదియే. ప్రాతదారి యొంటిజందెపుబాట. సన్ననిది. క్రొత్తదారి ద్వితీయసాయముకలది. తోడుగలబాట. కొంచెము చుట్టులఁబెట్టునదైనను విశాలమైనది. తిన్ననిది. మేలని పెద్ద లాదారిని నేసుదురు. నేను మిక్కిలి బడలియున్నాను. కొంత విశ్రమించినఁగాని యడుగైన నిడఁజాలను.

నిరం—నీమాటలే చుట్టుగానున్నవి. తిన్నఁగా నర్థమగుటలేదు. నాకును బడలికగా నున్నది. ఈచల్లగాలియం దీచలువతాతితిన్నెపై నీయుద్యానవనమున నించుకవిశ్రాంతి పుచ్చుకొనియే పోదములెమ్ము. నీవును విశ్రమింపుము. (మలయమారుతసుఖము ననుభవించుచు)

మహాదేవ మహాదేవ మహాదేవ దయానిధే
భవానేవ భవానేవ భవానేవ గతిర్మమ.

రాజభోగరమణీయమయ్యు నీయారామము పరమప్రశాంతమై తపోయోగ్యముగ నున్నది.

చ. మనమునశాంతి గల్గిన న
మానుషశక్తి మెలంగు సంచితం
బనుపమలీల దుల్లఁ బర
మాత్ముని దర్శన మబ్బు నబ్బుపో
కనుసురమూర్తి సత్కృపను
గాఢవిరాగముకల్మితాల్మి శో
భనముల కాటపట్టనుచుఁ
బల్కరు తెల్పఁగ విందు మిత్రమా.

డామా—సందేహమేమి? ఇదియే నీకింకశోభనపరంపరల కాటపట్టగును లెమ్ము.

(చెట్టుమీఁదనుండి చిలుక)

సుగంధి:—నిరంజనా! నిరంజనా! మునిప్రగీతభావనా!

నిరం—నన్నెవరిక్కడఁ బిలిచెదరు?

డామా.—నల్లచీరఁగట్టుకొన్నవారెల్ల నాపెండ్లాలేయనుకొనెనఁట నీవంటివాఁ డొకఁడు. ఇన్నిదినములనుండి యింతబరువుఁదోఁచిన పేరిపుడు నీకింతప్రియముయినదా! మహానుభావ కృతసంతత శివస్తోత్రము ననుకరించుచున్న చిలుకల పలుకుల కులికి నన్నెవరో పిలుచుచున్నా రనెదవేల?

నిరం—చిలుకలా! శాస్త్రీ! నిజమా, ఇది శివస్తోత్రమా?

చిలుక—నాకు నిరంజనుండె శరణంబు ప్రశాంతి భవంబుఁ దాటఁగన్.

నిరంజ—(ఆశ్చర్యముతో వినును)

చిలుక—రతిపతిఁ గెల్చి మించెడు నిరంజనుఁడే కృపఁజూచి ప్రోచినన్.

నిరం—ఎంతభక్తిభరితములైన యీ పద్యపాదములు! పాప మాచిలుకలు నిండుపద్యములఁ బాడలేక పాదములుమాత్రము పలుకుచు ధ్యానముచేసినవారి భక్తి పారవశ్యమును బ్రకటించుచున్నవి. ఏ మహర్షియైన నిందుఁ దప మొనరించుచున్నాఁడా యేమి?

(సమీప నికుంజమున సంగీతము వినవచ్చును)

పాట—కాంభోజరాగము—మిశ్రజాతి, యేకతాళము

పల్లవి—విశతు విశతు విశతు

అనుపల్లవి—విశతుమన్మానస రాజహంస
శ్శంభో! విశతు విశతు విశతు.

౧. నిత్యధ్యానే! నిరభిమానే!
మహామానే! సురతీర్థపానే. వి.

౨. సంకల్పాక్రాంతోపితద్వాచక
జపమత్యంతం కుర్వన్ కుర్వన్ వి.

3. సాక్షాదనుభవసమయే సత్యం
భుక్త్వాహంసఃముక్తః శక్తః. వి.

౪. తాదేవఖిలు దేవముదేసత్యం జీవా
నామితి శ్రూయతేనగధరసద్గతే.

నిరం—ఏమి భక్తిపారవశ్యత! ఏమి యీభావగంభీరత! ఏమి యీరసోద్రేకము! సంగీతకోవిదు లెందఱు మన యాస్థానమున లేరు? ఈగానము కేవల నాదోపాసనముం బోలె మనస్సును హరించుచున్నది.

డామా—జ్ఞానయోగములు మానుషాకారమును దాల్చినవా యన్నటులు వెలుఁగుచున్న యామూర్తిని నీవు సేవించిన శక్తిసంపన్నుండవై ముక్తికాంతను జెట్టఁ బట్టఁగలవు.

నిరంజ—ఏమిది, నేఁడు నీమాట లన్నియు వ్యంగ్యప్రధానములు, శ్లేషలుగా నున్నవి.

డామా—నేనేమి యలంకారశాస్త్రము నభ్యసించితినా! అద్దము ముఖముయొక్క యాథార్థ్యమును గోచరింపఁజేసినట్లు నేనును నున్నదున్నటులఁ దెలుపువాఁడను. శ్రవణమాత్రముననే యావ్యక్తిపై నింతమనసు పాఱియున్నదే. మీయుభయులకు సంగతియే కలిగిన మహాభోగులుకారా!

నిరంజ—(స్వగతము) మహాభోగియన మహాయోగియేకదా! (ప్రకాశము) నీకపటపుమాటలు నా కర్థమగుటలేదు

డామా—ఇంతకుము న్నెన్నఁడును గనఁబడని యుత్సాహము నేఁడు నీమోమునఁ దాండవమాడుచుంట చూచినపుడు నాకు మేనిపైఁ బటమేనిల్చుట లేదు, నీయెడఁ గపటముగూడ ధరింపఁగలనా తండ్రీ! నీయుల్లాసమునకుఁ గారణము పరమహంససన్నిధినిఁ బడసిన జ్ఞానమా, లేక యిమ్మనోహర వ్యక్తివలన నీయారామమందు వెలువడిన గానమా? ఏదైననేమి? ఇమ్మహానుభావదర్శనంబునఁ గృతార్థులమయ్యెదముగాక. నేనిదేపోయి పువ్వులఁ దెచ్చెదను. (అని పోవును).

నిరం—నేఁడేమో మహాతపఃఫలము హస్తగతంబైనవానికింబోలె నామనం బుబ్బి గంతులువైచుచున్నది. పాపము నాయందు నిర్వ్యాజప్రీతికలవాఁడగుటచే శాస్త్రియు ననుఁజూచి యుప్పొంగుచు మేనిపైనఁ బటమేనియు నిలువదనుచున్నాఁడు. ఆహా! ఎవనియులుకు వానిదికదా! పటమనఁగానే నాపడకటింటిపటము నామోమున వ్రేలుచున్నది. నాయైచ్ఛిక బ్రహ్మచర్యనియమము నేటితో వదలిపోయినదికదా! స్వధర్మాచరణమందు సహధర్మచారిణిని గ్రహించుటయే నాజనకునియుద్దేశము. ఆపటమునందలి వ్యక్తి యాకారముఁదాల్చి నాకు సాక్షాత్కరింపరాదా! హే రాధారమణా! నీవట్లనుగ్రహించిన "పద్మావతీచరణచారణచక్రవర్తి" యను శ్రీ జయదేవునింబోలె మేమిరువురము నీకైంకర్యము సలుపుచుండమా!

(తెరలో దూరమునుండి వినవచ్చును)

పాట. కన్నడరాగము - ఆదితాళము

ధ్యానలయేనపురః పరికల్ప్యభవన్తమతీవదురాపం
విలపతి, హసతి విషీదతి రోదితి చంచతిముంచతితాపం-
సావిరహేతవదీనా.

నిరంజ—ఆహా! ఏమినాపుణ్యము! నేను పద్మావతీజయదేవులను స్మరించినమాత్రనే నాకు జయదేవగీత గోవిందచరణము వినవచ్చినది. శుభసూచనసుమా యిది. శాస్త్రీయామహనీయుఁడు శివభక్తుఁడని వచించెఁగదా! నిక్కముగ శివభక్తికి నిర్విచారమగు కేశవస్తోత్రమే గురుతు. కలస్వనమేకాని కంఠమదికాదు. భక్తులు మరికొందరు గోష్ఠికై చేరిరికాఁబోలు.

(డామాడోలీ పువ్వులు కోయుచుండఁగా)

కలవాణి—"సావిరహేతవదీనా"(అనిపాడుచుఁ బ్రవేశించును.)

డామా—నీవేనా కలవాణి! పాడుచువచ్చు దానవు?

కలవాణి—నేఁడుకదా సుదినము. మాభావగారి దర్శనమయినది. మహాత్ములూరకరారు. మాచెలిసంగతి యేమిచేసితిరి? నిన్నటినుండి మాప్రాణసఖి నిరశనవ్రత మారంభించి గీతగోవిందముతోఁ గాలక్షేపము చేయుచున్నది. ఒక్కొక్కయెడఁ దాను రాధననియు, నిరంజనుఁడు కృష్ణుఁడనియుఁ గల్పించుకొని యూరక పాడుచుఁ దన్మయావస్థయందున్నది. ఆమె యలసినపుడు మే మాగీతములఁ బాడుచున్నాము. ఇపుడు నేపాడిన పాటలో. నతిశయోక్తియేమియు లేదుసుమా! నిరంజన కుమారుని చిత్తవృత్తియెట్లున్నది?

డామా—ఉస్! నిరంజన కుమారుఁడు వచ్చియే యున్నాఁడు. ఇపుడే మీచెలియున్నచోటికిరాఁగలఁడు. సమ్ముఖమున రాయబారము లేల? ఎదుటికివచ్చిన ప్రియుని నైవసమొనరించుకొనుట తనపనియని మీప్రాణసఖి నుద్బోధింపుము.

ఆనందభైరవిరాగము - త్రిస్రరూపకము

బుద్ధిమతి—
"కథితసమయేపిహరిరహహనయయౌవనం
మమవిఫలమిదమమలమపిరూపయౌవనం
యామిహేకమిహ శరణం సఖీజనవచనవంచితాహం.

కలవాణి— (ఆలకించి) అదిగో చెలి తిరిగి పాడుట కారంభించినది. సొలిపోవునేమో యని భయ మగుచున్నది. నేఁబోయెదను. (అనిపోవును)

బుద్ధిమతి—
యదనుగమనాయనిశిగహనమపి శీలితం
తేనమమహృదయమిద మసమశరకీలితం
యామి హేకమిహ శరణం.

నిరంజ—ఓహో! ఏమి రసావేశమునఁ బాడు చున్నాఁడు. మహాభక్తులు కొందఱు తాము రాధయనియు, భగవంతుఁడు నాథుఁడనియు భావనము చేసి కొనుచుఁ దాదాత్మ్యసిద్ధికై స్త్రీవేషమునుగూడ ధరింతు రని వింటిని. పురుషులలోనే పరమార్థము శూన్యమయిన యిక్కాలమున స్త్రీలలో నది గానవచ్చుట యసంభవము. కాని గానము స్త్రీగానమువలె సుకుమారముగా నున్నది. ఇంతకు నామనం బమ్మహావ్యక్తినిఁజూడదత్తర పడుచున్నది. (వినుటనటించి) ఏమది! మరల పాట వినఁబడుచున్నది.

బుద్ధిమతి—
మమ మరణమేవ వర మితి వితథకేతనా
కిమితి విషహామి విరహాన లమచేతనా
యామిహేకమిహశరణం. (భావోద్రేకంబున)

మమ...మరణం...మరణం...మరణమేవ... ఏవ వరం మరణమేవవరం...మమ మరణమేవవరం— హాకృష్ణా! వేణుగానప్రియా! (అనుచుఁ బానుపుపై నున్న దిండుపై నొరగి కనులు తేలవైచును.)

కలవాణి—(స్వగతము)రాధికాతాదాత్మ్యముచెలికిఁ బారవశ్యము కలిగించినది. నేననురూపముగఁ బ్రవర్తించెదను.

(ప్రకాశముగ బిగ్గఱగా)

పాట—

క్షణమధునారాయణం అనుగత మనుసర రాధికే కరకమలేనకరోమి చరణమహామాగమతాపివిదూరం క్షణముపకురు శయనోపరిమామివనూపుర మనుగతిశూరం. క్షణమ.

బుద్ధిమ—హరిహరీ యెంతమాట! అంతటియపచారమును జేయుదునా! నేనే మీచరణసరోజ సేవ చేయుదును!

నిరంజ—శాస్త్రీ! ఏలజాగుచేయుచున్నావు? (స్వగతము) నేనిదే శాస్త్రినిఁ బిలువఁబోయెదను.

కలవాణి—చెలీ! చెలీ! నీవు రాధవుకావు నీవు బుద్ధిమతివి. ఒక్కమారు కన్నెత్తిచూడుము.

ఉ. పండెఁ దపంబు బుద్ధిమతి
వచ్చె నిరంజన భూవిభుండిదే
పెండిలిహాతునైతి వీఁక
బేలతనంబును మాని పుష్పకో
దండునిబాటి కగ్గమగు
దాన నినుక్ శరణంటి నన్నుఁజే
కొండని యర్పణంబు నిడు
కొన్నఁగదా చెలి మేలు కల్గెడున్.

బుద్ధిమతి—

ఉ. ఎక్కడిమాటలే చెలియ,
యేటికివచ్చు నిరంజనుండు స్త్రీ
కెక్కసమైన వానిక టె
వేడుక బెండిలి నాకు వానిపై
మక్కువ మానరానిదయి
మానసముక్ నొగిలింప నేరిక్
మ్రొక్కుదు మొజ్జవెట్టు దెటుఁ
బోవుదుఁ బుట్టితి రాచపుట్టువున్.

కలవాణి—

ఉ. వేడుక మాటలాడుదునె
వింటిని వానిపఖుండుఁ దెల్పఁగా
నేఁడు జయంతమందునను
నిన్ననినంత నె పూర్వవాసనల్
వీడి గృహస్థధర్మపద
విక్ గయికొంటకు బాసచేసి యు
న్నాఁడట నీదు మూర్తి మన
నంబెడ సల్పెదునంట నమ్ముమా.

బుద్ధి—"జీవక్ భద్రాణి పశ్యతి"

ప్రాణములు దాల్చియున్న సత్ఫలముఁ గొంటిఁ
బ్రాణనాథుని సత్కృపఁబడయఁగంటిఁ
బ్రాణసఖి నీదు సంధానపటిమ మంటిఁ
బ్రాణదాత నిరంజనప్రభుఁడె యంటి.

నేనెంతధన్యురాలనే! నా మనోహరుండు నాకెపుడు నేత్రపర్వము గావించును?

కలవా—ఈపాటికి వచ్చుచుండురు.

బుద్ధి—మనమా! తత్తరపడకుము. ప్రాణవిభు నర్హరీతి నర్చించి తత్కృపను గాంచఁగలవు.

నిరం—శాస్త్రీ! శాస్త్రీ!

డామా—నాయనా! నాయనా! వచ్చితి వచ్చితి. ఇదిగో పూవులుఁ దెచ్చితి.

నిరం— మహానుభావదర్శనమునకుఁ బోవుట కేటికిజాగు.

డామా—(స్వగతము) ఆహా! భగవత్సంధాన నైపుణ్యము! నెట్టికొనివచ్చి దంపతులఁగూర్చుచున్నది. (ప్రకాశము) ఇటు, ఇటు.

నిరం—(పరిక్రమించి యెదుట కొంతదూరమున నున్న బుద్ధిమతింగాంచి యాశ్చర్యముతో) ఏమిది, నా హృదయసింహాసన మధిష్ఠించిన దేవతయే నాయెదుట సాక్షాత్కరించినదా! శాస్త్రీ! ఇదియేమి కలయా! ఇంద్రజాలమా! నాటకమా! చిత్తవిభ్రమమా! భజనమా! తపమా! ఆరాధనమా! ఏమి యీయపూర్వ ప్రయోగము!

సీ. కాఁబోలు నిది నూత్నకమలంబు కాదుపో
　　　　జడవృత్తి దోఁప మే జాడఁ జూడఁ
గాఁబోలు నిది సుధాకరమూర్తి కాదుపో
　　　　తేఱిచూచినయేని దెల్లఁబోమి
గాఁబోలు గనకవిగ్రహ మిది కాదు పో
　　　　పద్మగంధంబునఁ బరిఢవిలుటఁ
గాఁబోలునిది చిల్కగవిశన కాదుపో
　　　　శుకహీనసకలవచోభివృద్ధి
గీ. అవునుగాకేమి యిది నిశ్చయముగమరుని
రత్నబాణాసనము శరీరరహితుండు
గానఁగానంగరాఁ డనుమానము నన
దెలియవలయును ధీరులఁ గలచుచూపు
తూపులనుఁ దీవ్రగతిదానతోడనుచుంట.

డామ—ఏటి కింక విలంబము. ఆ యెదుట నున్నది నీకై ప్రాణములు నిలుపుకొని నిరాహారంబుగ ఘోరతపం బొనరించుచున్న నీమేనమామ కూఁతు రగు బుద్ధిమతిసుమా!

కల—మహారాజా! స్వాగతము. స్వాగతము.

సీ. కాత్యాయనీపాదకంజంబు లర్చించుఁ
　　　　జర్చించు వేదాంతశబ్దసరణి
సర్పించు నజపంబు నాయాస్థలంబుల
　　　　దర్పించుఁ గవిజనధాటిసూటిఁ
జాలించుఁ గర్మంబు నాలించునాదంబు
　　　　సోలించు నిజనాథు సోమనాథుఁ
బాలించు భక్తాళి భావించు ముక్తాళి
　　　　ధ్యానించు గురుమూర్తి ధర్మవర్తి
జ్ఞానయోగకరంబుల గాఢరక్తిఁ
బూజ నినుసేయుచున్నట్టి బుద్ధిమతిని
వలచుదానిని మఱదలివరుసదాని
దీని భూజాని యేలు నీదానిఁగాఁగ.

ఈకుంజకుటీరంబున నీయాసనంబు నధిష్ఠింపుఁడు. (నిరంజనుఁడు, శాస్త్రి లోనికరిగి యాసనము నధిష్ఠింతురు.)

(బుద్ధిమతి లజ్జావనతవదనయై నిలువఁబడియుండును)

నిరంజ—

ఆ. వె. పద్మముఖినిఁజేయఁ బగలు ప్రకాశించె
శశివదనను జేయ నిశి వెలింగె
బుద్ధిమతిని నబ్జముఖిఁ జేసి లోపంబుఁ
బాపి యజుఁడు సడినిఁబాపుకొనియె.

మీ చెలిచరిత్రమువోలె　　యియ్యారామనికుంజంబును మనోహరంబుగ నున్నది.

కలవాణి—చెలీ! బుద్ధిమతీ! పరోక్షమున నెవ్వానికై నీవు ఘోరముగఁదపించి నిరీక్షించుచుంటివో, యట్టినీప్రాణవల్లభుండు నిరంజనమహారాజు పరమానుగ్రహంబున సాక్షాత్కరించియుండ నిర్హేతుకముగ జేల నై యేల యర్హావిధులఁ బూజింప జాలము చేసెదవు?

ఈ బ్రాహ్మణోత్తముని యాశీఃప్రభావముసుమా! నీ కీమహారాజు దర్శనలబ్ధి.

బుద్ధి—బ్రాహ్మణోత్తమా! మీచేసిన మేలున కేమి యుపకృతి యొనర్పఁగలదాన. నేనిదే నమస్కరించుచున్నాను.

డామ—శీఘ్రమేవ నిరంజననృపాలకరగ్రహణప్రాప్తిరస్తు. మాతల్లీ నీవు మహారాణివై యెల్లప్రజలనుఁ జల్లఁగ నేలుము. మల్లెపందిలిక్రింద నాదేవతార్చనపెట్టె మరచితిని. తెచ్చుకొనివచ్చెదను. (అనినిష్క్రమించును.)

కలవాణి — భావగా రెందులకో తొందరగాఁ బోవుచున్నారు. ఇదిగో ఒక్కమాట, నేనును వచ్చుచున్నాను. (అని యతనివెంటఁ బోవును.)

బుద్ధి—కలవాణి! కలవాణి!

కలవాణి—రాజసన్నిధానము జిక్కిన నీకు నాతో నక్కఱయేమిలే! మాబావగారితో నొక్కమాట చెప్పివచ్చెదను. నీవును మీబావగారినిఁ గుశలప్రశ్న జేయుచుండుము.

బుద్ధి—ఒక్కమాటవినిపొమ్ము. (అని తోడఁ బోఁబోవఁగా నిరంజనుఁడు చేయిపట్టుకొని నిలుపును.)

చిలుక—

రతిపతిగెల్చి మించెద ని
రంజనుఁడే నను జెట్టబట్టినన్.

బుద్ధి—ఈ చిలుకలకుఁగూడఁ బరిహాసపాత్రమ నైతి. బుద్ధిలేనిజీవులివి. సమయము సందర్భము నెఱుంగక నోటికివచ్చినట్లు కూయుచున్నవి.

నిరంజ—ప్రాణప్రియా! నీచే రచింపఁబడిన యీ పద్యపాదములు వింటినిగాని శివస్తోత్రమని భ్రమించితి. ఇన్నిదినములు నీహృత్తాపమునకుఁ గారణభూతుండ నైతిఁగదా! ఈచిలుకలు బుద్ధిమాలినజీవులుకావు. నీ హృదయమెఱింగి నాకెఱింగించెను. ఇంతటిభక్తి నాయందుఁగల నిన్నెఱుంగఁజాలనివాఁడనౌట నిక్కము. నేనట్టివాఁడనగుదు. నీవు బుద్ధిమతివి.

కం. నాతప్పుల సైరింపుము
సీతాంశుముఖీ నినుఁ గొలిచి కృతార్థత్వం
బేతీరునైన ద్వంద్వా
తీతపథంబునసె నడచి ధీరత కందున్.

మనోహరీ! జయదేవులకుఁ బద్మావతింబోలె నీవు నాకు తోడుగా భగవద్భాగవత కైంకర్యంబు సలిపి లోకోత్తరుండ నయ్యెదఁగాక!

కం. నీ విటు తపింతు నాకై
కావించితిఁ దపము నిన్నుఁ గాంచుటకై నే
సేవింతు నిన్ను ముదమునఁ
గావింతుము మీఁదఁ దపము కైవల్యమునన్.

బుద్ధి—సకలకళావిశారదులగు మీరు నమ్ముకొని యున్న నావంటి దీనురాలిని వంచించుట యొక ఘనకార్యమా!

నిరంజ—శివ! శివ! ఎంతమాట. నిన్ను నేను వంచింతునా! అహర్నిశంబు నిన్నునే ధ్యానింతు ననుట కీశ్వరుండె సాక్షి.

బుద్ధి—ఒక్కపుణ్యాత్మురాలి పటమును సంతతముఁ జెంత నుంచుకొని మీరు ధ్యానించుచుందు రని వింటిని.

నిరంజ—(స్వగతము) నాగుట్టీమె కెట్లు తెలిసినదో! శాస్త్రి యసాధ్యుఁడు.

బుద్ధి—నామక్కువమాట కేమి? అన్యథాలగ్నమైన తమ మానసమునకు నిర్బంధము కలిగింతునా?

నిరం—ప్రేయసీ!

గీ. పటమున నెకాదు మచ్చిత్తఫలకమందుఁ
జిత్రితంబైన యాసచ్చరిత్ర యెవరో
నీవ చూడంగరాదె యిందీవరాక్షి
దాపరిక మేల యిదిగొ ప్రత్యక్షముగను.

(అని పటమును జూపును)

(బుద్ధిమతి పటమును జూచి సంతసపడుచు సిగ్గుపడుచుండఁగాఁ జెంతనున్న యద్దము నాతఁ డామె మోమునకుఁ బట్టును.)

బుద్ధి—ఈదీనురాలింతగాఁ దమ యనుగ్రహమునకుఁ బాత్రురాలైనదని యెఱుంగక నేనేమి యంటి నదియెల్ల క్షమింపవేఁడెదను. ఇంతదయతో నన్నంతరంగమున లాలించుమనోహరుని మానసం బరయఁజాలనికటిక దానిమోమున కద్దమొకటి కొదువయా!

నిరం—ప్రేయసీ! ఈయద్దమున నీమోమెటుల స్పష్టముగఁ బ్రతిఫలించుచున్నదో నిర్మలమైన మద్హృదయంబున సంతతము నీయాకారము హత్తియున్నది.

శా. నాకాధారము సర్వతంత్రముల స
న్మార్గంబు సూచింపఁగా
నీకాదున్యముకన్న వేరుకలదే
నిశ్చింతతో నన్ను వే
గైకొమ్మా రతనంపు బొమ్మ కృపతోఁ
గైవల్య మిమ్మా యిదే
నీకున్ దాసుఁడ నీకు దాసుఁడయితిన్
నిక్కంబు కామేశ్వరీ!

(అని బుద్ధిమతిప్రక్కకుఁ జేరఁగ నద్దములో నిరువురి ప్రతిమలు కనఁబడఁగ సిగ్గుపడి బుద్ధిమతి యావల పోఁగా నిరంజనుండు ముద్దుపెట్టుకొనఁబోవును).

(పైనుండి పువ్వులు వారిరువురిపై వర్షించును.
తెర వ్రాలును.)

చిలుక—

రతిపతిగెల్చి మించెద ని
రంజనుఁడే నను జెట్టబట్టినన్.

బుద్ధి—ఈ చిలుకలకుఁగూడఁ బరిహాసపాత్రమ నైతి. బుద్ధిలేనిజీవులివి. సమయము సందర్భము నెఱుంగక నోటికివచ్చినట్లు కూయుచున్నవి.

నిరంజ—ప్రాణప్రియా! నీచే రచింపఁబడిన యీ పద్యపాదములు వింటినిగాని శివస్తోత్రమని భ్రమించితి. ఇన్నిదినములు నీహృత్తాపమునకుఁ గారణభూతుండ నైతినిగదా! ఈచిలుకలు బుద్ధిమాలినజీవులుకావు. నీ హృదయమెఱింగి నాకెఱింగించెను. ఇంతటిభక్తి నా యందుఁగల నిన్నెఱుంగఁజాలనివాఁడనౌట నిక్కము. నేనట్టివాఁడనగుదు. నీవు బుద్ధిమతివి.

కం. నాతప్పుల సైరింపుము
సీతాంశుముఖీ నినుఁ గొలిచి కృతార్థత్వం
బేతీరునైన ద్వంద్వా
తీతపథంబుననె నడచి ధీరత కందున్.

మనోహరీ! జయదేవులకుఁ బద్మావతిఁబోలె నీవు నాకు తోడుగా భగవద్భాగవత కైంకర్యంబు సలిపి లోకోత్తరుండ నయ్యెదఁగాక!

కం. నీ విటు తపింతు నాకై
కావించితిఁ దపము నిన్నుఁ గాంచుటకై నే
సేవింతు నిన్ను ముదమునఁ
గావింతము మీఁదఁ దపము కైవల్యమునన్.

బుద్ధి—సకలకళావిశారదులగు మీరు నమ్మికొని యున్న నావంటి దీనురాలిని వంచించుట యొక ఘన కార్యమా!

నిరంజ—శివ! శివ! ఎంతమాట. నిన్ను నేను వంచింతునా! అహర్నిశంబు నిన్నే ధ్యానింతు ననుట కీశ్వరుండే సాక్షి.

బుద్ధి—ఒక్క పుణ్యాత్మురాలి పటమును సంతతముఁ జెంత నుంచుకొని మీరు ధ్యానించుచుందురని వింటిని.

నిరంజ—(స్వగతము) నాగుట్టీమెకెట్టు తెలిసినదో! శాస్త్రి యసాధ్యుఁడు.

బుద్ధి—నామనవిమాట కేమి? అన్యథాలగ్నమైన తమ మానసమునకు నిర్బంధము కలిగింతునా?

నిరం—ప్రేయసీ!

గీ. పటముననెకాదు మచ్చిత్తఫలకమందుఁ
జిత్రితంబైన యాసచ్చరిత్ర యెవరో
నీవ చూడంగరాదె యిందీవరాక్షి
దాపరికమేల యిదిగో ప్రత్యక్షముగను.

(అని పటమును జూపును)

(బుద్ధిమతి పటమును జూచి సంతసపడుచు సిగ్గుపడుచుండఁగాఁ జెంతనున్న యద్దము నాతఁ డామె మోమునకుఁ బట్టును.)

బుద్ధి—ఈదీనురాలింతగాఁ దమ యనుగ్రహమునకుఁ బాత్రురాలైనదని యెఱుంగక నేనేమి యంటినదియెల్ల క్షమింపవేఁడెదను. ఇంతదయతో నన్నంతరంగమున లాలించుమనోహరుని మానసం బరయఁజాలనికటికదానిమోమున కద్దమొకటే కొదువయా!

నిరం—ప్రేయసీ! ఈయద్దమున నీమోమెట్టుల స్పష్టముగఁ బ్రతిఫలించుచున్నదో నిర్మలమైన మద్హృదయంబున సంతతము నీయాకారము హత్తియున్నది.

శా. నాకాధారము సర్వతంత్రముల స
న్మార్గంబు సూచింపఁగా
నీకారుణ్యముకన్న వేరుకలదే
నిశ్చింతతో నన్ను నే
గైకొమ్మా రతనంపు బొమ్మ కృపతోఁ
గైవల్య మిమ్మా యిదే
నీకున్ దాసుఁడ నీకు దాసుఁడయితిన్
నిక్కంబు కామేశ్వరీ!

(అని బుద్ధిమతిప్రక్కకుఁ జేరఁగ నద్దములో నిరువురి ప్రతిమలు కనఁబడఁగ సిగ్గుపడి బుద్ధిమతి యావల పోఁగా నిరంజనుండు ముద్దుపెట్టుకొనఁబోవును).

(పైనుండి పువ్వులు వారిరువురిపై వర్షించును.
తెర వ్రాలును.)

# దేవాలయ స్తంభము

చింతా దీక్షితులు

౧

ఒక మహాపట్టణమున్నది. అది ఒక మహా నదితీరాన్న ఉన్నది. ఆనది పేరుచెప్పినప్పుడు ఆపట్టణమూ, ఆపట్టణముపేరు చెప్పినప్పుడానదీ స్మృతిపథమునకు దుముకుతవి.

ఎన్నివేల సంవత్సరములు కడచిననూ ఆపట్టణము శిథిలముకాలేదు. కారణము ఆ నది. ప్రాచీన నాగరికమును, ప్రాచీన విద్యావాసనలను, ప్రాచీనప్రజల హృదయౌన్నత్యమును ఆపట్టణమూ, ఆనదీ తమహృదయాలలో దాచుకొని మనుష్యపరిశోధనలను వ్యర్థముచేస్తున్నవి.

వాయువానదీశీకరములను అప్పుడప్పుడు పట్టణముపై చల్లి దానిని పవిత్రముచేస్తూ ఉంటుంది.

ఆపట్టణములో ఒకజైలు ఉన్నది. అది పెద్దజైలు. ఈనాటి పాలకులు శిక్షితులకొరకేర్పరచిన కారాగారమది. భయపిశాచము కౌగిలిలో ఒదిగిఉంటూ రాజైలులోని శిక్షితులెప్పుడున్నూ. కన్నీటి బిందువులు, నిట్టూర్పులు, క్రోధప్రలాపములు, ఆయాసములు, విఫలీకృతమనోరథములు, ఈర్ష్యలు—ఆ నేరస్థుల సహచరులు.

ఆజైలుకొక సింహద్వారమున్నది— సింహామునకు నోరున్నట్లు. అది అందముగా ఉన్నది. సౌందర్యదేవత మంచినే ఆశ్రయించదు. అహింసనే ఆశ్రయించదు. సత్యమునే ఆశ్రయించదు. ధనధాన్యములనే ఆశ్రయించదు. భోగభాగ్యములనే ఆశ్రయించదు. సౌందర్యదేవతకు సమత్వభావమున్నది — అద్వైతికివలెనే. కారుమేఘములో మెరుపు అందముగా ఉన్నది- పిడుగులు పడద్రోయుచున్నది. వెలయాలి ముఖసౌందర్యము నరకమునకు సోపానములు కట్టుచున్నది. ఈసౌందర్యము బీదల దేహముల నప్పుడప్పుడాశ్రయించి వారి చిరుగుబట్టలలోనుంచి తొంగిచూస్తూంటుంది.

జైలుయొక్క అందమైన ముఖద్వారమును ప్రవేశించిన శిక్షితులు దాని దుఃఖజఠరమును ప్రవేశిస్తున్నారు.

జైలుద్వారమునకెదురుగా కొన్నిగజాల దూరమున బాట కిరుప్రక్కలా రెండు దేవాలయస్తంభము లున్నవి. అవి జైలుకు దారి చూపుతున్నవి. అవీ అందమైనవే. ఎప్పుడో ప్రాచీనకాలమునాటి ఆరితేరిన శిల్పి హస్తనైపుణి కవి నేడు దృష్టాంతముగా నున్నవి.

ఒకకాలమున భగవద్దర్శనమున కాత్రపడే భక్తులకు గర్భాలయమును చూపించిన ఆదేవాలయస్తంభములు నేడు జైలుకు దారి చూపుతున్నవి.

"ఎంతటి తారుమారు" అనుకొంటాము మనము.

౨

ప్రాచీనకాలము. మహావైభవముతో బ్రహ్మోత్సవము జరుగుతున్నది. ఆవేశపర వశులైన భక్తులు భగవంతునకు ప్రదక్షిణము చేస్తున్నారు. భగవంతునకు ప్రదక్షిణ మన్న ప్పుడు ఒక్క భగవంతునకే కాదు. మంటప మునకు, గర్భాలయమునకు, గోపురములకు, దేవాలయ స్తంభములకు, భగవంతునకు— అందరికిన్నీ ఈప్రదక్షిణము. ఏభక్తిభావము, ఆవేశము, శరణాగతి ఈ ప్రదక్షిణమునకు కారణములో అవి భగవంతునకు చెంది నట్లే తదాశ్రితులగు మంటపములకు, స్తంభ ములకు, గోపురములకుకూడా చెందుతున్నవి. ఆదేవాలయ స్తంభములు ఈ ప్రదక్షిణలభావ మును తమలో జీర్ణముచేసుకొన్నవి. బ్రహ్మో త్సవమునాటి ఆరతుల సువాసనలను, వాటి తో మిళితమై భగవంతుని పాదముల జేరే భక్తుల ఆత్మసమర్పణభావమున్నూ ఆ దేవా లయ స్తంభములు తమలో లీనముచేసు కొన్నవి. తూర్యాదివాద్యఘోషలు, ఘంటా నాదములు, జయజయధ్వానములు, వేద ఘోషలు, నామసంకీర్తనములు భగవంతుని చెవులబడుటకుముందు ఆ దేవాలయ స్తంభ ములను రాచుకొనిపోయేవి. యోగవిద్యా సాధకులా దేవాలయ స్తంభముల నానుకొని ధ్యానములో మునిగిపోయేవారు. అప్పు డా దేవాలయ స్తంభములున్నూ సమాధిస్థితిలో మునిగేవి. శరణాగతులైన భక్తుల హృదయ ములలో ఇష్టదైవతము ప్రవేశించుటవలన కలిగిన కన్నీళ్లు ఆ దేవాలయ స్తంభములపై కక్కేవి. అవిన్నీ కన్నీళ్లు విడుస్తున్నట్లు ఉండేది. పసుపుతో, కుంకుమతో, చందన ముతో, గంధముతో, కస్తూరితో, చము రుతో, కర్పూరవాసనలతో అగుణీగోడలతో పాటు ఆ దేవాలయ స్తంభములున్నూ నిండి ఉండేవి.

ఆ దేవాలయ స్తంభములు నిత్యమూ భగవంతుని సన్నిధియం దుండుటచేత కొంత కాలమునకు భగవదంశ పొందినవి.

మలయపవనము వీచినప్పుడు సర్వవృక్ష ములూ చందనవృక్షము లౌతవట. భక్తుల భక్తీ, భగవంతునిఅనుగ్రహమూ అనేవాయు తరంగముల నిరంతరసంఘట్టనవలన ఆ దేవా లయ స్తంభములకు పూజ్యతా, మహత్తూ కలిగినవి.

౩

ఒక కాలభాగములో ఆ దేవాలయము శిథిల మైనది. శత్రురాజుల క్రోధాగ్ని ఆ పట్టణమునకు చిచ్చుపెట్టుటచేత దాని సరి హద్దులు కొద్దిగామారడ మందుకుకారణము. మానవు లాశ్రయించడం మానినతర్వాత ఆదేవాలయమును వాయువూ, వర్షమూ, పక్షులూ, మృగములూ, కీటకములూ ఆశ్ర యించడం మొదలుపెట్టినవి. అవి భక్తిభావ ముతో ఆశ్రయించలేదని ఎవరు చెప్పగలరు?

1935 సం॥ దక్షిణ యిండియా వ్యాయామసంఘ ప్రదర్శనమున




"అమృతాంజనం డిపో" వారి ప్రదర్శనశాల.

ఆదేవునకు సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రములూ పగలూ, రాత్రీ దీపారాధన చేస్తున్నారు. వాయువు ఆదేవాలయమును సమ్మార్జనము చేస్తున్నాడు. వర్షము అభిషేకము చేస్తున్నది. మృగాదులు స్తోత్రవాక్యములు పల్కుతున్నారు.

ఆదేవాలయము కొన్నాళ్లకు కూలిపోయింది. శిలల బరువువల్లకాదు. దాని మహత్తు బరువువల్లనే!

కొంతకాలము గడిచింది. దేవాలయభాగములు చెదరిపోయినవి. కొన్ని మతాంతరుల దేవాలయభాగములై భక్తుల మ్రొక్కులు పొందుతూ, పూర్వస్థితిని పొందినవి. కొన్ని మానవులయిండ్ల నాశ్రయించినవి.

కష్టబరువు మోయవలసిన బాధ్యత పోగా దేవాలయస్తంభములుమాత్రము నిలిచి ఉన్నవి ఆకాశమునూ, నక్షత్రములనూ పరీక్షిస్తూ.

క్రమక్రమముగా అవిన్నీ ఒరిగినవి. భూమిపై పడినవి. ఎంత గాలివీచినా, ఎన్ని వానలు పడ్డా ఆదేవాలయస్తంభములమీది భక్తుల కన్నీళ్ల చారికలూ, చమురుమరకలూ మాసిపోలేదు. ఆదేవాలయస్తంభములు తమ హృదయములో దాచుకొన్న భక్తివాసనలనూ, దివ్యమహత్తునూ కోల్పోలేదు.

ఆ దేవాలయమందలి దేవు డదృశ్యుడైనాడు. ఎప్పుడో, ఎట్లాగో!

దేవాలయస్తంభములు క్రమక్రమముగా భూమిలోనికి దిగిపోతున్నవి. దిగిపోగా మిగిలినవి రెండుమాత్ర మింకా ఆదారిని సంచరించే మానవులకంటికి తగిలేవి.

ఇట్టి సమయమున ఆమహాపట్టణమున జైలుకట్టుటకు పూనుకొన్నారు పాలకులు. ఆనది ఆజైలును తనదగ్గిర కట్టనిచ్చిందికాదు. ఆపట్టణము తనలో ఆజైలును కట్టనిచ్చింది కాదు. పట్టణముపొలిమేరను, నదికి దూరముగా వన్యమృగములు సంచరించేతావున కట్టారు పాలకు లాజైలు.

పాలకులు జైలుకట్టినపిమ్మట పనివాండ్రు పాలకుల అనుమతిపొందకుండానే దానికి అందమును తేవలెననో, దానిక్రౌర్యమును తగ్గించవలెననో, అథవా ఆదేవాలయస్తంభముల మీది అభిమానముచేతనో వాటిని జైలు ముఖద్వారముముందు బాట కిరుప్రక్కలా పాతారు. నాటినుండి నేటివరకూ అవి అక్కడనే నిలబడిఉన్నవి, ద్వారపాలనముచేస్తూ.

## ౪

జైలుకట్టింది మొదలు నేటివరకూ ఎన్ని వేలమంది శిక్షితులు ఆజైలు ప్రవేశించారో! ప్రతీవాడూ ఆజైలు ముఖద్వారం — అందమైన ముఖద్వారం చూచేవాడు, కన్నీళ్లు కార్చేవాడు, భయము తన హృదయము నుండి వెలువరించిన కన్నీళ్లు. ఆదేవాలయస్తంభములను చూచేవాడు, కన్నీళ్లు కార్చేవాడు, భక్తీ, అనునయమూ తనహృదయము

నుండి వెలువరించిన కన్నీళ్లు. ఒక దేవాలయ స్తంభమునకు జేర్లాబడి ఆకన్నీళ్లూ ఈకన్నీళ్లూ ఆ స్తంభమునకు తుడిచేవాడు. తలవంచి స్తంభమిచ్చిన అభయప్రదానము హృదయమునుండి ఎగిరిపోకుండా గట్టిగా దానిపై హత్తుకొని జైలుగర్భము ప్రవేశించేవాడు. జైలుకట్టింది మొదలు నేటివరకూ ఎన్ని వేల మంది ఆజైలునుండి వెలునడ్డారో. ప్రతివాడూ ఆజైలుద్వారం చూడకుండా తలవంచుకు బయటికి వచ్చి దేవాలయ స్తంభమును సమీపించి దానిని మొక్కుకొనేవాడు. అప్పుడతనికి దేవాలయప్రవేశము చేసినట్లూ, దేవతాపూజ చేస్తూన్నట్లూ ఉండేది. ఆ దేవాలయ స్తంభాన్ని కౌగలించుకొని, ముద్దుపెట్టుకొని, దాని ప్రక్కనే చాలాసేపు కూర్చుని కన్నీళ్లువిడిచి వెళ్లలేక వెళ్లలేక యింటికి వెళ్లేవాడు. ఆ కన్నీళ్లనున్నూ ఆ దేవాలయ స్తంభములు భరించేవి.

కాలము మారింది.

అన్యాయము, అసత్యము, దుర్మార్గము మాత్రమే జైలులో ఆశ్రయముపొందడానికి రావడంలేదు. న్యాయమున్నూ, అహింస యున్నూ, ఆవేశమున్నూ, భక్తీన్నీ, సత్యమున్నూ కూడా జైలుఆశ్రయాన్ని సంపాదించుకొంటున్నవి. ఇట్లా ప్రవేశించే సత్యాదులకు శిక్షితులకువలెనే దేవాలయ స్తంభములు స్వాగతమన్నవి. వారికీ అనునయ మిచ్చినవి. వారికీ స్థైర్యమిచ్చినవి.

౫

ఒకనాడు అరుణోదయమయింది. సూర్యుని ఎఱ్ఱనికిరణాలు ఒక దేవాలయ స్తంభాన్ని కప్పినవి. పూర్వపుమహత్తుతో ప్రజ్వరిల్లే ఆ స్తంభమునకు నూతన తేజస్సు వచ్చినట్లయింది. రక్తసిక్తమైన దేహముతో ఒక శిక్షితుడు జైలుముఖము ప్రవేశించపోతూ దేవాలయ స్తంభములను చూచాడు. ఆగాడు. ఒక స్తంభాన్ని సమీపించాడు. కఱ్ఱదెబ్బలచేత చిటికి నెత్తురుకారుతూఉన్న తన దేహాన్ని ఆ స్తంభాని కానించాడు. ఆనెత్తురు ఆ స్తంభాని కంటుకొన్నది. సూర్యుని ఎఱ్ఱని కిరణాలలో ఆనెత్తురు మరీ ఎఱ్ఱగా ప్రకాశించింది. ఆ స్తంభము పులకించింది.

ఈశిక్షితు డొకభక్తుడు. అహింసావ్రతము పూనినవాడు. స్వేచ్ఛాదేవత నుపాసించినవాడు. దేహమూ, ఆత్మా సర్వమూ ఆదేవత కర్పించినవాడు. తల్లిదండ్రుల ఉపదేశవాక్యము లతనిచెవినిపడి బయటికి వచ్చివేసినవే కాని హృదయముదాకా వెళ్లలేకపోయినవి, అక్కడ స్వేచ్ఛాదేవత కాపురమున్నది కాబట్టి. ప్రాణసంశయస్థితిలోనున్న ఆతని ఏకపుత్రుడుకూడా ఆహృదయంలోకి ప్రవేశించలేకపోయాడు. స్వేచ్ఛాదేవత అంత కఠిన మనస్కురాలు. కన్నీళ్లతో తడిసిన ఆతని భార్యముఖమునకుకూడా ఆతని హృదయమును తాకేశక్తి తప్పిపోయింది, హృదయమునంతా ఆదేవతే ఆక్రమించి ఏలుతున్నది కాబట్టి.......

ఆదేవత అతని దేహముపై ప్రహార ముల పెట్టించినది. నెత్తురు ప్రవాహములు కట్టించినది. జైలుకు పంపించినది.

ఆశిక్షితుడు ఒక్కక్షణమే ఆ దేవాలయ స్తంభము నానుకొన్నాడు. అప్పుడే అతనిహృదయములో పరిణామము కలిగింది. స్వేచ్ఛాదేవతే పరిణతమైనది. ఈ దేవత ఒంటెత్తుగుణమును విడిచింది. విశాలమైనది. సర్వమునూ తనలో ఇముడ్చుకొన మొదలు పెట్టింది. అతని తల్లిదండ్రుల ఉపదేశ వచనములు హృదయమును ప్రవేశించినవి. సుతుడు స్మృతిపథమున పడ్డాడు. నిజసతిముఖము హృదయమందు ప్రతిబింబించింది. స్వేచ్ఛారాధనములో మానవారాధన మున్నది. మానవులలో తనవారున్నూ ఉన్నారు. భగవదారాధనము మూర్తీభవించిన ట్లున్న దేవాలయ స్తంభము ఆతనిమనస్సుకు శాంతమలపరించి జైలులో దిగబెట్టింది.

ఆనాటి రాత్రివేళ మనుష్యసంచారము లేని జైలుప్రాంతములందు ఆతనిభార్య సంచరించడం మొదలుపెట్టింది. తన కేకపుత్రుడు లేనివాడైనాడు. తన హృదయాధినాథుణ్ణి స్వేచ్ఛాదేవత ఎత్తుకుపోయింది. అతనిని వెతుక్కొంటూ వచ్చింది. జైలుముఖముచూచింది. అందమైన ఆ జైలుముఖము ఆమెను భయపెట్టింది. వెనక్కితగ్గి ఆఊరు మహానదిప్రాపు పొందడానికి నడిచినడిచి వెళ్ళింది. ఆనది ఆమెను చూచి ఆశీర్వదించి వెనక్కి పంపివేసింది. విశాలమైన నదీగర్భములో తనకు కాపురముండడానికి చోటు దొరకనందుకు వగస్తూ మళ్ళీ జైలుముఖముదగ్గిరికి వచ్చింది. అప్పుడామె దృష్టిపథమున పడిం దా దేవాలయస్తంభం. భయము పోయింది. ఆదేవాలయ స్తంభాన్ని ఆమె సమీపించింది. ఆ స్తంభము తనలో రేపిన తుపాను ఆపుకోలేక దానికి బలి కాకోరింది. కాని అంతటి మధ్యమైన కబళాన్ని గ్రసించడానికి అది జైలుముఖముకాదు. దేవాలయస్తంభం మృత్యువును ప్రసాదించేది కాదు. శాంతజీవనమును ప్రసాదించేది. ఆ స్తంభమునానుకొని ఆమెకూర్చున్నది. తాను బలిఅగుటకుబదులు తన దౌర్బల్యమునూ, భయమునూ, నిరాశనూ బలియిచ్చింది. శాంతమామెహృదయములో ప్రవేశించింది. తన హృదయాధినాథుణ్ణి ఎత్తుకుపోయిన స్వేచ్ఛాదేవత మళ్ళీ తనహృదయమందే అతణ్ణి ప్రతిష్ఠించింది. దేవాలయస్తంభము తనలో చల్లిన భక్తిబీజములను పదిలపరుచుకొని ఆమె యింటిదారి పట్టింది.

స్వేచ్ఛాదేవతను భగవద్భక్తిగా మార్చి ఆదేవాలయస్తంభము ఆదంపతులను కాపాడింది. ఆజైలుకెదురుగా అది ఉండి ఇంకా ఎందరినో కాపాడుతోంది.

ఆజైలుకెదురుగా ఉన్న ఆదేవాలయస్తంభమున కంతమహత్తు ఉన్నదని ఆదారేపోయే వాళ్ళకు తెలియదు. తెలిసినవారి కామహత్తు ఎలాగ వచ్చిందో తెలియదు.

చూచేవారి కాదేవాలయస్తంభము నేడున్నూ అక్కడ ఏమీఎరగనట్లునిలబడిఉన్నది.

---

## చెప్పుల బాధ



















క్రొ. సుబ్రహ్మణ్యము, కాకినాడ.

# ఆంధ్రకవితాసంప్రదాయములు—కృత్యాది

కోరాడ రామకృష్ణయ్య

కాలము సర్వాధార మని పెద్దలు చెప్పి యున్నారు. సృష్టియందలి ప్రతివస్తువును కాలానుగుణమగు పరిణామమునకు లోనగుచునే యున్నది. భూభాగమందలి మానవుని జీవితపద్ధతులు, తత్సంప్రదాయములవలెనే యాయాజాతుల కవితారీతులు, సంప్రదాయములును దత్తత్కాలములందలి వాఙ్మయదర్పణంబున ప్రతిఫలించుచు వారివారి నిజస్వరూపమును దెలుపుచుండును. భాషవలెనే కవితయు మానవునికి పుట్టుకతోడనే యొక్కసారిగా నలవడినదికాదు. సంఘజీవియగు నాతడు తాను జన్మించిన దేశకాలపరిస్థితుల కనుకూలముగా తత్తద్భాషాకవితాసంప్రదాయముల నలవరచికొని స్వీయప్రతిభానుభవోద్భాసిత మగు మనోబుద్ధివికాసముచే వాని కొకవిధమగు నూతనతేజమును గల్పించి, చిరపరిచితవస్తువులయం దపరిచితానూన భావోద్భేదంబును, "అల్పాక్షరముల ననల్పార్థ రచనయు" గావించి తన 'కవితా వివేకము'ను చాటుకొనుచుండును.

భాషయనునది మానవునకు సహజమే కాని సంపాద్యము కాదనియు, నీభాషతోపాటు జ్ఞానదాయకము లగు గ్రంథము లొకకాలమున నొకానొక జనసంఘమునకు సృష్టికర్తచే ప్రసాదింపబడిన వనియు నమ్మకముగలవా రిప్పటికిని కొందరు గలరు. హీబ్రూ భాష ఆదిభాషయనియు, బైబి లాదిగ్రంథ మనియు పాశ్చాత్యదేశీయులచే దలంపబడినట్లే సంస్కృతము దేవభాషయనియు, వేదము లనాదులనియు నీదేశమున దలంపబడుచున్నది. కించిజ్ఞుడు, నల్పాయువునగు మానవుడనాదివిషయములను గూర్చి యిదమిత్థమని నిర్ణయింప దొరకొనుట సాహసమేగాని, శాస్త్రప్రయోగ పద్ధతి ననుభవపరిపాకముతో సమన్వయించి పరిశీలించుచున్న యాధునికభాషాసాహిత్య తత్త్వజ్ఞుల యభిప్రాయానుసారముగా భాష మానవునకు సంపాద్యమే గాని సహజముకాదనియు, నాయాభాషలలోని యుత్తమ గ్రంథము లంతకుపూర్వము చిరకాలమునుండి యాయా భాషలలో పలువురు ప్రతిభావంతు లొనర్చిన యనేకవిధములగు రచనారీతుల పరిణామఫలితములే యై యుండును గాని హఠాత్తుగా నేదోయొక్క కాలమున బయలుదేరినవి కావనియు నాధునిక విద్యాధికులు పలువురచే విశ్వసింపబడుచున్నది.

ప్రస్తుత మాంధ్రవాఙ్మయము నన్నపార్యుని భారతరచనతోడనే ప్రారంభమైనదనియు, నాంధ్రభాషయు నాతనికిబూర్వకాలమున కేవల సంస్కారశూన్యమై, యే యాటవికుల భాషగానో యుండగా నన్నయయే దానిని సంస్కరించి లక్షణ మేర్పరచెననియు, ఆకారణముచేతనే యాతడు వాగనుశాసనుడయ్యెననియు గొందరు చెప్పుదురు. ఆంధ్రమునందలి యిపుడు లభ్యమైయున్న సంస్కృతభూయిష్ఠ మగు శిష్టకవితాశాఖ కీత డాదికవియు, ననుశాసకుడును నై యాంధ్రభాషా వాఙ్మయములకు, నాంధ్రలోకమునకు మహోపకార మొనర్చినాడనుటకు సందేహము లేదు గాని యంతకుపూర్వమున నాంధ్రభాషావాఙ్మయ సంప్రదాయములే లేవనియు నప్పటి పరిస్థితుల గమనింపకయే, వాని సహాయమును గొనకయే యాతడు స్వయముగా నాంధ్రభారతమువంటి యుద్గ్రంథ రచన గావించినాడనుట సంభావ్యము కాదు. నన్నయ తన కాలమున నారీతిగా నట్టిభాషలో భారతరచన గావించుట కెట్లు సాధ్యమయ్యెను? అప్పటి భాషావాఙ్మయపరిస్థితు లెట్లు ఎంతవఱకు సహాయముచేసినవి? వీనికి పూర్వమున భాషాకవితాసంప్రదాయము లెట్లున్నవి? వాని నీత డెంతవఱ కాదరించెను? ఎంతవఱకు తాను స్వాతంత్ర్యమును వహించెను? ఈతని పద్ధతులను తరువాతి కవు

లెంతవఱ కనుసరించిరి? అను నీమొదలగు విషయములను భాషావాఙ్మయపరిణామదృష్టితో మనము పరిశీలించినగాని, ఆంధ్రభాషావాఙ్మయముల పూర్వచరిత్రము, వాని పరిణామక్రమము మనకు తేటతెల్లము కావు.

ఆంధ్రమున నన్నయ యాదికవియనుటచే నంతకు పూర్వకాలమునందలిదని చెప్పదగిన భారతమును బోలిన యుద్గ్రంథ మేదియు, నేకారణమువల్ల నైన నేమి మనకు లభింపలేదనుటయే యగును గాని, యేవిధమైన రచనలు, వాఙ్మయ సంప్రదాయములు కూడ లేకయే యాతడు తన ప్రతిభాశక్తిచే నొకసారిగా భారతరచనా కల్పన చేసియుండుననుభావ మెంతమాత్రమును గాదు. అది యంగీకరింపదగినదియు గాదు. ఏభాషలో గాని యొక్కసారిగా నుద్గ్రంథములు బయలుదేరిన వని చెప్పుట కవకాశ మగపడదు. ప్రతిభాషలోను, దొలుదొలుత చిన్నచిన్న పదములు, పాటలు మొదలగునవి బయలుదేరి, కాలక్రమమున నా జనసంఘమున భావసంపద పెంపొందినకొలది బుద్ధిమంతు లవలంబించిన రీతుల రచనాసంప్రదాయములు పెరుగుచు, కాలానుగుణముగ నుద్గ్రంథములు వెలువడి యాభాషాసతి కలంకారమ్ములై యావాఙ్మయముయొక్క విలువను పెంపొందించుచుండును. ఒక్కొకకాలమందలి కవులు తమకు పూర్వమునగల భాషాకవితాసంప్రదాయముల ననుసరించుచునే, తమప్రతిభను మెఱయించి నూతనమార్గములను ద్రొక్కుచుందురు. ప్రపంచమునందలి ప్రసిద్ధ వాఙ్మయములలో బ్రధానస్థాన మాక్రమించిన షేక్స్పియరు, కాళిదాసాదులు సహిత మంతకుబూర్వమున గల భాషాకవితాసంప్రదాయముల ననుసరించియే తమ తొలిరచనలను గావించినవారై, కాలక్రమమున గలిగిన యనుభవపరిపాకమునుబట్టి స్వీయప్రతిభలను మెఱయించి యుద్గ్రంథములను రచించి లోకప్రసిద్ధి గాంచినవారే గాని, వెనుకటియాధారము లేకయే నేలవిడిచి సాము చేసినవారు కారు. షేక్స్పియరు తొలిరచనలలో గొన్నిటికి మార్లో, గ్రీక్ మొదలగు పూర్వకథలును, కాళిదాసునకు భాసాదులును గొన్నివిషయముల మార్గదర్శకులైరని చెప్పినంతమాత్రమున వారి గొప్పతనమున కెట్టి భంగమును గలుగబోదు.

"అథవా కృతవాగ్ద్వారే వంశేస్మిన్ పూర్వసూరిభిః,
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః"

అని తాను ప్రాచీనులుచేసిన మార్గముననే పోవుచున్నానని కాళిదాసే చెప్పికొనియున్నాడు గదా. నన్నయ తనకు పూర్వమున తెలుగుకవు లున్నట్లు గాని, తాను వారి ననుసరించినట్లుగాని యేమియు జెప్పలేదు గావున నాత డాంధ్రభాషావాఙ్మయ సంప్రదాయములను స్వయముగ నెలకొల్పినవాడేగాని పూర్వ సంప్రదాయముల ననుసరించినవాడు కాడని కొంద ఱనవచ్చును. ఇదియు యుక్తియుక్తముగాదు. ఈతని కాదరపాత్రమై యీతనిచే నవలంబింపబడిన శిష్టకవితాశాఖకు జెందిన ప్రసిద్ధకవులు లేకపోవచ్చును గాని జనసామాన్యముచే నాదరింపబడిన కవులు, కవితయు నీభాషలో నంతకు పూర్వము లేదనుటకు వీలులేదు. అట్లన్నచో ౧౯వ శతాబ్ది మధ్యభాగమునుండి గాని యీ భాషలో సంస్కృత నాటకములు తెలిగింపబడి యుండలేదు గావున, నంతకు పూర్వమున దెనుగున నేవిధమగురూపకములు లేవనియు, దెనుగువారికి దృశ్యకావ్యము లన్ననేమో తెలియనే తెలియదనియు వాదించినట్లే యగును. ఈవాదము సంస్కృతనాటకముల యాంధ్రీకరణముల నిటీవలవాని ననుసరించిగాని, లేదా ఆంగ్లనాటకములు ననుసరించిగాని రచింపబడిన యాధునిక నాటకములు మాత్రమే యాంధ్రనాటక వాఙ్మయశాఖకు జెందదగినవి గాని, యంతకు పూర్వమున దేశమంతటను వ్యాప్తి గాంచి, ఇటీవలి కృత్రిమరంగములందు గాక వీథి రంగములందే ప్రదర్శింపబడుచుండిన వీథినాటకములు, యక్షగానములు మొదలగువాని కాంధ్రనాటక వాఙ్మయమున స్థానమే లేదను నభిప్రాయముగలవారికి రుచించునేమో గాని, యాంధ్రవాఙ్మయచరిత్రమును, దాని పరిణామక్రమమును నన్వేషించి తెలిసికొనుట కది సరియైన మార్గమని చెప్పుట కవకాశము లేదు. సంస్కృతనాటకములు తెలుగులోనికి రాకపూర్వము యక్షగానాదులు భాష

లో ప్రబలియుండి పిదప నంతరించినట్లే, నన్నయశిష్ట కవితారచనకుపూర్వము జానుతెనుగుకవిత్వము దేశమున వ్యాప్తిజెంది, తరువాత నంతరించియుండును. ఆ దేశీయకవితాసంప్రదాయములు కొన్ని నన్నయాదుల శిష్టకవితాశాఖను బోషించినను, ఇది పెరిగిన కొలది పూర్వశాఖలు పుల్లవిరిగిపోవుటచే నీశాఖయే మూలవృక్షమనవలసిన స్థితి గలిగినది. ఇంగ్లాండుదేశమున నార్మనుల విజయము తరువాత నంతకుపూర్వమందలి దేశీయ మగు ఆంగ్లోసాక్సన్‌భాషాకవితాసంప్రదాయములు వెనుకబడి, మధ్యదేశపు లాటిన్‌మిశ్రితాంగ్లభాషాకవితాసంప్రదాయములు పెచ్చుపెరిగి యాంగ్లవాఙ్మయపద్ధతిని మార్చినట్లే, ౧౧-వ శతాబ్దియందలి నన్నయాదుల శిష్టకవిత వెనుకటి దేశీయ కవితాపద్ధతిని వెనుకకు ద్రొక్కివేసి నూతన యుగమును బయలుదేరదీసిన దనవచ్చును.

ఈనూతనయుగ చిహ్నములు నన్నయకు రెండుమూడువందలసంవత్సరములనుండియు పొడసూపుచునే యున్నవి. మనుమార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత పుట్టించి తెనుంగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజులతోడనే యీనూతనయుగము ప్రారంభమైనదనవచ్చును. నన్నయకుపూర్వకాలమునందలి చాళుక్యరాజులశాసనములలోనే నన్నయకాలపు భాషారచనాసంప్రదాయములను మనము గుర్తింపవచ్చును. ఇవి చాళుక్యరాజుల యాస్థానములందలి పండిత కవులచే రచింపబడియుండును గావుననే వీనిలో గొన్ని పద్యరచనగలవై తరువాతి శిష్టకవితతో బోలికగల వగుచున్నవి. సంస్కృతభాషావాఙ్మయములకు విశేషము పలుకుబడిగలిగిన యాకాలమున వానియం దత్యంతాదరముగల రాజుల యాస్థానములయందు పండిత కవులకు గాక జానుదెనుంగున పద్యములు, పాటలు మొదలగు వానిని రచించు దేశీయకవులకు పలుకుబడిగలుగు టెట్లు? ఈకాలమునగూడ ద్విపదకవిత్వమునకును, శతకములకును పురాణప్రబంధములకును గల గౌరవస్థానము వాఙ్మయములో లేదుగదా. చిన్నకోటపెద్దన చెప్పినట్లు 'విలసద్భావరసాద్యలంకృతులచే విప్పారి గీర్వాణ భాషా కబ్బంబులకు గల మంచితనము లన్నిటినిగలిగిన సత్కావ్యమును తెలుగంచుం జెవిబెట్టలేని పండితులుగల యాకాలమున దేశికవుల సామాన్య పదకవిత్వమున కాదర మెట్లు కల్గును? కావుననే నన్నయ నన్నెచోడ తిక్కనలు మార్గకవులను పేరుపెట్టి స్తుతించియు, దేశిసత్కవుల నామములను బేర్కొనకయే స్మరించి వదలిపెట్టిరి. కావుననే వారిపేళ్లయినను మన కీకాలమున దెలిసికొనుట కవకాశము లేకపోయినది. ఇట్లు మనకు మిగిలిన వాకాలపు శాసనరచనలు మాత్రమే. ఇవియైనను శిలలపై జెక్కబడి పాలకులచే భద్రపరుపబడినవి గావున నింతకాలము నిలిచినవి. రాజాస్థానములందలి పండితులే వీనిని రచించుటచే నివి నన్నయకుపూర్వమునగల శిష్టకవితాపద్ధతినే సూచించునవైనవిగాని జానుకవితారీతిని సూచించునవి కాలేదు. ఎట్లయినను ఈ శాసనములు వాఙ్మయభాగముగా బరిగణింపదగునా, అవి నన్నయాదుల కవితకు మార్గదర్శకము లనదగునా యని యాక్షేపించువారును గలరు. రసాత్మకమగు వాక్యమే కావ్యమని యాలంకారికుల మతమైనపుడు అట్టి పద్యములు కొన్ని శాసనములలో నున్నంతమాత్రమున వాఙ్మయభాగము లగు బరిగణింపబడదగవా? అజ్ఞాతయుగమున నేది లభించిన నదియే వాఙ్మయభాగ మగును. ఇవి యట్లు పరిగణింపబడుగాక, లేకున్న లేకపోవుగాక, నన్నయకు పూర్వకాలమున నాంధ్రభాషా కవితారీతులు, సంప్రదాయములు నెట్లున్నవో తెలుపదగిన యాధారములై యున్నవనుటకు సందేహము లేదుగదా. నన్నపార్యుని సంస్కృతభూయిష్ఠరచనను బోలిన రచన, గద్యపద్యసమ్మేళనము, ఆతని వాడుకలోనివాని బోలిన పదబంధములు, ఆతని భారతమున నొక విశేషముగా గ్రహింపబడుచున్న మధ్యాక్కరాదివృత్తరచన, సీసపద్యనియమ విధానము మొదలగు విశేషము లాతనికిబూర్వము రెండుమూడువందలయేండ్లనుండియు శాసనములలో గనబడుచున్నపు డాంధ్రభాషలో నీరచనాసంప్రదాయములే గాక వానితోగూడిన కొన్ని సామాన్యగ్రంథములయిన ఆకాలమున బయలుదేరియుండు నని యూహించుట నిరాధారంబగునూహ యగునా? ఇట్టి సంస్కృత

భూయిష్ఠరచన నన్నయకు పూర్వము రెండువందల యేండ్లక్రితము కన్నడభాషలో సుప్రసిద్ధ మయ్యే యున్నదిగదా! తెలుగునమాత్రము లేదనుటెట్లు? ఎట్లయినను గ్రంథములు లభింపనియప్పుడు ఏదో ఒకవిధమగు వాఙ్మయ ముండవలయు నను నూహలవలన లాభమేమి యని కొందరందురు. కాని మన మాంధ్రవాఙ్మయ పరిణామక్రమాన్వేషణమునకు గడంగినప్పుడు ఆయజ్ఞాతయుగ పరిస్థితులను, అప్పటి వాఙ్మయము లభింపమికి గారణములును అప్పటి యథార్థస్థితిని బట్టియు, పరిసరపరిస్థితుల ప్రబలసాక్ష్యమును బట్టియు నూహించి నిర్ణయింపవలసినవే యగును. ఈ యూహ నేలవిడిచిన సాముమాత్రము కాగూడదు. దొరకిన యాధారములను బట్టి, పరిసరపరిస్థితులనుబట్టి యుక్తియుక్త మగు నూహ చేయవలసియుండును. మఱియు హఠాత్తుగా నొక్కసారిగా భారతమువంటి యాంధ్రరచన బయలుదేరుటయు, నది యట్లే బయలుదేరినచో నద్దానివలన నంతకుపూర్వ మట్టిరచనారీతి కలవాటుపడని యాంధ్రావళి మోదముం బొరయుటయు మాత్ర మెట్లు సంభవించును? ఇంతకు పూర్వశాసనములు, కన్నడ కవితయు నట్టి రచనాసంప్రదాయములు నన్నయకు చిరకాలము క్రిందటనే యేర్పడియున్నవని వ్యక్తము చేయుచునే యున్నవి. కాని మఱియొక విషయము గమనింపవలసియున్నది. ఇట్టి రచనాపద్ధతి రాజాస్థానములందలి పండితకవులచే నవలంబింపబడి శిష్టజనసంఘముచే నాదరింపబడుచుండెనేగాని యది సర్వజన సామాన్యమై యుండలేదు. కావుననే పాల్కురికి సోమన 'యారూఢగద్యపద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠ రచన, మానుగా సర్వసామాన్యంబుగా'దని చెప్పినాడు. సర్వసామాన్యమగు నీజానుకవిత, సామాన్యజనుల హృదయాంబుధిని పొంగిపొరలివచ్చి వారి ముఖరంగమున గొంతకాలము తాండవించి, యచ్చటనే యంతరించినది. కావుననే యాంధ్రవాఙ్మయ వృక్షమునకు సహజమైన మూలస్వరూపము గుర్తించుట కవకాశములేకుండ పోయినది. ఇది విరివిగ పెరిగి క్రమముగట్టి రమ్యఫలంబుల నొసగుచున్న సంస్కృతకవితావృక్షంబున కంట(టు) గట్టబడిన దగుటచే, దీని మూల స్వరూపము, సహజస్వభావము మార్పునొంది రూపుమాసినవి. ఆంధ్రజాతీయకవితాంకురములు గీర్వాణ కవితా మహావృక్షశాఖలో లీనమగుటచే వాని పూర్వరూప మంతరించుట తటస్థించినది. ఈ క్రొత్తయంటులను తయారుచేయించి కన్నడదేశమునను, తెలుగుదేశమునను నెలకొల్పి పెంపొందించినవారు చాళుక్యరాజులు. వారి కాలమున నీయంటు పెరుగుచుండినరీతినే వారి శాసనములు మనకీ కాలమున సూచించుచున్నవి. మఱికొంతకాలమునకు చాళుక్యకులాభరణుం డగు రాజరాజుకాలమున నీ వృక్షము ఫలించి యతిరసవంతంబగు భారతకవితాఫలము నాంధ్రలోకమున కొసంగినది.

కన్నడకవితావృక్ష మింతకు సుమారు రెండు శతాబ్దములు పూర్వమే చాళుక్యకులాభరణుం డగు నరికేసరికాలమున ఫలించినది. ఇదియు సంస్కృతవృక్షమున కంటే. దీనిని పోషించినవారును చాళుక్య రాజులే. ఇందును మనకు లభించినది సంస్కృతభూయిష్ఠ మగు శిష్టకవితయేగాని, తెలుగులోవలెనే దేశీయం బగు ప్రాచీనహాలకన్నడకవితాస్వరూపము తెలియవచ్చుట లేదు. ఇట్లాంధ్రకన్నడ కవితావృక్షములు స్వతంత్రములే యైనను ఇవి పోషింపబడినరీతిలోగల సామ్యమును బట్టి వీనిఫలములలో గూడ కొంతసామ్య మగపడుట కవకాశము కలదు. నన్నయాదుల కవితాసంప్రదాయములలో గొన్నియైనను, అప్పటి కొకటిరెండుశతాబ్దములకు పూర్వమే దేశీయకవితాశక్కి నొకదానినేర్పాటుచేసి సాగించుచుండిన కన్నడకవుల రీతినుండి గ్రహింపబడియుండుననుటకు సందేహము లేదు. నన్నయ నారాయణభట్ట నన్నెచోడాదులు కర్ణాటభాషావాఙ్మయ పరిచితిగలవారనుట నిర్వివాదముగదా.

సంస్కృతభాషతో కన్నడాంధ్రదేశ్యములను మేళవించి, మణిప్రవాళపద్ధతికి భిన్నమైన యొకవిధ మగు తత్సమభాషను నిర్మాణముచేసి తన్మూలమున శిష్టకవితను సాగించుటలో నీభాష లొక్కవిధమగు సంప్రదాయమునే యవలంబించినవని చెప్పదగును. ఇట్టి భాష

కన్నడాంధ్రదేశముల రెంటను నన్నయకు రెండుమూడు వందల యేండ్లకు పూర్వమే ప్రచారములోనికి వచ్చి యుండును. ౯-వ శతాబ్దియందే నృపతుంగుడు ప్రాత కన్నడము రసవంతము గాకపోవుటచే పనికిరాదనిచెప్పి, సంస్కృతమును కన్నడముతో మేళవించుపద్ధతిని కవిరాజమార్గమున వ్యక్తపఱచి తానట్లు రచించినాడు. కావున నంతకుపూర్వమే యట్టిరచన ప్రారంభింపబడిన దనవలయును. తెలుగున నట్లే జరిగియుండును. నన్నయ నన్నెచోడుల కవితలోని యక్కరరచన, వైరిసమాస ప్రయోగము మొదలగునవి కన్నడకవితాసంప్రదాయములతో సరిపోవుచునే యున్నవి.

మఱియు కృత్యాదిని దేవతాస్తోత్రవిషయమున పంపాదులపద్ధతికిని, నన్నయనన్నెచోడాదుల పద్ధతికిని గొంతసామ్య మగుపడుచున్నది. కాళిదాసాది పూర్వసంస్కృతకవు లొకటిరెండుశ్లోకములలో నిష్టదేవతాస్తోత్రమునుచేసి ముగించినారు. కొన్ని గ్రంథములు వస్తునిర్దేశముతోడనే ప్రారంభమైనవి. నన్నపార్యుడు సంస్కృతమునందలి యాదరముచే నాభావలోనే మొదట త్రిమూర్తిస్తవము చేసినను, తరువాత మఱియొకమారు 'హరిహరాజగజాననార్క షడాస్యమాతృ సరస్వతీ, గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతిచేసి' పిదప ప్రాచేతసపుత్రుని దలచి, పరాశరాత్మజుని గొలిచికాని కథాప్రారంభము చేయలేదు. ఇట్లు దేవతాతతి గొల్చుట నన్నయకాలమునకుముందు సంస్కృతకవిసంప్రదాయముగా గనబడదు. కన్నడభారతమున పంపకవియు, గదాయుద్ధమున రన్నకవియు హరిహర మార్తాండ మనోజసరస్వత్యంబికావినాయకులను వరుసగా కృత్యాదిని స్మరించి వాల్మీకివ్యాసులను స్తుతించినారు. దేవతాతతియందును, వారిని స్మరించిన క్రమమునందును యత్కించిద్భేద మగపడుచున్నను, హరిహరగజాననార్కసరస్వతీగిరిసుతలును, వీరితరువాత వాల్మీకి వ్యాసాదులును వీరిచే స్మరింపబడినవారైనారు. ప్రాచీన సంస్కృతకవులచే నిట్టి దేవతాతతి ప్రశంసింపబడకుండుటనుబట్టి, నన్నయ తనకు పూర్వుడను కన్నడకవిసంప్రదాయము నవలంబించియుండు నని తలంపవలసియున్నది. కార్తికేయుడు చాళుక్యుల కులదైవ మగుటచే షడాస్యుని, మాతృకలను నన్నయ ప్రత్యేకముగా స్మరించినా డని కొందరు చెప్పుదురు. చాళుక్యుడే యగు నరికేసరికి గృతియిచ్చిన పంపకవి యేకారణముచేతనో వారిని స్మరింపలేదు. కాని నన్నెచోడుడు తన కుమారసంభవమున "హరిహరాజగజాననార్క షడాస్య మారసరస్వతీగిరిసుత"లకు నమస్కరించినాడు. అనగా నన్నయకు నీతనికిని 'మాతృ—మార' విషయముననే భేదమగుపడుచున్నది. నన్నయ మాతృకలను స్మరించి మారుని వదలివేయగా, నన్నెచోడుడు నన్నయస్మరించిన దేవతాతతిలో మాతృకలను వదలి పంపకవివలె మారుని స్మరించినాడు. ఈసందర్భమున 'మాతృసరస్వతీ' యను పాఠము 'మార' యనుదానికి ప్రమాదజనితమేమో యనియు, నన్నెచోడునిచూచి నన్నయ మారయనియే వ్రాసియుండుననియు కొందఱు తలంచిరిగాని, పెక్కు తాళపత్రగ్రంథములలోమాత్రము 'మాతృ' అను పాఠమే కనబడుచున్నది. తగిన యాధారము లభించినగాని దీనిని నిర్ణయింపశక్యముకాదు. చోడుని ప్రాచీనతయు వివాదగ్రస్తమే. మొత్తముమీద యత్కించిద్భేద మున్నను నన్నయనన్నెచోడుల కృత్యాదిదేవతా ప్రశంస యొక్కరీతి నుండుటయే గాక వీరికి పూర్వులగు పంపాదుల పద్ధతితో చాలవరకు సరిపోవుచున్న దనవచ్చును. నన్నయ "హరిహరాజ", "శ్రీవాణీగిరిజా" అనువానిలో హరిని ముందుపెట్టి ప్రాధాన్య మివ్వగా, నన్నెచోడుడు శైవమతాభిమానియగుటచే హరునకు ప్రాధాన్య మిచ్చి 'శ్రీవాణీంద్రామరేంద్రార్పిత మకుట మణిశ్రేణివానూంఘ్రిపద్మాజీవోద్యత్కేసరుం' డని మహాదేవుని యంఘ్రిపద్మములకు శ్రీవాణీంద్రులచే మ్రొక్కించినాడు. పాల్కురికి సోమన వీరశైవు డగుటచేగాబోలు, శివేతరదేవతలనుగాని, భవకవులనుగాని స్తుతింపనొల్లక, హరునిగీర్తించి చెన్నమల్లికార్జును నుల్లమున నిలిపి ప్రమథుల దలచినపిదప, పురాతనభక్తనికరంబును, నూతన భక్తులనుమాత్రమే గొలిచి బసవచరిత్ర మివ్వసుమతిమీద బసరించినాడు. పిదప తిక్కనార్యుడు నిర్వచనోత్తరరామాయణమున హరిహరపద్మగర్భులను స్మరిం

చి, ఆదికవీంద్రుల నూత్నసత్కవీశ్వరులను నామగ్రహణము లేకయే గొలిచియున్నాఁడు. భారతరచనాసందర్భమున నిరూఢాద్వైతభావము కలవాఁ డగుటచే గాఁబోలు, హరిహరనాథునిమాత్రమే స్తుతించెను. ఇట్లీతఁ డీవిషయమున కొంత స్వాతంత్ర్యము చూపినను, ఈతనికి కృతియిచ్చిన కేతనార్యుఁడు నన్నయ నన్నెచోడాదులవలెనే పెక్కుదేవతలను స్తుతించినాఁడు. నన్నెచోడునితోపాటు హరిహరగజాననకుమార సరస్వతులనే గాక నన్నయవలె నజుని, షడాస్యుని గూడ స్తుతించినాఁడు. ఈతఁడు తక్కినదేవతలతో పాటు షడాస్యుని గూడ స్తుతించుట పూర్వసంప్రదాయము ననుసరించి యగునేగాని, గ్రంథము తిక్కనార్యునికి కృతి కావున, చాళుక్యసంబంధమునుబట్టి యనుటయు బొసగదు. ఇక నెఱ్ఱాప్రెగ్గడయు హరిహరాజ గజాననేందిరాసరస్వతులను స్తుతించి ప్రధానదేవతా సంకీర్తనంబు చేసితి నని చెప్పినాఁడు. షడాస్యమాతు(మాతృక)లను నీతఁడు ప్రధానదేవతలనుగా దలంచిన ట్లగపడదు. పూర్వకవులు స్తుతించిన దేవతలలో ప్రధానమైనవారినే తాను స్తుతించితినని యీతఁడు చెప్పిన కారణమునుబట్టియేయైయుండవలయు, నీతనికి తరువాతికవులనేకులు హరిహరాజగజాననేందిరా సరస్వతులనుమాత్రమే స్తుతింప జొచ్చినారు. అనంతామాత్యుఁడు భోజరాజీయమునను, శ్రీనాథుఁడు శృంగార నైషధమునను హరిహరాజ గజానన సరస్వతులను మాత్రమే స్తుతించినారు. పోతన హరిహరాజగజాననేందిరా సరస్వత్యంబికలను స్తుతించినాఁడు. పారిజాతాపహరణమున తిమ్మనార్యుఁడు నన్నపార్యునివలెనే హరిహరాజగజాననకుమారషడాస్యమాతృ (అంబిక) సరస్వతులనేగాక రమాదేవినికూడ స్మరించి, హరగజాననేందిరాసరస్వతులను ప్రత్యేకముగా స్తుతించినాఁడు. పెద్దనార్యుఁడు, సంకుసాల నృసింహకవి హరిహరాజ గజానన సరస్వతులను మాత్రమే స్తుతించినారు. ఇట్లిది యాంధ్రకవితలో నొకవిధమగు సంప్రదాయముగా నేర్పడిన ట్లగపడుచున్నది. వైదికమతాభిమానులగు నాంధ్రకవులు కృత్యాది నీదేవతలనుగాక మఱియే దేవతలను స్తుతింతురు. దీనిలో విశేషమేమి యని ప్రశ్న కలుగవచ్చును గాని, ప్రసిద్ధములగు సంస్కృతకావ్యములనుండి యనేక సంప్రదాయములను గ్రహించిన తెలుగుకవులు, దేవతాస్తుతివిషయమున నూతనఫక్కి నవలంబించినవా రగుటచే నాంధ్రకవితయం దిదియొక విశేషలక్షణ మగుచున్న దని చెప్పక తప్పదు. కాళిదాస భారవి మాఘాదుల ప్రసిద్ధ కావ్యములు పెక్కు దేవతానమస్క్రియాపూర్వకములు గాక వస్తునిర్దేశపూర్వకములే యైయున్నవి. వీనిలో సుకవిస్తుతి కుకవినిందాదులుకూడ లేవు. చంపువులలో ప్రసిద్ధంబైనదగు భోజుని రామాయణచంపువులో గూడ "హైరంబమంఘ్రిద్వయ"ము మాత్రమే స్తుతింపబడినది గాని తెలుగుకవుల దేవతాతతినిగూర్చిన స్తుతి కానరాదు. త్రివిక్రమభట్టు రచించిన నలచంపువులో మాత్రము కవితాలక్షణమును, కవులను గూర్చిన ప్రశంస కొంత కలదు.

"ప్రసన్నాః కాన్తిహారిణ్యో నానాశ్లేష విచక్షణాః,
భవన్తి కస్యచిత్పుణ్యైః ముఖేవాచో గృహే స్త్రియః.

కింకవే స్తస్య కావ్యేన కింకాండేన ధనుష్మతః,
పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః.

అక్షమాలాపవృత్తిజ్ఞా కుశాసనపరిగ్రహా,
బ్రాహ్మీవ దౌర్జనీ సంస ద్వన్దనీయా సమేఖలా.

రోహణంసూక్తిరత్నానాం బృందం వందే విపశ్చితామ్,
యన్మధ్యపతితో నీచః కాచో ప్యుచ్చైర్మణీయతే."

పై వానిలోని రెండవశ్లోకము నన్నెచోడుని "ముదమున సత్కవికావ్యము, నదరగ విలుకాని పట్టినమ్మును బరహృద్భేదమై తలయూపింపని, యది కావ్యమె మలరి పట్టినది యుంగరమే" యనుపద్యమును, నాల్గవశ్లోకము నన్నపార్యుని 'సత్సభాంతరసరసీవనంబుల ముడంబున గొనియాడుటను' దలపించుచున్నవి. కుకవి నిందాదులు బాణుని హర్షచరిత్రలోనే కొంతవఱకు కనబడుచున్నవి.

"ప్రాయః కుకవయో లోకే రాగాధిష్ఠితదృష్టయః,
కోకిలా ఇవ జాయంతే వాచాలాః కామకారిణః.

# కావేరి

'గిరి'

౧

కృష్ణారావు మొగవాడవటంచేత, యెండలో తిరగడంచేత ఆయనసౌందర్యం ఛప్పున అగుపడదుగాని ఆయనకూతురు రాజ్యలక్ష్మీ చాలాచక్కంది అని చూడటంతోటే తెలుస్తుంది. రాజ్యలక్ష్మీ చెక్కిన చందనపుబొమ్మలాగు పొడుగ్గా, తీర్పుగా వుంటుంది. చక్కని ముక్కు, సన్నని పెదిమలు, విశాలమైన కళ్లు, పల్చని చెంపలు, జామపండులాంటి దేహం యెంతో అందం కూరుస్తాయి ఆమెకి. ఆమెశరీరం చాలా సన్నదైనా తగినంత సుందరంగా నిండుగావుండి నాజూగ్గా ఆకర్షిస్తుంది. లోట్రసనీసాకిచుట్టిన కాగితంమల్లే ఆచీరని అధ్వాన్నంగా అరవాళ్లమాదిరి చుట్టక సింపిల్‌గా ఆంగ్రులకట్టు కట్టి మొండిచేతుల రవికెను తొడిగి కాళ్లకి చెప్పులువేస్తే, సౌందర్యమంతా పాశ్చాత్య స్త్రీలల్లోనే వుందనుకునే నవీనయువకులుగూడా ముగ్ధులౌతారు.

అయినా, పాపం, కృష్ణారావుఛాందసంవల్ల రాజ్యలక్ష్మీకి రూపానికితగిన విద్యా సంస్కారాలు లేవు. సంఘానుగ్రహంవల్ల ఆమె యవ్వనానికి తగిన వుపయోగం లేదు.

కృష్ణారావుకి శివసముద్రం మార్పుఅయినాక ఆ కొత్తవూరికి ఆడవాళ్లని తీసికెళ్లక తానొక్కడే వెళ్లాడు. వొకనెలతరువాత వాళ్లని రమ్మని రాశాడు. కృష్ణారావుభార్య పద్మమ్మ, రాజ్యలక్ష్మీ యిద్దరూ ఆడవాళ్లవటంచేత వెంటరావటానికి మొగాళ్లెవరూ లేకుండడంచేత వాళ్లొచ్చేబండికి మద్దూరుస్టేషనుకి యెవరినయినా పంపిస్తాననికూడా రాశాడు. ఆవాళ మధ్యాన్నం మూడుగంటలకి బండి మద్దూరులో ఆగేవరకు పందొమ్మిది యిరవైయేళ్ల కుఱ్ఱాడొకడు వాళ్లున్న పెట్టెవేపు పరుగెత్తుకొచ్చి, తలుపుతెరిచి, తనపేరు గోపీనాథు అనీ, బళ్లలో మెకానిజం నేర్చుకుంటున్నాననీ, కన్నడంవాళ్లనీ, కృష్ణారావు తమని తీసుకోరావటానికి తన్ను పంపాడనీ, అన్నీ వొక్కటేవూపిరిలో అనేస్తూ చెక్కపైనుంచి సామానుదింపాడు. సామాను దింపుతోనే పోర్టర్ని కేకేసి బేరమేమీ లేకుండా వాడికందించాడు. ఇదంతా చూస్తోనుంచున్న రాజ్యలక్ష్మీ, పద్మమ్మ చకితులైపోయారు. ఆ హడావుడి, చురుకుదనానికి తోడు అతని గట్టిశరీరం, సన్నని వొచ్చీరాని మీసం, హెరల్లాయిడ్‌అద్దాలు, పొడాకోటు, తెల్లని లుంగీ, రాజ్యలక్ష్మీని మరీముగ్ధురాలిని చేశాయి. పక్కనే నుంచున్న అరవాళ్లపిల్లొకామె నోరు తెరిచి అతనికేసి చూస్తోంటే వాళ్ల అత్త కమిలిపోయేటట్టు బుగ్గపించి, "వాడెంట పోరాదూ" అంది.

బస్సుదగ్గిరకూడా అదే హడావుడి గోపీనాథుది. అందరితో గబాగబా మాట్లాడేస్తోన్నాడు కన్నడంలో, యింగ్లీషులో, హిందూస్తానీలో. వీళ్లిద్దరికీ మంచిస్థలం చూపించాడు కండక్టరు. రాజ్యలక్ష్మీవెనకసీటులో కూచున్నాడు గోపీనాథు. అస్థలం వీళ్లకివ్వడం తక్కిన ప్రయాణీకులు కాస్త వోర్వలేక గొణిగితే కండక్టరు, గోపీనాథు వాళ్లని దబాయించారు కన్నడంలో. "కృష్ణారావు", "వోవరుసీరు" అనే ముక్కలు మాత్రం అర్థమయాయి రాజ్యలక్ష్మీకి.

బస్సు వూరుదాటింది. అందాకా గోపీనాథుకేసి పిచ్చిగా చూస్తోన్న పద్మమ్మకి అప్పుడు కాస్త వూపిరి ఆడినట్టుంది. నెమ్మదిగా, "నీ పేరేమిటి నాయనా!" అని అడిగింది. యిదివరకే ఆతను చెప్పాడన్న విషయం మరిచి, 'అయ్యో! నాకొకొడుకు యిట్లాంటివాడు లేక పోయెనే' అనే ముఖంతో.

"గోపీనాథుఅండి."

కాస్తసేపు ఆగి, "ఎన్ని గంటలకి చేర్తాం ఆ వూరికి?"

"అయితే మీరెప్పుడూ యీవూరు రాలేదన్నమాట!"

"లేదు, యిదే మొదటితడవ."

ఇహ తరుణం దొరికిం దాతనికి. కావేరి నది పుట్టుపూర్వంవగ్గరనుంచి శివసముద్రంలో పవరుహౌసు స్థాపితం అయ్యేవరకు జరిగిన చరిత్రంతా చెప్పాడు ముందు రాజ్యలక్ష్మిభుజంమీదికి వొరిగి. వాళ్లే కాక బస్సులోని ముందుభాగంలోనివాళ్లంతా చకితులయి పోయారు. పద్మమ్మ రాజ్యలక్ష్మివేపై, "చూశావమ్మాయి, మనం యిన్నాళ్లనుంచీ మనవూళ్లో వున్నా అక్కడి మంచినీళ్ల బావి కొట్టించిం దెవరో మనకి తెలీదు. ఈతనికి యింత చిన్నయీడులో యిన్నివిషయాలు యెట్లా తెలుసో!" కళ్లలో నీళ్లుపెట్టుకొని, "నువ్వు దురదృష్టపు ముండవికాబట్టి యిరవైయేళ్లలోపలే యీవేషం వొచ్చింది కాని ఆఅబ్బాయికూడా యెంత పెద్ద చదువు చదివాడని! ఆపాడుదైవం......" పైటలో ముక్కు చీదింది. బస్సులోనివాళ్లంతా మెచ్చుకోటంతోసే గోపీనాథు జేబులోంచి సిగరెట్టుతీసి వెలిగించాడు.

వొహచిన్నవూళ్లో బస్సు ఆగింది. అక్కడ అర్థ గంట ఆపతుంది. చాలామంది దిగి అక్కడ వున్న చిన్నహోటలులో దూర్చారు. గోపీనాథు కూడా వెళ్లి రెండుకప్పులకాఫీ పట్టుకొవచ్చి బస్సులో కూచున్న రాజ్యలక్ష్మికి యిచ్చాడు. ఆమె వొద్దంది. బలవంత పెట్టాడు. "తీసుకో అమ్మాయి, ఆతను అంత బలవంత పెడుతుంటేనూ." అంది పద్మమ్మ. రాజ్యలక్ష్మి ఆశ్చర్యంగా గోపీనాథుకు కనబడకుండా అంది: "బస్సులో తురకవాళ్లుకూడా వున్నారు. ఆముట్టుడైన కాఫీ యెట్లా తాగను?"

"పరవాలేదులే. యీవొక్కపూటకి. ఇక్కడ మనని యెరిగినవాళ్లెవరూ లేరులే."

రాజ్యలక్ష్మి తీసుకుంది. ఆమెకూడా అతని మనసు చిన్నపుచ్చటం బాగనిపించలేదు.

అక్కడనుంచి బయల్దేరింతరువాత బస్సు జువ్వుమని గాలిలా పరుగెత్తడం ఆరంభించింది. ప్రయాణీకులంతా వుత్సాహంతో దమ్ముబిగబట్టి కూచున్నారు. డ్రైవరు 'చూడు నాప్రతాపం' అన్నట్టు టోపీతీసి ఆ పొడుగాటి వెంట్రుకల్ని గాలికి వొదిలి, సిగరెట్టు పెదిమెలమధ్య యిరికించుకొని, ఆపొగకు కుడికన్ను క్కాస్తమూసి రయ్యిన తోల్తోన్నాడు, సారథ్యంలో రికార్డు బ్రేకుచేసిన మాతలినికూడావొడకొడ్తానన్నట్టు. వొహతడవ రాజ్యలక్ష్మి వెనక్కి తిరిగిచూస్తే ఆమె పైటంతా ఆతీవ్రమైనగాలికి గోపీనాథు వొళ్లో కొట్టుకుంటుంది. చప్పున దాన్ని లాక్కొని ముదుర్కొంది. "ఫరవాలేదులెండీ" అన్నాడు గోపీనాథు.

దాదాపు ఆరుగంటలకి మెలికలుతిరిగిన రోడ్డుకుండా, యెఱ్ఱనినీళ్లతో నిండుగాపారే యెన్నో కాలవల్ని దాటేస్తూ, అప్పుడప్పుడే వూళ్లోకి పోతూన్న పశువుల్ని బెదరగొడ్తూ, బస్సు శివసముద్రం చేరింది.

అతిమనోహరమైన ఆప్రదేశం రాజ్యలక్ష్మికి నోటమాటపెకలకుండా చేసింది. పవరుహౌసుకోసం ప్రత్యేకంగా తీసిన ఆపెద్దకాలవ, దానిమీద మాటిమాటికి చిన్నచిన్నవంతెనలు, కాలవకి రెండువేపులా చక్కనిరోడ్లు, వాటి యిరుప్రక్కల అందమైన పెద్ద చెట్లు, దీపావళినాటిమల్లే వెలుగుతోన్న దీపాలు ఎంతో మనోరంజకంగా తోచాయి ఆమెకి.

కృష్ణారావున్న యిల్లుకూడా చాలా అందమైంది. అది యింత అందంగా వుంటుం దనుకోలేదు రాజ్యలక్ష్మి. వోవరుసీర్లు వుండే యిళ్లు, దాంట్లో ప్రకృతిసౌందర్యానికి విముఖులైన కృష్ణారావువంటి వాళ్ల యిళ్లు యెంత శుభ్రంగా, యెంత అందంగా వుంటాయో ఆమెకి తెలుసు.

## ౨

"రాజ్యం!" కృష్ణారావు పిలిచాడు బైటివసారాలోంచి. కాఫీగ్లాసు కిందపెట్టి రాజ్యం వెళ్లింది.

"వుంకోగ్లాసులో కాఫీ పట్టుకురా ఈయనకి."

కృష్ణారావు టేబిలుముందు కుర్చీలో కూచున్నాడు గోపీనాథు. ఏం అమాయకత్వం! ఎంతవినయం! మాటలైనా వొస్తాయా పాపం అన్నట్టు కూచున్నాడు.

రాజ్యలక్ష్మివేపు కళ్లయినా యెత్తలేదు. కాని కళ్లెత్తకుండానే మాట్లాడు.

రాజ్యం లోపలికి వొచ్చేవరకే. కృష్ణారావు మాటల్ని విన్న పద్మమ్మముఖం చిట్లించింది. "అయిపో యిందని చెప్పకపోయావా మళ్లీ యెవరు చేస్తారిప్పుడు." అంది.

"ఆయనముందు యేలా చెప్ప నమ్మా?"

"ఎవరాయన?"

"నిన్న మనని స్టేషనునుంచి తీసుకురాలేదూ, ఆయన."

చప్పున పద్మమ్మబొమలు ముడివిడాయి. ముఖం చాటంత అయింది. "తీసికెళ్లు, నాకాఫీ తీసి కెళ్లి యివ్వు."

"నీముందుది తీసికెళ్లటం యెం దుకు? నువ్వు తాగెయ్యి వొక్క నిమిషంలో చేసి తీసికెడ్తా."

"ఫరవాలేదు తీసికెడ్తాం."




"ఆముఖం కొత్త సబ్బుతో కడిగి...ఆయనకి అగౌరవం."

బలవంతంగా కాఫీగ్లాసు చేతులో పెట్టి ఆమెని బైటికి తోట్టింది.

కాఫీ టేబిలుమీద పెట్టి వెళ్తోంటే కృష్ణారావు అన్నాడు, "మాడు రాజ్యం, అమ్మని కనుకోక, బ్లష్పుమార్డానికి వెడ్తారేమో. వెళ్లేట్టయితే వెళ్లండి గోక్షినాథ తీసికెడ్తాడు."

రాజ్యం లోపలికెళ్లి కనుక్కుంది. వెడ్దామంది పద్మమ్మ. ఇద్దరూ సిద్ధమయ్యారు. వసారాలోకి ముందు పద్మమ్మ వొచ్చింది. గోక్షినాథ గోడవేపు ముఖ మై నుంచొని అక్కడవున్న రాజ్యంఫోటోని చూస్తో న్నాడు. అప్పుడే గడెవిప్పి తొడుక్కున్న అతని సిల్కుకోటు, కష్టపడితీసిన సన్నపాపిట, నూనెతో శ్రద్ధగా దువ్విన వంద్రుకలు ఆమెదృష్టిని ఆకర్షించా యి. నవ్వుతూ వెనక్కి తిరిగి ఆయనకి వినపడకుండా రాజ్యంతో, "ఆముఖం కొత్త సబ్బుతో కడిగి పట్టె లోనిచీర కట్టుకోకూడదమ్మా? వీళ్లు వోవడుసీరవాళ్లంటే, మనకేం, ఆయనకి అగౌరవం."

రాజ్యానికి యేమీ వుత్సాహంలేదు. ఆహ్నాస యంలో వోహామిగమైన ఆందోళన, భయం — ఆమెకి అర్థంకాని భయం. మనసు యెక్కడోవుంది ఆమెకి తెలీనిచోట. తల్లి కడుక్కుంటే తానూ కడుక్కుంది ముఖం. ఆమె పెట్టెలోంచి సిల్కుచీరని తీసి కట్టు కుంది. రాజ్యానికి తెల్లచీర తీసియిచ్చింది.

వాళ్లు వీథిలో కాలుపెట్టినప్పటినుంచి మళ్లీ గోక్షినాథుది అదేధోరణి. ఆగోడ్డుపక్కయిళ్లలో వుండేదెవరో, వాళ్లక్కడికి వొచ్చి యెన్నాళ్లయిందో, యెక్కడినుంచి వొచ్చారో చెప్పడం ఆరంభించాడు. "తొమ్మిదిగంటలవుతోన్నా యింకా గోడ్లదీపాలు వెలుగుతోన్నాయేం?" అని పద్మమ్మ విచారించడమే తడవు, అక్కడి యెలక్ట్రిక్కుకి కర్చేమీకాని

మొదలుపెట్టి మైసూరుస్టేటుకి యెలక్ట్రిసిటీవల్ల వొచ్చే లాభనష్టాలలెక్కంతా వినిపించాడు. ఎడమవేపుకి అన్నిటికన్నా అందమైన వొహదిన్నయింటిలోకి తోవతీశాడు. "ఇదేనా బ్లబ్బు" అని పద్మమ్మఅడిగితే, "కాదిది మా క్లబ్బు" అన్నాడు. పద్మమ్మ మెట్టు మీదినుంచి కాలు వెనక్కితీసింది. "క్లబ్బులోకి వెళ్లటమే! వొద్దు. ఎవరన్నా చూస్తే యేమంటారు!"

"పరవాలేదండీ, యెవరూలేరు లోపల." అన్నాడు లోపలికి తొంగిచూసి. రాజ్యంవేపు చూసింది పద్మమ్మ. రాజ్యంముఖంలో యేమీ జవాబు దొరకలేదు. నాలుగువేపులా చూసి మెట్లెక్కింది. లోపల యెంతోశుభ్రంగా వుంది. ఆ మెరిసేకుర్చీలూ, బల్లలూ, వాటిమీద అందమైన బొమ్మలపత్రికలూ, యెంతో ఆకర్షణీయంగావున్నాయి. ఆకుర్చీలమీద కూచొని ఆపత్రికల్ని చదువుతాడుగావును గోపీనాథు! "నువ్వు యిక్కడే చదువుతోంటావా?" అని అడిగింది పద్మమ్మ ఆశ్చర్యంగా. "అవునండీ" అని చిరునవ్వుతో జవాబుచెప్పాడు గోపీనాథు యిదేం మహాభాగ్యమా అన్నట్టు. లోపలిగదిలోకి తీసికెళ్లి బిలియర్డ్సు టేబిలు చూపించాడు. ఆటేబిల్ని చూడటం వాళ్లకిదే మొదటితడవు. అంతపెద్దటేబిలు,భరువైంది, దాంట్లోని పచ్చ మహామల్ పద్మమ్మకళ్లని తిప్పేసాయి. మూలకున్న పొడుగాటికఱ్ఱ వొహటి తీసుకొని ఆడేవిధం చూపించాడు. ఆయెఱ్ఱని బంతి నిమ్మళంగా, రాజులాగా దొల్లిపోతోంటే యేమిటో యెట్లాగో అనిపించింది పద్మమ్మకి. తనవేళ్లతో తాకీ తాకనట్టు దాన్ని ముట్టుకుంది. గోపీనాథు దాన్ని తీసి, "చూడండీ. యెంతనున్నగా వుందో," అని రాజ్యంచేతులో పెట్టబోయాడు. రాజ్యం వెనక్కిలాక్కుంది చేతిని. అతను బలవంతంగా ఆమెచేతిని పట్టుకొని బంతిని పెట్టాడు. "చూడమ్మాయి, చూడు; యెంత నున్నగావుందో"అంది పద్మమ్మ. ఆతని బలువైన చేతుల్లో రాజ్యం మృదువైనచెయ్యి వొణికింది. పావురంలా కొట్టుకుంది. ఆతను ఆమె కళ్లల్లోకి చూశాడు. ఆమె ఆబంతిని కిందపడేసింది.

గోడలకివున్న ఫోటోలు చూపించాడు. క్లబ్బువాళ్లంతాకలిసి వివిధసందర్భాల్లో తీయించుకున్నఫోటోలవ్వి. వాటిలో చాలావాటిలో గోపీనాథు వున్నాడు. వొహదాంట్లో యూరోపియను ఆఫీసరు వెనకాలనుంచున్నాడు. ఆఆఫీసర్ని తనవేలుతో చూపిస్తూ గోపీనాథు అన్నాడు, "ఈయన యిక్కడి గొప్పఅధికారి. రెండువేలుజీతం. నాబిలియర్డ్సుఆటనిచాలా మెచ్చుకున్నాడు." పద్మమ్మ ముఖం తేలేసింది. నిర్ఘాంతపోయింది యెంత గొప్పవాడు గోపీనాథుఅన్నట్టు.

బ్లవులో మిషనులన్నీ తిరుగుతోండడంచేత చెవులు గడలుపడేట్టు చప్పుడు. వేరేచప్పుడేమీ వినపడదు. గోపీనాథు రాజ్యంచెవికి దగ్గిరగా మూతిపెట్టి అరిచి చెప్తోన్నాడు ఆమిషనులు నడిచేవిధానం, వాటి కరీదు, వాటిని తయారుచేసిన కంపెనీ మొదలైనవి. అతని జేబులోంచి సెంటువాసన గమ్మని విసిరింది. వొహటిరెండుతడవల ఆతనిపెదిమలు ఆమెచెవికి తగిలాయి. ఆమె అంతగా అసహ్యించుకోకుండడం చూసి ఆతని గదవ ఆమెభుజంమీద ఆనింది వొహసారి.

లోపలంతా చూసి తిరిగి ట్రాలీలో యెక్కటానికి వొచ్చారు. ఎడమవేపుకి తీసికెళ్లాడు. తను ముందు, తనవెనకాల రాజ్యం, ఆవెనక పద్మమ్మ నడుస్తోన్నారు. నేలసమంగావున్న వొహకిటికీముందుగా గోపీనాథు నడిచాడు. రాజ్యం దానిముందుకి వొచ్చేవరకు అతను గిరిక్కున తిరిగి ఆమెని రెండు చేతుల్లో గట్టిగా కౌగలించుకున్నాడు అవసరానికన్నా యెక్కువసేపు. అసలువిషయ మేమిటంటే లోపల మిషనులు తిరగటంవల్ల కలిగిన గాలంతా ఆ కిటికీగుండా జువ్వున బైటికి వొస్తుంది. ఆవిషయంతెలీని కొత్తమనిషి దానిముందుకి వెడ్తే తుఫానులాగా వొకేతడవ వొచ్చేగాలికి వూపిరిబిగపట్టాడు. హ్యాటువుంటే యెగిరిపోతుంది. కాని పడిపోడంమాత్రం సాధారణం కాదు. రాజ్యంకూడా పడకపోయేదే.

తరువాత పద్మమ్మని చెయ్యిపట్టుకొతీసికెళ్లాడు. కిటికీముదుకివెళ్లటంతోటే, పడిపోతా పట్టుకోమని

అరిచింది. అతను ఆమెపడకుండా పట్టుకుంటే ఆమె ఆతన్ని గట్టిగా పట్టుకుంది తన రెండుచేతులా.

భోంచేసేఅప్పుడు కృష్ణారావుతో రాజ్యం తాము చూసిన విశేషాలన్నీ చెప్పింది. క్లబ్బువిషయం చెబ్దాం దేమోనని పద్మమ్మ పచ్చడి పట్టుకోవచ్చి సైగచేసింది. ఆ కిటికీదగ్గిరవిషయం రాజ్యమే చెప్పదలుచుకోలేదు.

## 3

తరువాత రెండురోజులదాకా గోపీనాథు అవుపళ్లేదు. ఆనాడు సాయంత్రం తల్లీబిడ్డలు వాళ్లింటికి దగ్గిరగావున్న పార్కులోకి వెళ్లారు. అక్కడ డోహ కుఱ్ఱాడిని చూసి గోపీనాథు జ్ఞాపకం వొచ్చాడు పద్మమ్మకి. ఎందుకు రావటంలేదో? అక్కడ కూచొని అతని విషయం ఆలోచిస్తోంటే, తమయింటివేపు చూస్తోంటే ఆరోడ్డునుంచి తమ యింటివేపు యెవరో వెళ్లినట్టు అవుపడ్డది. గోపీనాథుమల్లేనే వున్నాడు. చప్పున లేచి, "కడుపు నొస్తోంది, కాస్త దొడ్లోకి వెళ్లి వొస్తా, ఇక్కడే కూచో" అని రాజ్యంతో చెప్పి వెళ్లిపోయింది.

గోపీనాథు తమ యింటివేపు వెళ్లటం రాజ్యం కూడా చూసింది. ఆతన్ని చూసేచూడటంతోటే ఆమె గుండె భయంతో కొట్టుకుంది. ఈరెండురోజుల్నుంచి ఆతడు బ్లఫులో కిటికీదగ్గిర తనిని పట్టుకున్నప్పటినుంచి అతను యెన్నోసార్లు ఆమెకి జ్ఞాపకంవొచ్చాడు. అతను జ్ఞాపకంవొచ్చినప్పుడల్లా ఆమె కంపించిపోయింది. ప్రతితడవా, యీ ప్రపంచపు అవమానాన్ని భరించలేక కుంగిపోతోన్న తనస్నేహితులూ, బంధువులూ ఆమెకళ్లకు కట్టారు. ఆకుంతీదేవి జ్ఞాపకం వొచ్చింది. కాని అది మహాపుణ్యయుగంకాబట్టి కర్ణుడు ఆమెచెవులోంచి పుట్టాడుకాని మరేమీకాదని సమర్థించి ఆమెని పంచమహాపతివ్రతల్లో వొకర్తగా ప్రపంచంముందు నుంచోపెట్టి ఉత్కృష్టమైన క్షమాశక్తినీ, వుదారత్వాన్నీ బ్రహ్మత్వంగా ప్రదర్శించారు ఆశాస్త్రవేత్తలు, ఆవిప్రులు. కాని బ్రహ్మత్వమంతా తద్దినపుకూటిలో (బ్రాహ్మణార్థం) యిమిడిపోయిన యీకలియుగంలో వుదారం యెక్కడ దొరకాలి! ఎట్లాగైనా యీఆపదలోంచి తప్పించుమని దేవుడికి మొక్కింది.

రాజ్యం చప్పున లేచి అందంగాపూసిన పూలమొక్కలకేసి చూస్తో తిరుగుతోంది. నైటుక్వీను చెట్టుదగ్గిర ఆగి దానిపక్కన పూసిన 'డేకీ'ని చూస్తోంటే తనకుదగ్గిరగా యెవరో మెదిలినట్టయింది. తిరిగి చూసింది. కొంచెంగా నవ్వుతో గోపీనాథు నుంచున్నాడు. ఆమె తిరగటంతోటే, "ఏమండీ, బాగున్నారా?" అని అడిగాడు. ఆమెఆవులికిపాటులో మాట రాలేదు. కష్టంమీద "ఆ" అంది. ఇద్దరూ అక్కడినుంచి కదిలారు.

"మొదలు యింటికెళ్లా. అక్కడ మీరెవరూ లేరు. తోటకి వెళ్లారని కుఱ్ఱాడు చెబ్తే యిటొచ్చాను. అమ్మగారేరీ?"

"ఇంటికెళ్లింది. వొస్తుంది యిప్పుడే."

రాజ్యం ఆతన్ని తప్పించుకుందా మనుకుంది. గేటువేపు నడవ ఉద్యుక్తురాలైంది. గోపీనాథు ఆమె తోవకి కాస్త అడ్డంగాజరిగి, "ఏం, అమ్మగారు యిప్పుడే వొస్తారన్నారుగా? అందాకా యిక్కడ కూచుందాం". ఏమీతోచక రాజ్యం ఆగరకమీద వున్న చిన్నబెంచీలో కూచుంది ఆతనికి స్థలంలేకుండా. అతడు కింద గరకమీద ఆమెకాళ్లదగ్గిర కూచున్నాడు. చేతులోని స్పియరుపత్రికని కిందపడేసి ఆమెవేపు చూశాడు. ఆతను తనవేపు అట్లా చూడటం చూసి రాజ్యం పైటసరిచేసుకుంది. ఆఆక్వర్డునెస్‌ని పోగొట్టాలని అంది, "రెండురోజుల్నుంచి అవుపళ్లేదే?"

"ఏం, అవుపడకపోతే?"

పెదిమలు చప్పరిస్తో, "అమ్మ రెండుమూడు తడవల జ్ఞాపకంచేసింది."

"పనిమీద వూరికి వెళ్లి యింతకుముందే వొచ్చాను."

కొన్ని నిముషాలు గడవగా మాట్లాడలేదు. పక్షుల కూతలు. కొంచెం కొంచెంగా వినపడుతోంది పక్షులచప్పుడు పూర్తిగా నిమ్మళించింది. స్త్రీలపైటల్ని వాళ్లకి తెలీకుండా జరిపేసే సన్నని గాలిలో పూల కమ్మదనం హెచ్చింది. దగ్గరగావున్న మనమల్లె చెట్టు నిండుగా పూసి అక్కడ కూచున్న వాళ్లని మరింప జేస్తూ పిచ్చెక్కిస్తోంది. గోపీనాథ్ చుట్టూ చూశాడు. దగ్గరగా ఎవరూ లేరు. తోట్లో కూడా ఎవరూ లేరేమో. జేబు లోంచి ఫౌంటెన్ కలము తీసి ఆపత్రికమీద యేమో రాశాడు. దాన్ని ఆమెకు అందిస్తూ, "చూడండి." అన్నాడు.

రాజ్యం తీసుకుంది. పైపుటమీద అతను రాసిన అక్షరాల కేసి చూసింది.

"ఏమి టలా చూస్తారు? అది నా రాజ్యం. అతను నాకు ప్రసాదిస్తే హాయిగా." చిరునవ్వుతో ఆకర్షణీయంగా అన్నాడు గోపీనాథ్.

రాజ్యం వినిపించుకోక పుటలు తిప్పేస్తోంది. మళ్లీ అన్నాడు గోపీనాథ్ ఒక్క నిమిషంతరువాత, "రాజ్యం, రాజ్యం, ఎంతో ముద్దొస్తున్నావు రాజ్యం?"

ఆమె అతనివేపు చూసింది.

"ఏమంటారు, రాజ్యం చాలాముద్దొస్తోందా? మల్లెమొగ్గలాంటిదేనా?"

మళ్లీ అతనివేపు చూసింది రాజ్యం. ఆమెకు తెలీకుండానే ఆమెరక్తం వేడెక్కింది. ఆపత్రిక పుటలు తిప్పుతో తిప్పుతో మధ్యపుట విప్పింది. దాంట్లోవన్నీ సినిమాబొమ్మలు. నాయికానాయకుల ఆలింగనాలూ అవీను. ఆమెవుద్రేకం ఆగేందికాదు. ఆపత్రికను కిందకు విసిరింది. ఆమెకాళ్ల దగ్గర కూచొని ఆమెముఖంవేపు నిదానించిచూస్తోన్న గోపీనాథ్ ఆమెకి దగ్గరగా జరిగి ఆమెనడుంచుట్టూ చేతులువేశాడు. రెప్పపాటులో ఆమెని తనమీదకి లాక్కొని పూర్తిగా తనచేతుల్లో వశంచేసుకొని ఆచెక్కిళ్లమీద ముద్దులు కురిపిస్తూ, "రాజ్యం, నారాజ్యం" అన్నాడు వుద్రేకంగా. రాజ్యం వద్దువద్దుఅంటోంది కాని యిమిడి పోయింది. చేతులు అతనిపిలుపు వదలడానికి అను



"ఆమెకాళ్ల దగ్గర కూచుని ఆమెముఖంవేపు నిదానించిచూస్తోన్న......"

కున్నాయి. అతనిముద్దులమాధుర్య అతని వుద్రేకం హెచ్చటం కనుక్కొని చప్పున అతనిబిగువును వో లించుకొని దూరంజరిగి, "వద్దు. నాకు భయముగా వుంది."

"భయమెందుకు, ఎవరున్నారని యిక్కడెవరు?"

"ఎవరూ చూస్తారని కాదు."

"మరి?"

మరి చెప్పలేకపోయింది. ఆడవాళ్లకి సహజమైన లజ్జాభిమానం మాట్లాడనివ్వలేదామెని. మళ్లీ గోపీనాథ్ ఆమెని బలవంతంగా తన బాహుబంధంలోకి లాక్కున్నాడు. అతనికి లొంగిపోకూడదని ప్రయత్ని స్తోన్న ఆమెమనసుని ఆమెలోని మనుష్యసామాన్యమైన అసహాయత్వం ఓడించింది. గెలవనిచ్చిందికాదు. ప్రథమ యవ్వనంలోవున్న అతని వుద్రేకమైనముద్దులు, కట్టెబొమ్మని సైతం స్పందింపజేసే ఆలింగనం అనుభవం లేని రాజ్యాన్ని పరవశురాలిని చేశాయి. ఆమె శరీరం

ఆమెఆధీనంతప్పింది. ఆమెకి తెలీకుండానే అతనికి లొంగిపోయింది. గ్రహించుకుంది.

రోడ్డులోని దీపంవెలుగు ఆతోట కాంపౌండు సీకులకి అల్లుకొనిపెరిగిన తీగలసందులోంచి గరకమీద తునకతునకలుగా పడుతోంది. వోహాతునక అక్కడ పడివున్న స్వియరుపత్రికమీద పడ్డది. బైట రోడ్డుమీద నడ్తోన్న వోహాయన్ని దూరంనుంచి యెవరో యెన్ని కొట్టారని అడిగారు కన్నడంలో. "ఎంటు గంటె." (ఎనిమిదిగంటలు) అన్నాడాతను.

రాజ్యం లేచింది చప్పున. గోపీనాథు కూడా లేచాడు. గేటుదగ్గిరకి వెళ్లారు. రాజ్యం గోపీనాథు వేపు చూడనైతం చూడకుండా ముఖం కిందికి వాల్చుకొని సరాసరి యింటివేపు నడిచివెళ్లింది.

రాజ్యం యింటికి వెళ్లేవరకు కృష్ణారావు క్లబ్బునుంచి రాలేదు. పద్మమ్మ వంటచేస్తోంది. రాజ్యం అడుగులచప్పుడు వినబడటంతోటే గిరుక్కున వెనక్కి తిరిగిచూసింది. "ఇంతసే పేంచేశావు రాజ్యం?" అని అడిగింది.

"నువ్వొస్తావని యెదిరిచూస్తో గరకమీద పడుకుంటే నిద్రపట్టిం దాలాగే. నువ్వురాలే దెందుకమ్మా?"

పద్మ కాస్త వెలవెలబోయింది. కాని అప్పటి స్థితిలో రాజ్యానికి అవేవీ అవుపళ్లేదు.

"గోపీనాథు వొచ్చాడా తోట్లోకి?"

"రాలేదే."

"మనకుఱ్ఱాడితో చెప్పాడట తోట్లోకి వెడ్తానని."

"ఏమో. నాకుమాత్రం అగుపళ్లేదు."

..

గోపీనాథు, అతన్ని యెంతో గారవ్వంగా చూసే మేనమామ హైదరాబాదలో చచ్చేస్థితిలో వున్నాడని టెలిగ్రాంవొస్తే వెళ్లాడు. నెలరోజు లుండి ఆయన అంత్యక్రియలన్నీ ఆసాంతం కానిచ్చి తిరిగి వొచ్చాడు.

వొచ్చి అన్నంతినడమే తడవు కృష్ణారావుగారి యింటికి వొచ్చాడు. పద్మమ్మ అప్పుడే భోంచేసి వసారాలో యెంగిలిపాలువుకి కూచుంది. గోపీనాథుని చూడటంతోటే పట్టలేని ఆనందంతో ముందుకి వొచ్చింది కొగలించుకుంటుందేమో అన్నట్టు. కాని ఆమె పుణ్యం. రాజ్యం యెక్కడ అని అడిగాడు. 'జ్వరంతగుల్కింది వారంరోజుల్నుంచి. గదిలో పడుకుం' దని చెప్పింది. లోపలి కెళ్లారు. మంచంమీద బ్లాంకెటు కప్పుకొని పడుకుంది. పద్మమ్మదగ్గిర కెళ్లి, "అమ్మాయీ, గోపీనాథు వొచ్చాడు." అంది. చప్పున ముఖంమీది కప్పు తీసింది రాజ్యం. గోపీనాథు హృదయం కొట్టుకుంది. ఎంత చిక్కిపోయింది వారంరోజులకే! రాజ్యంకళ్లల్లో నీళ్లు నిండాయి. చప్పున ముఖంమీది బ్లాంకెటుతో తుడుచుకుంది. గోపీనాథుపద్మమ్మవేపై, "యీవారం రోజుల జ్వరానికే క్షయరోగిలా అయిందేమిటండీ?" అని అడిగాడు దిగులుగా. "అసలు నువ్వువెళ్లినప్పటినుంచే ఎండిపోవడం ఆరంభించింది. అన్నంపోదు. ఏదీ రుచించదు నోటికి. ప్రతిదీ అసహ్యించుకుంటుంది. ఎప్పుడూ దిగులుగా వుంటుంది. మా కేమీ తోచలేదు. డాక్టరు పరీక్షించాడుకాని యేమీచెప్పలేదు. వారంరోజుల్నుంచి రోజూ మధ్యాహ్నం జ్వరం. నిన్న సోదిఅడిగా తొక్కుడుదాటుడేదో అయివుండాలని. నేననుకున్నట్టే తేలింది. అదేదో రేపుగురువారంనాడు చేసిచూడాలి."

పోస్టువాడొచ్చాడు. పద్మమ్మ వెళ్లింది. గోపీనాథు రాజ్యంవేపు చూశాడు. మంచంమీద కుచోమంది. చేతితో లాక్కుంది. ఆతని ముఖాన్ని తనముఖానికి దగ్గిరగా పట్టుకొని, "కొండకెదిరిచూసినట్టు చూస్తోన్నా నీరాకకోసం. నీతో మాట్లాడాల్సి వుంది." మిక్కిలికష్టంగా, "భయపడ్డదే ముందుకొచ్చింది," అని ముగించింది. నీళ్లు ప్రవాహంలా దూకాయి కళ్లలోంచి. పద్మమ్మఅడుగులచప్పుడు వినపడ్డది. గోపీనాథులేచి ఆవేపు వెళ్లాడు. వాళ్లిద్దరూ వసారాలోకి వెళ్లారు.

రాజ్యంవిషయం గోపీనాథుకేమీ అర్థంకాలేదు. ఆరోజంతా అదేవిషయం ఆలోచించాడు. సాయంత్రం మళ్లీ వాళ్లింటికెళ్లాడు. వాళ్లు కాఫీతాగుతూ కూచున్నారు. ఈతను వెళ్లటంతోటే దాంట్లోంచి వుంకో గ్లాసుకాఫీ సగపెట్టారు ఆతను వొద్దంటేకూడ. కాఫీతాగినంతసేపూ ఆలోచించాడు గోపీనాథు పద్మమ్మలేకుండా రాజ్యంతో మాట్లాట్టం యెట్లాగని. ఏమీ తోచలేదు. రాజ్యం అంది, "విసుగొస్తోందమ్మా వూరికే యింట్లోకూచోని. అలా నదివేపు కొస్తవెళ్తే బాగుంటుంది."

గోపీనాథుకి వోకఆలోచన స్ఫురించింది. అన్నాడు, "అవును మెల్లిగా అలావెళ్లండి. ఆనదివేపు గాలికూడా శుభ్రంగా వీస్తుంది."

"ఏం, నీకేమైనా పనుందా?" పద్మమ్మ విచారించింది.

"పనేం అట్టేలేదు కాని, రెండురాత్రుల్నుంచి బొత్తిగా నిద్రలేకపోవడంచేత కులాసాగాలేదు. మీరుకూడా వుండండేం, హైదరాబాదు విషయాలుచెబ్తాను. ఆమెని కుర్రాడితో వెళ్లనివ్వండి."

దిగులుగా చూస్తోన్న రాజ్యానికి సైగచేశాడు పద్మమ్మచూడకుండా.

"అవును. కుర్రాడివెంబడి వెళ్లిరా అమ్మాయి."

రాజ్యం లేచి మెల్లిగా కుర్రాడితో వెళ్లింది.

"ఎన్నాళ్లయింది గోపీనాథూ నువ్వు హైదరాబాదువెళ్లి?"

"దాదాపు నెలకిపైగా అయివుంటుంది."

"ముప్పైరోజులు కదూ!" రెండు రెట్టలూ పైకెత్తి సిగ సవరించింది తనవక్షపు పొంకం ఆతని దృష్టికి ఆనాలన్నట్టు.

గోపీనాథు లేచాడు. "మరిచాను. ఇప్పుడే వొస్తాను. వొక్కనిమిషం."

"ఏమిటాపని?"

"కూర్చోండి. ఇప్పుడే వొస్తాను." గేటుబైటినుంచి చెప్పి తమయింటివేపు పరుగెత్తుకెళ్లాడు.

గోపీనాథు వుంకోదారిని వెళ్లేవరకు రాజ్యం, ఆకుర్రాడు అట్టేదూరం వెళ్లలేదు. రాజ్యం మాటిమాటికి వెనక్కి తిరిగిచూస్తో మెల్లిగా నడుస్తోంది. గోపీనాథు అగుపడటంతోటే ఆగిపోయింది. నుంచోలేక దగ్గిరగావున్న వోకరాతిమీద కూలబడ్డది. అతను దగ్గిరకిరావటంతోటే ఆతనివొళ్లో పడి భోరుమని యేడ్వటం ఆరంభించింది. అతడు ఆకుర్రాడిని దగ్గిరకి పిలిచి జేబులోంచి కొన్నిడబ్బులు తీసియిచ్చి, యింటికి వొస్తే కొడతిస్తానన్నాడు. ఇంకా యేమేమోఅన్నాడు కన్నడంలో. ఆవుని తోలుకోరమ్మని పంపాడాతన్ని.

"ఏమిటిరాజ్యం, యెందుకీయేడ్వటం?"

ఆమె ఆతనివక్షంలో తలదాచుకొని అతని హృదయానికే తెలియాలన్నట్టు "మంచిమందేమైనా తెలుసా నీకు, నమ్మకమైంది?"

"ఇంతమాత్రానికి యేడ్వటమెందుకు రాజ్యం? ఈమలేరీయాజ్వరానికి యింతదిగులా?"

"జ్వరంకోసం కాదు." మళ్లీ వెక్కివెక్కి యేడ్వటం ఆరంభించింది. ఏడుస్తోనే వొక్కొక్కమాట అంది, "మొదట్నుంచీ నాకిదే భయం, అందుకనే మొత్తుకున్నా. మొగాళ్లంటేనే అమితమైనభయం నాకు. వాళ్లనీడ వాల్తేకూడా యేమవుతుందోనని అనుమానం." తల పైకెత్తి ఆతనిముఖంవేపు చూసింది. ఇంకా ఆతనికి తెలిసినట్టులేదు. ఆతనివేపు చూస్తో యెడమచేత్తో కడుపుమీద కొట్టుకొని మెడకి వేలాడబడి భోరుమన్నది.

గోపీనాథు కొయ్యబారిపోయాడు. అప్పుడాతనికి అర్థమైంది. పిడుగు మీదపడ్డట్టు అయింది. గుడ్లు తెరిచాడు.

అయిదు నిమిషాలదాకా యెవరికీ వొళ్లు తెలీలేదు. చివరకి రాజ్యం అంది "ఇన్ని యింగ్లీషుపుస్త

కాలు! చదువుతావు, వాటిలో లేదూ యేదైనా గట్టి మందు?"

"ఇట్లాంటివి వాటిలో వుండవు రాజ్యం. ప్రభుత్వం అనుమతించదు."

"ఎవరైనా మంచి డాక్టరు తెలుసా పోనీ, కనికరం కలవాడు, నమ్మదగినవాడు?"

"ఇక్కడ వున్నదల్లా వొహ డాక్టరే. ఆయన పూర్వాచారపరాయణుడు."

నిరాశతో యేడ్చే గొంతుకతో, "స్నేహితులెవరైనా?"

అతను మాట్లాడకుండా ఆమెని దగ్గిరకి తీసుకున్నాడు. ఆ నెత్తిని భుజంమీద ఆనించుకొని వోదార్చాడు. అతనికళ్లలోంచికూడా నీటిచుక్కలు రాలాయి. ఆమెచెవికి దగ్గరగా ముఖంపెట్టి, "భయపడకు రాజ్యం. ఎక్కడికైనా లేచిపోదాం. స్వాతంత్ర్యంగా, నిర్భయంగా బతుకుదాం."

"ఎందుకు? అక్కడమాత్రం అపవాద తప్పుతుందా? ఏమారుమూలకి వెళ్లినా, యేకారుచీకట్లో దాగినా వెతికిపట్టి వేలుచూపుతుంది ప్రపంచం. నాన్న అమ్మని బంధువుల్ని బతికుండగానే చంపుకుని నా అనేవాళ్లు లేక యేంసుఖం? వొద్దన్నా. వొద్దని మొత్తుకున్నా." మళ్లీ అతనిమెడకి పడియేడ్చింది.

పదినిమిషాలదాకా యెవరూ మాట్లాడ్లేదు. చీకటిపడ్డది. రాజ్యం యేడ్పుమానింది. ధైర్యంగా నిశ్చయంతో లేచింది.

"చీకటిపడ్డది వెడ్దాంపద."

గోపీనాథుకూడా లేచాడు, "మరి యేంనిశ్చయించావు రాజ్యం?"

"భయంలేదులే. ఏమీకాదు."

ఆశ్చర్యంగా ఆమెముఖానికేసి చూశాడు. రాజ్యం చిరునవ్వుతో అతనిచెంపల్ని పట్టుకొని పెదిమల్ని ముద్దుపెట్టుకుంది. "ఏమి టట్లాచూస్తావు? భయపడకు. నాది వొట్టిభయం."

"అమ్మతో చెప్పకూడదు?"

"చూద్దాంలే."

భోజనా లయింతరువాత యేమైనాకాని పద్మమ్మతో చెప్పాలనుకుంది రాజ్యం. కాని ఆమె కృష్ణారావుతో మాట్లాడుతో కూచుంది. ఎంతో రాత్రిదాకా కాచుకోవుంది వీలు చిక్కుతుందేమో నని. రాజ్యం నిద్రపోయిందనుకొని వాళ్లిద్దరూ తమగదిలోకి వెళ్లి తలుపేసుకున్నారు.

హాల్లోని గడియారం కొట్టినప్పుడల్లా గంటలు లెక్కపెట్టింది రాజ్యం. మెల్లగా మంచంలోంచి లేచి కిటికీదగ్గిర కెళ్లింది. కిటికీ అద్దంలోంచి బైట వెన్నెల పిండారబోసినట్టు అగుపడ్డది. తలుపు కాస్త తెరిసింది. చల్లనిగాలి లోపలికి విసిరింది. మంచంమీది బ్లాంకెటుని ముసుగుపెట్టుకొని బైటికివెళ్లి చప్పుడుకాకుండా తలుపు మూసింది మళ్లీ.

ఎంతసేపు నడిచినా దారి తరగదు. ఆ వొక్క ఫర్లాంగుదూరమే యెన్నోమైళ్లలా గనిపించింది. ఆ జలపాతానికి యెదురుగా హాయిగా కూచొని పాతాన్ని నిమ్మళంగా చూట్టానికి వేసిన అరుగుమీద అలిసిపోయి కూలబడ్డది రాజ్యం. ఆ యెత్తుమీదనుంచి గంభీరంగా దూకే ప్రవాహంవేపు చూసింది. అది ప్రపంచంలో వుండికూడా ప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్టు దూకుతోంది తెల్లని వెన్నెల్లో. అది యెంతకాలంనుంచి అట్లా ప్రవహిస్తోందో, యింకా యెంతకాలం ప్రవహిస్తుందో! ఎందరు యెన్నిభావాల్తో దాని దగ్గిరకి వొచ్చారో! ఆమహాప్రవాహాన్ని యెంద రెన్ని విధాల భావించారో!

రాజ్యం చప్పునలేచి కిందికి ప్రవాహందగ్గిరకి పరుగెత్తింది. అంతయెత్తుపైనుంచి ప్రవాహం దూకటంచేత పొగలాగా పైకిలేస్తోన్న ఆతుంపురులోకి బ్లాంకెటు విసిరింది. అది వొక్కసారి గిరుక తిరిగి మాయమైంది. ఎంతచూసినా అవుపడ్లేదు.

రాజ్యం ఆహూకుడుకు దగ్గరగావున్న సంతు పిరాకు యెక్కింది. క్షణంపాటు మాయమైనతావును నిదానించిచూసింది. చెయ్యిపెడితే యీడ్చుకోపోయే అంతవల్లని కావేరీప్రవాహంలో తన పచ్చని నిండు ప్రాణాన్ని విసిరింది. ఒక్కనిమిషంలో రాజ్యం అదృశ్యమైంది. ఆమెవునికి ప్రపంచంలో స్వప్న మైంది. అయినా తనేమీ యెరుగనట్టు శాంతంగా అనాయాసంగా ప్రవహిస్తోనేవుంది కావేరి.

తెల్లారి రాజ్యంకోసం వూరంతా వెతికారు. కృష్ణారావుయింటిపక్కనే వుండే అకౌంటెంటు యొక్క ఫ్రెండ్ ఇస్మాయిల్ రెండువేలరొక్కంతో పలాయనమైనాడని రిపోర్టువచ్చింది. అతనే రాజ్యాన్ని కూడా లేవతీసుకొని హైదరాబాదు వెళ్లిపోయినాడని పుకారు.

---



సింహాచలము దేవాలయము, లోవైపు K. S.

# నిరుద్యోగనివారణ

మొక్కపాటి నరసింహశాస్త్రి

౧

హాలికులైననేమి గహనాంతరసీమల కందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.

—బమ్మెరపోతన

పుట్టినది పల్లెటూరైనా పెరిగినదీ, నేటివరకు కాలక్షేపం చేస్తున్నదీ పట్టణములో. కాపురము చేతనో ఏమోకాని గ్రామ జీవనమన్నా, వ్యవసాయమన్నా (ఇతరులు చేస్తుంటే) నాకు చాలా అభిమానము. అంతులేని ఆశలూ, అనేకములైన అభిరుచులూ నా భగ్నజీవనమునకు మూలకందములు. ఏది ఎలా ఉన్నా తరుచు దృష్టి వ్యవసాయము మీదకే పోతూఉంటుంది. ఎప్పుడూ దాన్ని గురించి ఆలోచిస్తూ ఉండడము, తత్సంబంధములైన గ్రంథములేమైనా అప్రయత్నంగా లభించినప్పుడు చదువుతూ ఉండడము, వ్యవసాయ విద్య నభ్యసించి వ్యవసాయములోకి దిగిన మిత్రులెవరేనా ఉంటే వారితో మాట్లాడుతూ ఉండడము, వారు కోరినా కోరకపోయినా, అవసరమున్నా లేకపోయినా వారికి సలహాలిస్తూఉండడమూ అలవాటయిపోయింది నాకు. అందుచేతను, 'ఏజన్సీలో వ్యవసాయము ప్రారంభించాను. ఒక్కసారి ఎలాగైనా వచ్చి చూచి వెళ్లు' మని మా మిత్రులు నూతక్కి రామశేషయ్యగారు వ్రాసినజాబు చూచుకొని, సంతోషము పట్టలేక ఇంత మనిషినీ ఎగిరి గంతులు వేసినానంటే నమ్మండి. వెంటనే ముందూ వెనకా ఆలోచించకుండా, మంచి రోజైనా చూచుకోకుండా, మన్యపుజ్వరం మనలో ముఖ్యంగా ఉన్నదన్న సంగతికూడా మరచిపోయి, వెంటనే బయలుదేరినాను.



నూతక్కి రామశేషయ్యగారు,
జయపురము అసిస్టెంటుదివాను.

రాత్రికి నా స్టేషను చేరి, ఆరాత్రి అక్కడనే కాలక్షేపముచేసి మరునాటిఉదయము ఆరున్నరకు రాయపూరు రైలులో కూర్చున్నాను. రైలు బయలుదేరింది. కొన్ని గంటలలో పుసకా బోయే మిత్రసందర్శనము, వారిమాటలు, చేష్టలూ అన్నీ మనసుకువచ్చాయి. చల్లనిచిరుగాలి ముఖానికి కొడుతూ ఉన్నది. నా పెట్టెలో కూర్చున్న ఆ శేషజనమూ ఒక్కసారి చుట్టలు ముట్టించారు. ఆపొగలో ఊపిరి ఆడడము లేదు. అయినా, ఒకపక్కను దైర్యమును కొలిచేకొండలూ ఒకపక్కను పచ్చనిచేలూ, పండి బంగారువన్నెను వరిచేలు, రాగి గుత్తులతో నిండిన జొన్నచేలు, మధ్య మధ్య తోటలు కన్నులపండువుగా కనపడుతుంటే, నా జన్మకాలములో ఎప్పుడూ లేని ఒక వింత ఆనందము కలిగింది. నాకు ఊపిరి ఆడకుండాచేస్తున్న చుట్టపొగ, చెవులు చిల్లులుపడేటట్లు వినపడే గ్రామ్యసంభాషణలు మధ్యమధ్యా వచ్చే స్టేషనులూ, అక్కడి హడావిడీలూ అన్నీ మరచిపోయి ఈ లోకముసంగతే విడిచి, భావనాప్రపంచములోపడ్డాను. నా కష్టజీవితములో అదొక్కటే నాకున్న సౌఖ్యము,

నా కవసరమైనప్పుడు, ప్రస్తుతమును పూర్తిగా మరచి, నాచిత్తమువచ్చిన సౌగములను నిర్మించుకోగలశక్తి పరమేశ్వరుడు ప్రసాదించాడు. ప్రతికష్టానికి ఒక్కొక్క సుఖము ఉండకపోదుకదా !

సుమారు నాలుగుగంటలసేపు సమాధిలోఉన్నట్లు కూర్చున్నాను. ఎక్కడెక్కడ రైలు ఆగిందో, నా పెట్టెలోకి ఎవరువచ్చారో, ఎవరు వెళ్లారో నాకు తెలియదు. 'బాబూ, తమరు పార్వతీపురమేనా, ఇంకా పైకి వెళతారా బాబూ' అని నాప్రక్కనున్న పెద్దమనిషి పలకరించేసరికి, ఉలిక్కిపడి, స్వర్గంనుంచి మళ్లీ భూమికి దిగాను. వచ్చేస్టేషనే పార్వతీపురమని తెలుసుకుని, మూటా ముల్లీ సర్దుకొని, తయారయేలోపున పార్వతీపురం చేరింది రైలు.

## నూతక్కి రామశేషయ్య

మామిత్రులు నాకు పార్వతీపురంలోనే స్వాగతమిచ్చారు. ఇప్పటికి పదిసంవత్సరములపైన అయినదనుకుంటాను, వారితో మొదటిసారి పరిచయముకలిగి. ఆయన అప్పుడు B. L. చదువుతూఉండేవారు. సాహితీ సమితిసభ్యత్వము మాపరిచయానికి కారణం. తెనాలి స్టేషనులో అనుకుంటాను, సన్నంగా, పొడుగ్గా, స్వచ్ఛంగా, కోలమొగముతో, పొడుగుముక్కుతో, మధ్యపాపిడితో, జగన్నాటకాన్ని, మానవస్వభావాన్ని గ్రహించినట్లు, నవ్వులొలుకుతున్న విశాలనేత్రములతో చేతులో Oscar wilde నాటకం పుచ్చుకునివస్తున్న చిన్నవానిని చూపించి, 'ఆయనేనండి గీతానందు'డని శివశంకరశాస్త్రిగారు చూపించారు. మాటలోనే ఆయన మాదగ్గరకు వచ్చాడు. శాస్త్రిగారు నాకూ రామశేషయ్యగారికీ పరిచయము కలుగచేశారు.

ఆయన B. L. ప్యాసయి కొన్నాళ్లు గుంటూరులోను, కొన్నాళ్లు బెజవాడలోనూ న్యాయవాదిగా ఉండి, జయపురము మహారాజావారి అసిస్టెంటు దివానుగా ప్రవేశించి ప్రస్తుతము గునుపూరులో ఆఉద్యోగములో ఉన్నారు. కవి, రసికుడు, వివిధవిజ్ఞానవిదుడు, ఉదారుడు, ఆస్తికుడు, మావలెనే స్వప్నవీథులలో సంచరించువాడు. కాని, మావలెకాక, స్వప్నములు రాత్రులేకాని పగలు శ్రేయోదాయకములుకావని మొదటనే తెలుసుకొని, భావిసౌఖ్యమునకు వర్తమానకృషి అత్యవసరమను పునాదియని నిశ్చయించుకుని, తదనుగుణముగ తనజీవితమును దిద్దుకున్న ధీశాలి.

కమ్మకులజులు. తండ్రితాతలు, సోదరులు వ్యవసాయదారులు. ఇంగ్లీషువిద్యలో పట్టభద్రులై పెద్ద ఉద్యోగముచేస్తున్నా, వ్యవసాయముమీద అభిమానము వదలలేదు. ఉద్యోగములో ఉన్నా, రాజకీయములో ఉన్నా, మనస్సునకు నిజమైనసంతోషము, జీవితములో ప్రశాంతీ ఉండవలెనంటే ఎప్పటికైనా వ్యవసాయమే శరణ్యమని నిశ్చయించుకొని, కొంతభూమి సంపాదించి ఉద్యోగముతోపాటు వ్యవసాయము సాగించవలెనని నిశ్చయించుకున్నారు.

డెల్టాభూములు కొనడమంటే, ఈధరమందము రోజులలోకూడా సాధారణ సంసారులకు సాధ్యమైన పనికాదు. ఒకవేళ ఏతంటాలో పడి, ఏపదిఎకరాలో కొనుక్కున్నా అక్కడిపంటలవల్ల మిగిలేది ఏమీ కనుపించదు. అందుకని ఆఆశ వదలుకుని, ఏజన్సీలోనే, ఏదో విశాలమైన ఖండము సంపాదిస్తే లాభంగా ఉంటుందని ఊహించి, బంధువులను, కొందరు స్నేహితులను సలహాఅడిగారు. 'రామరామ! ఏజన్సీలో వ్యవసాయమేమిటయ్యా! ఎవడేనా నవ్విపోయేడు. ఆఅడవులలోనూ జ్వరాలలోనూ పడి ఎవడు వ్యవసాయము చేస్తా'డన్నారు కొందరు. 'నాయనా, పిల్లలుకలవాడవు. వాళ్లకు చదువులని, కార్యాలని బోలెడంత ఖర్చుంది ముందు. ఈకరువురోజుల్లో ఏదో ఉద్యోగమంటూ దొరికింది నీ అదృష్టంవల్ల. కష్టపడి నాలుగు రాళ్లు మిగుల్చుకుని అప్పూసప్పూ ఉంటే తీర్చుకుని, మిగిలింది ఏబ్యాంకిలోనో వేసుకోవడమో, లేక నమ్మకమైనచోట, బంగారంలాంటి భూమి ఏదైనా తణఖా పుచ్చుకుని వడ్డీకి వేసుకో. ఇప్పటికేనా ఈ పిచ్చి వేషాలు కట్టిపెట్టు. నీమంచి కోరి చెపుతున్నా'మని కొందరు మందలించారు. ఒకరిద్దరుమట్టుకు 'చాలా

యము చేదామని సంకల్పించుకొన్నారు. ఉభయులూ కూడా సంకల్ప సిద్ధులు. ఇదివరకున్న మూడు వందల ఎకరములకు తోడు, మరొక రెండు వందల ఎకరములుకూడా కొన్నారు. ఇంతవరకూ బాగున్నది కాని మళ్లీ చిక్కువచ్చింది. రామబ్రహ్మం గారు, సబ్బం సేటు పెట్టినారు, కాని బహువ్యాపకులు: ఆయనవ్యాపారములన్నీ కట్టిపెట్టి ఇక్కడ కూర్చోడానికి ఆయనకూ వీలుకలగదు. అందుచేతను ఇక్కడ ఎవరు ఉండి పనిచేయిస్తారా అని మళ్లీ యోచించవలసి వచ్చింది. రామశేషయ్యగారు, వ్యవసాయమునం దనుభవశాలులైన కొందరిని పిలిచి, 'ఇక్కడ ఉండి ఈభూములు బాగుచేస్తే వారికి కొంతవాటా ఇస్తా' నని చెప్పినారు. వారు సరేనని, ముందు ఒకరువచ్చి ప్రవేశించారు. వచ్చిన నెలరోజులకు జ్వరంవచ్చింది. 'బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు' అన్నారు-



అన్నె సీతారామయ్యగారు



కూర్చున్నవారు సీతారామయ్యగారు
నిలబడ్డవారు బెహరాలు, మేస్త్రీలు

నీ వ్యవసాయమూవద్దు, మాకు అందులో నాటూనూ వద్దు. మీరూ మీ పెద్దలూ ఒక్కనమస్కారం' అని ఇంటికి దారిపట్టారు. మరొకరొచ్చారు. వారూ ఇలాగే చేశారు. ఇలా ఒకరివనుక ఒకరు పదిహేనుగురువచ్చి ఉండలేక వెళ్లిపోయారు. కాలయాపనా, వారికి రైలుఖర్చులే కాని పనేమీ జరుగలేదు. మళ్లీ యథాప్రకారస్థితికి వచ్చింది కథ. ప్రారబ్ధార్థముల నుజ్జగించి ధీరులు విఘ్నములను గణనసేయక తమ కార్యములను సాధిస్తారని భర్తృహరి చెప్పినట్లు రామశేషయ్యగారు అధైర్యపడి తమప్రయత్నము లింతటితో విరమించకుండా వారొక పెద్దమనిషిని తీసుకువచ్చారు.

అన్నె సీతారామయ్య ౨౨ సంవత్సరముల యువకుడు. Intermediate తో ఇంగ్లీషుచదువుకు సలాంకొట్టి ఉద్యోగముకోసం మూడుసంవత్సరాలు అక్కడా ఇక్కడా తిరిగి, చదువుకైనంత ఖర్చు దానికికూడా తగలేసి ఏమిచెయ్యడానికీ



కంబారీలు, అనగా పనిచేయు పాలెకాపులు

న్నారు. 'హేమాహేమీలులాంటి వాళ్లు పదిహేడుసరు ఉండలేని చోట నువ్వుండి నిగ్రహించుక రాగలవా' అన్నారు. 'ఏమైనాసరే నే వెళ్లక మాన' నని పట్టుపట్టి వచ్చి ప్రవేశించి సంవత్సరంలో మహారణ్యాన్ని నందనవనంగా మార్చాడు.

ఇత నక్కడ నిలబడి ఉంటాడని ఎవ్వరూ నమ్మలేదు. మహా ఉంటే నెలరోజులుకంటె ఉండలే డనుకున్నారు. అప్పటికీ రాకపోయేసరికి హేళన ఆరంభించారు. రామశేషయ్య డబ్బూ, సీతారామయ్యవ్యవసాయమూనా! రెంటికీ సరిపోయింది. ఖర్మం జాలక నాలుగుడబ్బులు వస్తే, వీళ్లనూ వీళ్ల స్నేహితులనూ కాఫీ ఖర్చుకేనా చాలవన్నారు కొందరు. ఎవరు ఏమన్నా సీతారామయ్యమట్టుకు పట్టినపట్టు విడవకుండా యుద్ధభూమిలో యోధులానిలబడి గారడీవానిలాపనిచేశాడు.

తోచక నిస్పృహచెంది కూర్చున్నాడు. రామశేషయ్య గారికి మేనల్లుడు. బ్రహ్మచారి. అతన్ని పిలిచి రామశేషయ్యగారు తన యావచ్ఛక్తీ వినియోగించి, ఉపదేశించి ఇక్కడకు పంపారు. కానైతే అతని కంత ఉపదేశమే అవసరము లేదు. 'సయి' అంటే ఉరకడానికి సిద్ధంగా ఉన్నాడు. అతని తలిదండ్రులు, పెద్ద మేనమామలు, ఇతరబంధువులు అంతా ఇతన్ని వెళ్లద్ద

౨

మేము పార్వతీపురంనుంచి బయలుదేరి రాయగడ వచ్చాము. అక్కడ గున్నవ సుబ్బారావుగారు B. Sc., బొబ్బిలి పంచదార ఫేక్టరి మేనేజరుగారు అయిదారు వందల ఎకరములు సంపాదించి వారూ ఫారము పెట్టే ప్రయత్నంలో ఉన్నారు. అదింకా సరియైన దారిలోకి రాలేదు. కాని మీదటికి పనంతా పూర్తికావచ్చు. అప్పుడు దానిసంగతిమనవిచేస్తాను.



ఉల్లి చేను

అక్కడ వారి ఆతిథ్యమును పొంది, రామశేషయ్యగారికోసము వేచిఉన్న శ్రీ కోటగిరి వెంకట్రావుగారిని కలుసుకుని ముందుకు సాగినాము. బిసంకటకములో తోటవెయ్యడానికి కడియము (గోదావరిజిల్లా)లో ఉన్న రావు

చిన్నారావు అంత సన్నవారిని కొన్ని బత్తాయిలు, మామిళ్లు, సపోటాలు వగైరా మొక్కలు పంపమని వ్రాశారు రామశేషయ్య గారు. ఇక్కడి భూములపరిస్థితు లేమిటి, ఏయేతోటలకు అను కూలముగా ఉంటవో చూచి, వీరికి సలహా ఇవ్వడానికి వచ్చారు శ్రీ వెంకట్రావుగారు. రాయగడలో మధ్యాహ్నము రెండుగంటలకు రైలు ఎక్కాము.



రామశేషయ్యగారి ఇంటిముందు పూలతోట

నేను ఏజన్సీకి వెళ్ళడ మిదే మొదటిసారి. రైలుకు రెండుప్రక్కలా కనుపించిన దృశ్యము, నాలో అణగియున్న ప్రకృతిపై ప్రేమను, సౌందర్యపిపాసను ఆవాహనచేసి పైకిలాగినది. అవ్యక్తమైన ఆనందము కలిగింది. పరమేశ్వరి సాక్షాత్కరించినట్లు తోచింది. ఆ పర్వతములు, ఆ అరణ్యములు, ఎక్కడచూచినా ఆ సెలయేళ్లు, అన్నిరకముల పచ్చరంగులు, చైత్రమాసపుటుషా కాంతులను నల్లకాలపు సంధ్యాకాంతులను సిగ్గుపుచ్చ గలిగిన లేతచిగురాకురంగులు, రంగురంగుల పుష్పములు, ఈ సౌందర్యసృష్టిని చీల్చుకొని నెమ్మదిగా ప్రాకులాడుచున్న మా రైలు. సీతారామలక్ష్మణులు విహరించిన పుణ్యారణ్యము లివేననీ, కాళిదాసుని యక్షుడు ఇచ్చటనే అరణ్యవాసముచేశాడనీ మేఘసందేశంలో వర్ణింపబడిన Scenes అన్నీ ఈప్రాంతాల కనపడతాయనీ ఏమేమో మామిత్రులు చెప్పుతున్నమాటలు నాచెవి కెక్కలేదు. చేష్టలుడిగి, శిలావిగ్రహమువలె ఈసౌందర్యమును చూస్తూ కూర్చున్నాను.

మూడున్నరకు Chatikona Summit అనే స్టేషను చేరాము. ఇక్కడే దిగాలన్నారు మా మిత్రులు. ఈ రైలులైనులోకల్లా ఇదే ఎత్తైన ప్రదేశమట. అందువల్లనే దానిని Summit అన్నారు. దిగగానే సీతారామయ్య మాకు స్వాగత మిచ్చారు (మాటలతో). స్టేషను మాష్టరుగారు కూడా స్వాగత మిచ్చారు (వేడి టీనీటితో). అక్కడకు సమీపములోనున్న జలపాతం చూచి, బస్సు ఎక్కి బయలుదేరాము. ఇక్కడకు బిస్సంకటకు అయిదు మైళ్లుంది. అక్కడకు చేరేసరికి సుమారు ఏడుగంటలైంది.



బిస్సంకటకులో రామశేషయ్యగారి యిల్లు



రామశేషయ్యగారి యింటిముందున్న యేరు

ఇది ఏజన్సీ అని మాకు తెలుపడానికి కాబోలు దారిలోనే బాగా చలి ఆరంభించింది. ముడుచుకొని బండిలో గజగజలాడుతున్న మమ్మల్ని చూచి రెండు చిరుతపులులు నవ్వుకుంటూ చక్కాపోయినాయి. 'బాబూ మమ్మల్ని త్వరగా బసకు చేరిస్తే నీకు పుణ్యముంటుం'దని బండివాడిని హెచ్చరించాను.

బసకు చేరేసరికి చలి మరీ ఎక్కువైపోయింది. విదేశాల్లో చలికి అలవాటుపడ్డా, ఇక్కడ గజగజలాడిపోయాను. ఇంతచలి ఉంటుందని నేనెరుగను. తగ్గ చొక్కాలూ, శాలువలూ ఏమీ తెచ్చుకోలేదు. 'ఏమండీ, నావంటి Innocent orphanను తీసుకువచ్చి ఇలా బాధపెట్టడము ధర్మమేనా' అన్నాను మామిత్రులతో. 'ఉండండి మీకు నెగడు వేయిస్తాను' అన్నారు. అదేదో కొరతవేయడంలాంటిదనుకుని, 'నేనన్న మాటల్లో తప్పేముంది మీకంత కోపం రావడానికి. చలిబాధచేత అన్నాను. క్షమించండి' అన్నాను. ఆయన పకాలున నవ్వి 'ఈదేశంలో నెగడు అంటే చలిమంట అని అర్థం. ఇక్కడ శీతకాలంలో అంతా వేసుకుంటారు. అంతేనేకాని మరేమీ లేదు. భయపడకండి' అన్నారు. 'ఏమో మీ దయ. ఈమహారణ్యంలో ఒంటరిగా మీచేతుల్లో పడ్డాను. బ్రాహ్మణుణ్ణి. పిల్లలుకలవాణ్ణి' అన్నాను. భోజనాలుచేసి చలిమంటదగ్గర కూర్చుని ౧౧ గంటలవరకూ కబుర్లు చెప్పుకొని విరమించాం.

## 3

మా బస తూర్పుముఖంగా ఉన్నది. ఇంటిముందు వందగజములపైగా పూలతోట. దానికి దిగువను ఎప్పుడూ సందడిగా పరుగెత్తే సెలయేరు. దానికవతల క్రమోన్నతమైన అడవి. అడవికవతల పర్వతము. ఇటువంటిచోట ఇల్లుకట్టిన పెద్దమనిషి కవి అని వేరే చెప్పడమెందుకు?

అవసరములన్నీ తీర్చుకుని, కాఫీ త్రాగి నారి వ్యవసాయము చూడడానికి బయలుదేరాము. నీరి



కొన్ని మేకలు



కోతకు సిద్ధముగా ఉన్న వరిచేను

భూమిలో అసలి చాలాభాగము కొట్టేశారు. తోట్లుఏర్పాటుచేశారు. భూమి అంతా చక్కని గరపనేల. వీరి భూమిచుట్టూ, సర్వకాలములయందూ ప్రవహించే ఏరు. భూమి మంచిదై ఉండి కావలసినంత నీరు ఉంటే బంగారం సంపాదించవచ్చు.

ఇంతకాలంను ఈ వ్యవసాయశాఖఅంటూ ఒకటి



చెరకుతోట

ఉన్నా దానివల్ల ప్రజలకు విశేషమైన ఉపయోగం లేకపోయింది. ఇప్పటి అధికారి రామమూర్తిగారు వచ్చినప్పటినుంచీ ఆశాఖ ప్రజల అందుబాటులోకి వచ్చింది. వారిమూలాన చెరుకు, ప్రత్తి ఎక్కువ వ్యాప్తిలోకి వస్తున్నాయి. ఇక్కడకూడా వీరు సుమారు ౨౦ ఎకరములు ఈ క్రొత్తరకం చెరుకు వేశారు. చాలా బాగా బయలుదేరింది. మేము వెళ్ళేసరికి బెల్లం ఎలాఅవుతుందో అంచనాకోసం కొంత భాగం కొట్టి, గానుగ ఆడుతున్నారు. వంద ఎకరములు పైగా వరివేశారు. అదికూడా చాలాబాగానేఉన్నది. కొంచెము అరటి, కొంతకంది, కొంతపొగాకు, ఉల్లి, మిరప మొదలయినవి వేశారు. కేబేజి వగైరా కూరలకు ఇప్పుడే నారుపోశారు. ఒక ఎకరము మేర కాఫీమొక్కలు పాతారు. ఒక ఎకరం అనాసలు వేశారు. కొంచెం ద్రాక్ష వేశారు. కడియంనుంచి వచ్చిన వెంకట్రావుగారుకూడా చాలాసంతోషించారు. నారు ఫలానాచోట మామిళ్ళు, ఫలానాచోట సపోటాలు, ఫలానాచోట బత్తాయిలూ వెయ్యమని చెప్పారు. నేనూ ఊరుకోకుండా వారు చెప్పేది బాగున్నదనీ, కొంతమేర Apples, కొంతమేర Figs వగైరా వేస్తే చాలా లాభమనీ సలహాఇచ్చాము. వచ్చిన తరువాత ఊరుకోవటమెందుకు మరి.

తిరిగితిరిగి ౧౨ గంటలకు బసకు చేరుకున్నాము. పైన వ్యవసాయమే కాకుండా, ఇంగ్లీషు కోళ్లను పెంచుతున్నారు; మేకలను పెంచుతున్నారు. [illegible] పాలు ఎక్కువగా ఇచ్చేవాటినిగా తయారుచెయ్యడానికి పంజాబునుంచి ఒకజాతిమేకను తెప్పిం

మనిషి ౧-కి నెలకు ౭ రు. చొ. ౬ బేహారాలు రు. ౮౭
గుమాస్తా　　　　రు. ౧౫
మనిషికి నెలకు ౫ రు. చొ. ౫౦ మంది
కంబాళీలు, అనగా కూలీలు　　　　రు. ౨౫౦

ఇవంతా మొత్తం సంవత్సరానికి ౮౮౬౬ రూపాయ లయింది. ఇంకా మేనేజరు జీతం నిర్ణయంకాలేదు. ఇది కాకను మునుపుచెప్పిన కారణంచేతను ఇంకొకమూడు



కమలాఫలపు తోట

వేలవరకూ ఖర్చు అయింది. అనగా ఇంతవరకూ సుమారు ౧౭౦౦౦ రూపాయలవరకూ ఖర్చుఅయిందన్నమాట. ఇంక రాబడిసంగతి- ౭౦ ఎకరముల చెరకుతోట. ఎకరమునకు అసలము ౧౫ టన్నుల గడ అవుతుంది. అనగా ౧౨౦౦ టన్నుల చెరుకు అవుతుంది. టన్ను చెరకుకూ ౧౨మణుగుల బెల్లం అవుతుంది. అనగా ౧౪౪౦౦ మణుగులబెల్లం అవుతుంది. మణుగు రూపాయచొప్పున ౧౪౪౦౦ రూపాయలు వస్తుందన్నమాట చెరుకుతోట వల్ల. వరి మొదలుగు ఎకరములవల్లా అసలం 3౦౦౦ వస్తుంది. మొత్తంఆదాయం ౧౭౪౦౦. పరవాలేదు! బాగుంది! ఒక్క పదిహేనుమాసములు ఒక్కమనిషి పట్టుదలగా పనిచేస్తే ౧౭౦౦౦ సంపాదించగలిగా డీమహారణ్యంలో. ఒకరికిసాధ్యమైనది ఇంకొకరికిమట్టుకు సాధ్యముకాదా!

యువకుడు, అనుభవములేనివాడు, organization చేత కానివాడు, కేవలము ఉత్సాహముచేత, పట్టుదలచేత ఎంతపని చెయ్యగలిగినాడు సీతారామయ్య! అడవి, అడవిమృగములు, అంతకంటె అద్వాన్నము అడవిమనుష్యులు! మనమనిషి ఒకడుచేసేపని వాళ్లు పదిమంది కూడా చెయ్యలేరు. వీళ్లతో పాపం ఎలా నెగ్గుకొచ్చాడో సీతారామయ్య అనిపించింది.

'ఏమి సీతారామయ్యా, ఎలా ఉంది, ఇంకా ఉండాలని ఉందా, లేకపోతే ఉద్యోగానికి ఉన్నావా!' అన్నాను. 'అయ్యా, రాము లేమయ్యగారి ఉద్యోగం లేదన్న నేను వచ్చినా ఇక్కడినుంచి కదలను. నే నింతకాలం ఉద్యోగం కోసం ఎందుకు తిరిగానా, దాని కోసమింత ఎందుకు తపించానా అనే విచారం తప్ప మరొకటి లేదు నాకు. నాలో మాంద్యమంతా పోయింది. జీవితములో వింత ఆనందం కనుపిస్తోంది. పుస్తకాల్లో ప్రకృతివర్ణనలు చూస్తే నాకు వొళ్లుమండేది. కాని ఇక్కడి ఈసౌందర్యం చూస్తే పుస్తకాలెందుకనిపిస్తుంది. ఇక్కడికి వొచ్చినతరువాత కొంత దైవభక్తికూడా కలిగింది. ఇంక నాకేమికావలె నండి' అన్నాడు ఆవేశంతో. నిజమే, ఇంతకంటె ఒకరికి మట్టుకు ఏమికావాలి!

ఉన్నది తగలేసుకుని, బి. ఏ. లు ప్యాసయి, ఉద్యోగంలేక, హోనరేరిగా ఏ ఎలిమెంటరీస్కూలులోనైనా పనిచెయ్యనిమ్మని బోర్డుప్రెసిడెంట్లను కాళ్లు పట్టుకునేబదులు మన యువకులు సీతారామయ్యపద్ధతి ఎందుకు అవలంబించకూడదు?

"హాలికులైననేమి గహనాంతరసీమల కందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై."

—బమ్మెర పోతన.

# విషాదగీతి

మల్లవరపు విశ్వేశ్వరరావు

జీవితమ్ము నిరాశావిశీర్ణమై, మ
నమ్ము చింతాకులమ్మయి నవసి, హృదయ
సీమ యానంద మేది శుష్కించునాడు,—
ఈసమీరతరంగమ్ము, లీసముద్ర
నిత్యసంతోషనిధ్వనుల్, ప్రత్యూషపు
సితదరహాసమృదుకిరణేక్షణమ్ము
లమర జీవమ్మొసంగి తాపార్తి బాపి
జీవిత మ్మొక్కస్వప్నమ్ము సేయలేవా ?

ఈప్రకృతి చిత్రశోభలే నాప్రబుద్ధ
బాల్యముకుళదళమ్ముల ప్రస్ఫుటించె!—
ఇపుడిపుడె లేతగుసగుస లీనిగుండె
లాగికోలేని జీవరహస్యతతుల
నొకటొకటె గాలివీనుల నొలుకువేళ
నే, హఠాద్భగ్నగీతిక లేవొ నామె
డంద నలయించి చలియించి సందడించు!

అరవిరియు యౌవనోత్సాహపరత నెల్ల
అపుడపుడె రెక్కలల్లార్చు నాశలెల్ల
వ్యర్థము నొనర్చివైచి జీవాలయంపు
ప్రాంగణాన నార్తశ్రుతిప్రతినినాద
మేల ? నాయౌవనాభ్రమం దిట్లు కాంతి,
మాయ నీలాంబుదమ్ములు మసలనేల ?
ఉష వికాసించు కోమలప్రసవపాళి
మధుకరకుమారకుడు చొక్కి మసలుచుండ,

ఈయెడద ప్రేమలేక కృశించనేల ?
ఈపెదవియే పిపాస తపించనేల ?

ఆమనిమదించి కోయిలహాయిబాడ
నీవసుంధర తన్మయీభావమూన,
గద్గదము వోవనేల నాకంఠరవమె ?
ఏల నాజీవితమ్మె శోకాలయమ్ము ?

తలిరుప్రాయంపుటలరుగుండెలవిసమ్ము,
నమ్మదాశ్రువులందె శోకమ్ము, గ్రోలు
మధురసమ్మందె కాలాగ్ని మసలనేల ?
ఆశలె నిరాశలై శూన్య మలమనేల ?

ఈప్రథమసంధ్య శోణరశ్మిప్రశాంత !
శశ్వదానందమూర్తి యీవిశ్వప్రకృతి!—
నాహృదయమే విషాదసందేహములకు
దావలమ్మయి నేడు నిర్జీవమయ్యె.

ప్రణయనైరాశ్యమున కుంచుకొనిన పూవు
టెడదరేకులు వసివాడి సడలెనయ్యొ!—
రాలిపోయినతలిరుతురాయిదళము
లయి వసుంధర! నీవక్షమాశ్రయించు!

ప్రవిమలధ్యానపూత యీప్రకృతిమాత
నేత్రములనీడ నాలేశమాత్రజీవ
నమ్ము ప్రేమావలోకభాగ్యమ్ము వడసి
మోసులు చిగుర్చునో పూచునో సుమాలు?

---



3. ఓషధివనము-ప్రతిబింబము-కలకత్తా —సాగర్ల.



సృష్టి —సాగర్ల.

# రామలింగారెడ్డి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సాహితి వెన్నెలబోలునది; మానవజగతిలోనే వెలయుఁది. కాని దాని జీవము, దాని వెలుగు దివిభువినుండి వెలారును. దివ్యసామ్రాజ్యమును గుండెయందు నిలుపుకొని పుట్టిన వ్యక్తిమాత్రము తన రచనయందు చలివెలుగున కెనయైన కవిత కలిమిని చూపగలడు. సాహితీచంద్రిక లీతని హృదయనభమునుండి జ్యోత్స్నాపక్ష సౌందర్యమును సమ్మ్రించును. అంతరంగమునుండి తనంతదాను కౌముదీధారలను కురిపించు అదృశ్యశక్తి తెచ్చుకొందమనిన దొరకునది కాదు. కొండంత యోపికగల పఠిత కండబలమువంటి శబ్దబలము చూపగలడు. కొమ్ములుతిరిగిన పండితుడు కావచ్చును, కాని ఈతనిమాట లుత్తి పూసుత్తియట్లుండదు. అందు వెన్నెలసత్తి హుళక్కి. అందు చెమ్మట బొట్టులుండును గాని శిశిర బిందువు లుండవు. ఈతని లేఖిని సుధాలహరిని చిమ్మదు; తుహినశోభను చిప్పిల జేయదు. అది సౌందర్య, సౌమనస్య, సౌష్ఠవముల నెఱుగదు. సహజసాహిత్య సామర్థ్యముగల వ్యక్తికలమునుండి పువోత్తిమెఱపులు పోలు జీవనచ్ఛటలు తళ్కొత్తును. రసనమునుండి రసప్రవంతు లుప్పతిలును. ఇట్టి సామర్థ్యము గల అదృష్టవంతుడు రామలింగారెడ్డి.

రెడ్డిమనసులోని నాగునకు నిగోసిన ముహూర్తములు తొలినుండియు తలసూపినవి. ఇట్టి ముహూర్తములే మనుజునున్నతికి దోకొను దివ్యసోపానములు. మెట్టులు లేకున్న గాలున్న నేమి, లేకున్న నేమి? తొలిమెట్టు రెడ్డిపుట్టుకయందే గోచరించినది. సారస్వతశక్తి, గురుతరభక్తి గల తండ్రి కడుపునబుట్టుట రెడ్డియదృష్టము. కోమకలయెడంద లందలి సాహితీబదనికలను పెంచి, మనోమోహనవనమాలులు కాగల తండ్రు లెందఱున్నారు? నిర్బోధజనకుల అంకతలమున శైశవమును కడపిన, ప్రజ్ఞాధురీణులగు డింభకు లెందఱు ఆలకాపరు లగుటలేదు? తొలుత గిరణస్పర్శనందిన కమలవధూటియే కదా కైత నవ్వున గాంతిలును! మూర్ఖ చిత్తముబోలు మబ్బు ఎదురైనపుడు మలీమసమై అది మడియదా? మృణాలహస్తములుచాపి, విరిసిన అరచేతి తామరలందు రమాపతిని గైకొని సరోజ సరోవర సీమంతిని సౌందర్య సంశోభిత యగులీల, ప్రఫుల్లహృత్కమలమందు సాహితీలక్ష్మిని గొను కళోపాసకుడు సౌందర్యసందీప్తజీవి కాగలడు. కన్నతండ్రి ప్రోత్సాహముకతన కట్టమంచిరెడ్డి బాలకుడై యుండగనే అతులసాహితీవిభూతికి నెలవైన మహాభారతమును చేతబట్టినాడు. మాతృకకు వన్నె



కట్టమంచి రామలింగారెడ్డి

దెప్పు ఆంధ్రమహాభారతము కల్పవృక్షమై ఎదుటదోచి నంతనే, దానిపండ్లను పుడికి, చిఱుత ప్రాయమున రెడ్డి తీయని పానిరసమును మనసార గ్రోలినాడు; రెండవ మెట్టుపై నడుగువెట్టినాడు.

యశస్తిలకులకు పుట్టినిల్లైన క్రిస్టియనుకాలేజిలో విద్యార్థియై రెడ్డి మూడవసోపాన మధిష్ఠించినాడు. ప్రభుత్వసాహాయ్యమున నింగ్లాండున కరిగి, సుప్రసిద్ధవిద్యాకేంద్రమైన కేంబ్రిడ్జిలో నడుగువెట్టి, చార్లెస్ ఫాక్స్, గ్లేడ్‌స్టన్ మున్నగు విద్యాసాగరులు మసలినతావున నున్నతవిద్య నందినాడు; నాలవ మెట్టుపై నడుగుపెట్టినాడు. మార్లేశిష్యుడగుటయు, గోఖలేనెచ్చెలి యగుటయు, బరోడాయేలిక ఆదరమున అమెరికాచని, మతిమంత జ్ఞానసముపార్జన మందుటయు, మైసూరు మన్నిని అనురాగముపడసి పృథ్విని తిరిగి నూతనవిద్యావ్యవస్థను పిడికిటబట్టుటయు, పదంపడి ప్రఖ్యాతపురుషులందు మొనగాడై శాసనసభయందుంటయు, అటుపిమ్మట ఆంధ్రకళాపరిషత్తున కుపాధ్యక్షు డగుటయు రెడ్డిజీవనమందలి తరువాతిమెట్లు. ఊయెలవీడి, నేటి "పద్మప్రభాస" మున పద్మాసనము వేసికొనువఱకు అద్భుతపురోభివృద్ధి నందజాలు తరుణములను రెడ్డి యందినాడు. ఇట్టితరుణములు, ఇట్టి సుముహూర్తములు ఎందఱికో లభింపవు. వీనినన్నిటిని అందిన రెడ్డి యదృష్టము అనిర్వచనీయము. ఇతనికి అదృష్టాభావము కలదని ఒకప్పుడు మతిమంతుడు రాధాకృష్ణు డనినాడట. ఈయహోహ సరికాదని నాతలంపు. విజయజీవనమునకు వలసిన కొంతసరుకు రెడ్డియందు శుద్ధప్రాజ్యమై యుండుటచే ఆత డందినతరుణములు కొఱగానివయ్యెను. ఆతనియదృష్టము వ్యర్థవిజృంభణమున గడతేఱినది.

ఆత్మశక్తిని గుర్తించుట ఆత్మవృద్ధికివలసిన గురుగుణములలో నొకటి. ఈశక్తినిబట్టి బుద్ధిశాలి భావిపథమును దృష్టియందు నిర్దిష్టముచేసికొని, తెరువుతుదభాస్వంతాశయము నొందు నిలుపుకొని దానిని చేరుటకు శక్తివంచనలేక శ్రమించును. ఏయాశయమును కను లెదుట నిలుపుకొనక మనువాడు జీవనజలధియందు చుక్కానిలేని నావ యగును. అనేకాదర్శములపై కన్నువేసి, ఒకదానిపైగూడ ఏకాగ్రదృష్టి నిబద్ధమొనరింపనివాడును ఆతనివలెనే ఊగాడుచుండును. ఇతనికి ప్రజ్ఞ యుండునుగాని, నిలుకడ యుండదు. ప్రభాకలితమైన తనయుద్దేశమునుండి కన్ను చెదరనీక, కుడియెడమలనుండి మధురగీతికలాలాపించు ప్రలోభములదెస మనసుపోనీక కష్టమైన జంకక, నిష్ఠురమైన గొంకక, ముందుల కడుగువేయువాని కృషి రుధిరసంసిక్తమయ్యు కాలక్రమమున గమ్యస్థానమున విజయపతాక మెత్తగలను. రెండుమూడుదిశలకు పాదరసమట్లు పర్వెడు మనసు ఏదిక్కునందును నెగ్గునల నెఱుగనిదై యుండును. పట్టుదల యెట్టిదో ఇదియెఱుగదు. ఇచ్ఛాశక్తి దీనికవగాహము కాదు. దృఢనిశ్చయమును గుఱించి ప్రబంధములల్లును గాని, దాని ననుష్ఠించు టెఱుగదు; స్థిరకృషి నెఱుగనిదై స్థితప్రజ్ఞకు దూరమైయుండును. రెడ్డిమనసు చుక్కానిలేనిదికాదు. కాని దానిమూపు ధ్రువతారను కానలేదు. అగాధమున దిర్దిక దిరుగునదికావున ఏదరి జేరక జెండాయెత్తినదికాదు. రెడ్డిహృదయము సౌందర్యతిలక; స్వైరితగదు; నిలుకడయైన ఉపాసనము నెఱుగదు. పట్టుమని పదినిముసములు ఏపుంజాసీనమందును రెడ్డి కూర్చునియెఱుగడు. వ్రతనిష్ఠ నెఱుగనివాడు, దీక్షావకుండు కానివాడు, ఎంతచమురున్నవాడైన నేమి, అఖండజ్యోతిని వెలిగింపలేడు. విజయప్రదీపమును రెడ్డి వెలిగింపజాలకపోయినాడు.

రెడ్డిప్రజ్ఞ మూడురీతులు కలది. సాహితీప్రజ్ఞ ఈతనికి సహజమైనది. విద్యాంగణమున నీతని యభిజ్ఞత మెండు. రాజకీయోద్యమమందును ఇతనికి ప్రీతి కలదు కావున, రెడ్డి చక్కని ఓరమాపుల దానిపై సారించుచుండును. సారించుటయేకాదు, దిద్దినట్లుండు దాని కనుబొమ్మలను సంబోధించుచు, షేక్స్పియరు తెలిపిన యువకునిలీల (Vide: "As you like it") తీయని కవిత యల్లుచుండును. మూడుదిక్కులకు పరువులెత్తక, ఒకేక్రియాంగణమును తనజీవనమునకు ఆటపందిరిజేసి

కొనియుండుచో, రెడ్డి విజయలక్ష్మి నందువాడు. విజయలక్ష్మియే ఆతని కర్ధాంగలక్ష్మి యయ్యెడిది.

యువకుడై యుండగనే, రెడ్డి తన సాహిత్య ప్రజ్ఞను చూపగలిగినాడు. విద్యార్థియైయుండియే, టోపిలో తురాయిదాల్చినాడు. బహుమతులదండ మెడ ధరించినాడు. శక్తిసామర్థ్యములు పొడగట్టినపుడు, జాతిమతవివక్షతలను గణింపక వానికి ప్రశంసార్ఘ్య మిచ్చుటకు సంశయింపని కేంబ్రిడ్జివిద్యావంతులు నాటి యూనియనునకు రెడ్డిని గార్యదర్శి జేసిరి. పిదప నాతని నుపాధ్యక్షపీఠమున నాసీను జేసిరి. కేంబ్రిడ్జిలోనే కలము బట్టి, తన ప్రజ్ఞను తాను గణించి, సాహితీసేవ తన యేకైక కర్తవ్యమని యెంచియుండుచో, రెడ్డి తన మాతృభాష కెంతేనిసేవ సలిపియుండును. సభ్యప్రపంచమున దానికి(వంగకవులు తమభాషకు దెచ్చినట్లు)అనర్ఘమైన ప్రతిభ దెచ్చియుండును. తెలుగున నితడు వ్రాసినగ్రంథములు ముసలమ్మ కథ, అర్థశాస్త్రము, కవిత్వతత్త్వవిచారమును. ఆంధ్రసాహిత్యాచార్యులలో రెడ్డికి చిరస్థానము నిచ్చునది మూడవగ్రంథము. కొంత అప్రస్తుతప్రసంగమందుబడి, కొన్ని స్ఖాలిత్యములను పుస్తకమున రెడ్డి ప్రవేశపెట్టినను, దీనిబోలు గ్రంథ మింకొకటి తెలుగున నింకను పుట్టలేదనిన సత్యమునకు తలవంపులు రావు. కాని చేవగల రెడ్డి సాహితికిచేయజాలినది, చేయవలసినది ఇంతియే కాదు.

తన ఉపన్యాసములందును, అపుడపుడు వ్రాయుచు వచ్చిన వ్యాసములందును రెడ్డి పూలవాన గురిపించినాడు. నందనమును చూడనివారు రెడ్డిరచనమును చూచిరేని దానియందము నెఱుంగుదురు. వెన్నెలచెర్వున జలక్రీడలాడనివారు రెడ్డివ్రాతలందు జొచ్చిరేని తనివార హాయినందుదురు. పతితమనసు మానసౌకమువంటి దగుచో, మానససరోవరమును కాంచినట్లు మహావేశమున రెడ్డిరచనమున గ్రుంకులిడును. చదువరిహృదయము షెల్లీ వీణియ (Shelly's Guitar) కెనయైనదేని, భామవలె నృత్యముచేయు రెడ్డికలముతో లయగలిపి మధురగీతికలు వెదజల్లును. చేతిని చెక్కిలికి చేర్చుకొని, ఒయారముగ ప్రేయసి జూలియట్ కూర్చున్నపుడు అనురాగపిపాసువైన రోమియో ఆమెనుకాంచి, సంచలితహృదయుడై "ఆసుందరి చేతికంకణము నైనయెడల, నాచుంబనమున కాచెక్కిలి యెంతదాపల నుండెడిదో!" అని యనుకొన్నాడు. (Vide: Shakespeare's 'Romeo and Juliet') కవితాకామిని చేతికంకణమై, ఆమె గండస్థలమున దొంగముద్దులు ముద్రించుచు, రెడ్డి తనరచనమును కావ్యమయము కావించినాడు. న్యూమేన్ "Style is the man" అన్నాడు. ఈసూత్రమునుబట్టి రెడ్డి శైలిని పరికించితిమేని రెడ్డి యెవ్వరో తేటబడును; నిజము వెల్లడియగును. కవితాసామ్రాజ్యనాథులు శుద్ధబ్రహ్మచారిని శుష్కకాష్ఠమందురని నాయూహ. రెడ్డి శుష్కకాష్ఠము కాడు, మఱి మహారసికుడు. కానిచో, నితడు కలమెత్తలేకుండును; ఎత్తినచో, రసపరిల్లలాననుచూపజాలకపోవువాడు. ఆవేశపక్షవిక్షేపమున దివికెగిరి అచటి నవప్రోవులను దొంగిలించి, 'ఇవి నాయక్కరములు, ఇవి నావాక్కులు' అని దొంగరెడ్డి చెప్పుకొనుచుండును. తన యుపాధ్యక్షపదవికి పెద్దబలామారనిన కొలదిదినములలో నీత డుచ్చరించిన వాక్కులు "సానలదీటిన జాతిరత్నములు." వంగవిద్యార్థులను సంబోధించి కలకత్తా ఆల్బర్టుహాలులో నీత డొసగిన ఉపన్యాసమును, కార్వే స్థాపించిన మహిళాసంస్థయం దీత డిచ్చిన ఉపన్యాసమును అధునాతన ఆంగ్లసాహితియందు మహోన్నతస్థానము నందగలవు. "శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట" ("కవిత్వతత్త్వవిచారము ౧౧౪వ పేజీ చూడుడు) అని రెడ్డియే పలికినాడు. సాహితీవసుంధరయం దీతడు తాను పలికినదానిని చేసితీరినాడు.

గద్యరచనమున అద్భుతకవితాకౌశలమును చూపగల కొలదిపాటి ప్రపంచరచయితలలో రెడ్డి ఒకడు. ఎడ్మండ్ బర్క్ పద్యములు వ్రాయలేదు. కాని అతని రచనలు కవిత్వమాహాత్మ్యమునకు నిక్షేపములు. మిల్టన్ షెల్లీల గద్యలు (Vide: Milton's "Areopagitica" and Shelly's "Defence of Poesy") ను, సరోజినీరవీంద్రుల (Vide: Sarojinee's Speeches

and Rabindranath's Essays) గద్యములను ఛందో నియమము లెఱుగని హృద్యమైన పద్యములు; కవితా సుధాభాండములు. రెడ్డిగద్యరచన విమర్శనలదాపల నిలువగలదు.

కౌముదీస్నాతరమ్యారామమనిన కీట్సునకిష్టము. ఈతనిశైలి ఈయుద్యానమును బోలియుండును. ఆంగ్ల సాహితియందు విశేషముగ విహరించినరెడ్డి కీట్సు ఉద్యానమునుండి ఎన్నెని అంటుమొక్కలు తెచ్చుకొని నిజహృదయమున నాటి పెంచియుండును. కావుననే ఆతనిశైలియు వెన్నెలతోటవలె నుండును. తన మాటలపై కీట్సునకెంతో మక్కువ. రెడ్డికిని భాషాప్రీతి మెండు. తేనియలొలుకు తనపలుకులను కీట్సువలె తాను ముద్దిడికొనియే ఆతడు కాగితముపై చిత్రించుచుండు నేమో!

కళాసందీప్తహృదయుడు తానువలచిన భాషాయోష యొసగు రంగారు బంగారు వెలుగుదండను తన మెడ దాల్చి, తనహృదయమందు మినుకులురాల్చు ఇంద్రధనువును అల్లన విదల్చి, రంగురంగుల మెఱపులను తలబ్రాలట్లు ఎదుటి సాహితీవధూటిశిరమున పోయును. తనలో నెంతయో కులుకుచు సాహితీసీమంతిని జేరబట్ల రెడ్డియు నిట్లు కులుకుచుండును. ఇతని ఇంగ్లీషు ఇతనికివేసిన విరిదండ నీతడు తనతెలుగునకు వేసినాడు. ఇంగ్లీషుచదివిన తెలుగుమఱచుట, తెలుగుపొండితినందిన "ఇస్సీ!" యని కొరడాతో నింగ్లీషును కొట్టుట పరిపాటియైన దౌర్భాగ్యపుతెలుగునేలలో* రెండుభాషలను పిడికిటబట్టిన మనీషు లకలమైయుండ రెడ్డి యాలేమి దీని దీర్చినాడు. ఈతనివెనుకనే కొందఱాంధ్రవిద్యాధికులు తల్లిమాటపై మనసుంచిరి. వీరికి మార్గదర్శకుడైన రెడ్డి వీరిలో నగ్రగణ్యుడు.

అక్షరములందు భేదముండునుగాని, రెడ్డిశైలి ఆంగ్లమందును, ఆంధ్రమందును ఇంచుమించుగ నొకేరీతి నుండును. భాష లెన్నైననేమి, వ్యక్తి ఒకడైన యెడల, శైలియు సాధనమున వ్యత్యాసములు లేకున్న నొక్కటియై యుండును. ద్వాపరయుగమునుండి ఆంధ్ర వ్యాకరణ సూత్రములను — ఇపుడున్నవే యని — బట్టి చూచితిమేని, ఇతని తెలుగున అందందు తప్పులు తోచును. భావగమనికకు సరిపడుభాషను ప్రయోగించుటందు రెడ్డి దిట్ట. తెలుగుసొగసునుమాపు జాతీయముల నీతడు సృష్టింపగలడు. ఇతని తెలుగుచూచినవారితడు తిక్కనశిష్యుడని గ్రహింపకపోరు. రెడ్డి తెలుగుశైలి పల్వురకు మేలుబంతి కాగలదు. కాని రెడ్డి తఱచుగ తెలుగువ్రాయడు. కావున నీతని యాంధ్రశైలి నక్షత్రఖచితవియత్తలమున కెనయైన ఈతని యాంగ్లశైలి కుజ్జీ కాదు. కవలలహృదయ మొక్కటే. సాధకముచేసిన కవలబిడ్డ రెండవవానికంటె పుష్టిగా నుండును. ఉభయ భాషలందును రెడ్డిహృదయము మాపట్టును. కానియీతని యాంగ్లము పైచేయిగల కవలవలె దోచును.

పృథ్వియంతయు నేడు పునర్జన్మను కాంక్షించుచున్నది. అపూర్వ భావములను, అపూర్వ రూపములను ఉప్పతిలి అపూర్వశైలియందు ఆత్మసాక్షాత్కారమందదపి చుచున్నది. ప్రుక్కినశరీరమున యౌవనసామ్రాజ్యము కైదుపడియుండునా? నేటి తెలుగుశైలి యటూతియై కూర్చున్నది. నవయౌవనమును కాంక్షించుచున్నది. భూమిచుట్టు సూర్యుడు తిరుగుచున్నాడను సిద్ధాంతము తలయెత్తినపుడు ఏర్పడిన తెలుగుశైలి నేడును వడపప్పునైవేద్యము నందుచున్నది. వెనుకటిసిద్ధాంతము తునియలై నేలరాలినను, వెనుకటిశైలిచుట్టును తెలుగు సోదరులు రామభజనచేయుచున్నారు. క్రొత్తపోకడ తెలుగువ్రాత తెలుగేకాదను పండితు లున్నారు. వీరు పదిబళ్ల శబ్దసామగ్రిని మ్రింగిన దిట్టలు. కాని వీరి సాహిత్యజ్ఞానము బండిసున్న. గొంతుకు పెద్దదని నేడు నిరంకుశత్వమును చెలాయించుచున్నారు. తెలుగు భాషకు తిరుగటికాళ్లు తయారుచేయుచున్నారు. ఇది తెలుగుజాతి సాహసగుణమునకు, అభ్యుదయప్రదాయినియైన ఉత్సాహమునకు, పురోభివృద్ధికాంక్షకు తలవంపులు తెచ్చు ఆచరణము. భావఝరి పొరలివచ్చుచుండ, అడుగడుగునకు ఆనకట్టలు కట్టుచు సంప్రదాయమని

* ఈమండిగమే ఇంకను తెలుగునకు తీఱనిచెఱుపు దెచ్చుచున్నది.

వెనుకటిఖిలాఖిలికి శ్రుతివాయించు నేటిపాడి? నేటి అద్భుతభావఘనికి అద్భుతమైన రహదారిని ఏర్పఱిచి నది ఆంగ్లభాష. వాక్కుల యల్లికయందు అవసర మనుపట్ల ఆంగ్లానుసరణమునకు చోటిచ్చి అన్యభాషా చార్యులు తమభాషలకు అపూర్వశోభను దెచ్చిరి. దృష్టాంతముల నపేక్షించువారికి రవీంద్రుని వంగరచనల నుండి వేనవేలు చూపుదును. ఈపోకడ ననుసరించి వంగమును ప్రయోగించి రవికవిప్రశంస నందితిని. ఈ పోకడ ననుసరించి కొంత తెలుగు వ్రాసినపుడు ఇకిలింత లను, సకిలింతలను వింటిని. తెలుగునకు క్రొత్తరూపు తేగలనాయకుడు నేడవసరమైయున్నాడు. ఈపదవికి అర్హతకలవాడు ఆంధ్రాంగ్లములందు అద్వితీయశక్తి నందిన రామలింగారెడ్డి ఒక్కడే. నేటి భాషోద్యమము నకు తాను పెట్టగల భిక్షను రెడ్డి పెట్టునా?

రెడ్డిశైలి రసవంతము కావున అతనివక్తృత్వము శ్రోతలహృదయము నాకర్షించును. ఇతడేయుద్యమము తోడను స్థిరమైనజోక్యము కలిగించుకొనకపోవుటచే, నీతని వక్తృతాశక్తి సముచిత విజృంభణమును చూప లేదు. తాను విశేషముగా పరిశోధించిన సాహిత్యమును గూర్చియైనను పృథ్వీసాహిత్యకేంద్రస్థానములం దుప న్యసించియుండినచో, వక్తయని జగత్ప్రసిద్ధి నందు వాడు. అమెరికాపోయినపుడు ఒకానొక వేడుకసంభా షణములో రవీంద్రుని "గీతాంజలి"కి నోబిలుబహుమా నము వచ్చునని తాను జోస్యమును పలికినట్లు రెడ్డి చెప్పి కొనెను. (రవీంద్రుని సప్తత్యుత్సవ మహాగ్రంథమండలి రామలింగారెడ్డి వ్యాసమును చూడుడు) అవును, ఆతని జోస్యము ఫలించినది. మీనమేషములు లెక్కించువాని జోస్యము బోర్లపడవచ్చును. అతనిది పైమాపు గాని లోచూపుకాదు. మనుష్యశక్తి హృదయమందు పరం జ్యోతియట్లు ప్రకాశించునుగాని, మాడపట్టుమీద పెద్ద కంతెయై చూపట్టదు. రవీంద్రుని హృదయగర్భాలయ మండలి దివ్యజ్యోతిని సాహితీమందిరమున పూజారియై యున్న రెడ్డి గుర్తింపగలుగుట అబ్బురము కాదు. రవీంద్రుని గుర్తించిన రెడ్డిని కళోపాసకుడైన కజిన్సు గుర్తించి, అతడిట్టివాడని ఆశుతోషుప్రభృతులకు దెలు పుట కూడ అబ్బురముకాదు. * తన సాహిత్యసామర్థ్య మును విదేశములనున్నపట్ల రెడ్డిప్రసంగములందే ప్రదర్శించి నాడు కాని గురుగంభీరమైన ఉపన్యాసములందు కాదు. అందుచే నతనికీర్తిలతికలు దశదిశలందు అల్లుకొనలేదు.

జనసామాన్యమును సంబోధించి, శ్రోతలహృదయ ముల నుద్రేకించి, మేటివక్తల మనిపించుకొనువారి తెగ లోనివాడు రెడ్డి కాడు. రెడ్డి జనసంప్రీతిని కాంక్షింపని ఉదాసీనుడు. సారస్వత తత్త్వమెఱిగిన విద్వాంసుల సభపై నీతడు సమ్మోహనాస్త్రము ప్రయోగింపగలడు. రాధాకృష్ణునివలె నయాగరాజలపాతమువోలె వాక్కుల నీతడు గుమ్మరింపడు. బిపిన్‌చంద్రపాల్ వలె గర్జింపడు. సురేంద్రునివలె గగనవీథిపై రాలురువ్వినట్లు మాటలు రువ్వడు. లజపతివలె ముంగాలివ్రేలిపై నిలిచి మాటిమాటి కురుకుచు నుపన్యసింపడు. జితేంద్రునివలె అగ్నికణ ములు రాల్చడు. సరోజినీదేవి సెంటులవలె నుత్తాలభావనా తరంగములం దుఱ్ఱూతలూగడు. చింతామణివలె బిగువైన పదములను, కండగలవాక్కులను ప్రయోగింపడు. వేం కటరత్నమునాయనివలె ఘనపాండిత్యమును ప్రదర్శిం పడు. పట్టాభివలె చూకదెబ్బలు కొట్టడు. సభికుల ఆపోశనమునకై రామలింగారెడ్డి చెఱకురసమును వడ్డిం చును. రసమెఱిగినవారిని రంజింపజేయు రసనము రెడ్డిది. శ్రీనివాసశాస్త్రిశైలిసౌందర్యముకంటె ఉచ్చారణ లాలిత్యము గొప్పది; రెడ్డిఉచ్చారణ శక్తికంటె శైలిమాధుర్యము దొడ్డది.

సంప్రీతినిగూర్చి వ్యంగ్యము సాహితికి సుఖమి చ్చును; మనుష్యజీవనమున ఆనందమును, ఆరోగ్యమును, ఆయువును నోయును.

---

* ౧౯౨౧ లో డాక్టరు కజిన్సు కలకత్తా విశ్వవిద్యాలయమును దర్శించి, సాహిత్యమును గుఱించి అం దుపన్యసించినాడు. అతుల మేధాసంపన్నుడు ఆశుతోషు నాటిసభ కధ్యక్షుడు. రెడ్డి సాహితీప్రజ్ఞగల మనీషియని నాడు కజిన్సు తెలిపినాడు.

జో సాధన్స్విఫ్ట్ వ్యంగ్యప్రియుడే. కాని, ఇతని వ్యంగ్యమందు సలసలలాడు విసముండును. ఏడిసన్, చార్లెస్ లేంబ్‌ల వ్యంగ్యమందు నవ్వులు తళ్కొత్తును. ఆతని నుడువులు ఈటెపోటులు; వీరిపలుకులు పూలతూపులు. **Romantic period** లోని సౌందర్యమును విశేషముగా గ్రోలిన రెడ్డి **Restoration period** లోని కొంతవ్యంగ్యమును తనదిగావించుకొనినాడు. చక్కని హాస్యోక్తులను తెప్పలుచేసికొని, పలుమారు ఆతడు లోతు చిక్కులనుండి దాటినాడు. రసికుడు కావున యుద్ధరంగమును ప్రణయరంగము జేయగలడు. డిబేటులో ప్రతికూలముగ ప్రత్యక్షనిదర్శనము నిలుచునపుడు బిక్కమొగమువేయక పూలచెండులవంటి ఛలోక్తులు ప్రయోగించి, క్రోధాగ్నిని ప్రణయసుధజేసి ఉగ్రుడైన ఎదుటివ్యక్తి నీతడు వలలో వేసికొనగలడు. శాసనసభలో నున్నపుడు ఇతని హాస్యశక్తి ఇతనికి కవచమాయెను. తా నుగ్రుడగునపుడు మొహమోటము జూపక ఇతడు మాటలు విడుచును గాని, ఈమాటలకు గులాబులచెంతనుండు ముండ్లకువలె సాహితీసంసర్గ ముండును.

రెడ్డి కవితనువ్రాసి కవియని పేరందకపోయినను అతని మనసు కైతపుప్పొడిచే నిండినదగుటు ప్రసంగించునపుడును, జాబు వ్రాయునపుడును, ఉపన్యసించునపుడును, వ్యాసము వ్రాయునపుడును, వాదించునపుడును* కళాశోభను చూపును. "రాల్ గరగించు విమల గాంధర్వంబు" వెనుకటి పుట్టువున నీతని విద్యయేమో!

రెడ్డివిజ్ఞానప్రజ్ఞ బరోడామైసూరులలో విజృంభించినది. ఇతని ప్రకృతికి సహజమైనది అధ్యాపకరంగమే. అందు నిలిచి, అందుడిరమే మానవసేవజేయు నితడు నిశ్చయింపవలసినది. స్కూల్ మేస్టరైన కెమల్ టర్కీకి నాథుడైనాడు. దక్షిణాఫ్రికాయం దున్నత పదవి నలంకరింపనరుగుచు, దేశసేవ కవకాశ మిచ్చుపట్ల నాపదవికంటె ఉపాధ్యాయవృత్తి తీసిపోదని నుడివి ఒకప్పుడు బోధకుడై యున్నందులకు శ్రీనివాసశాస్త్రి గర్వపడినాడు. తా నడుగువెట్టిన అధ్యాపకవృత్తియందు దిగ్వలయశోభను కాంచి, సంతృప్తినందక తన గమ్యస్థాన మదికాదని టెన్నిసన్ చిత్రించిన యులిసిస్‌వలె రెడ్డి అందుండి ముందుల కుఱికినాడు.

అసంతృప్తి వృద్ధికివలసిన ప్రధానశక్తి. తన ప్రస్తుతస్థితియందు తన గమ్యస్థానమును కాంచి కాళ్లు ముడుచుకొనువాడు మనుష్యత్వమును గోల్పడి శిలావిగ్రహమైపోవును. చిఱుతప్రాయమునుండియు నసంతృప్తిజూపునాతడే — సుఖము నెఱుగకపోయినను — పెద్దయైనపిదప మహాపురుషుడు కాజాలును. అసంతృప్తి యున్నగాని జిజ్ఞాస యుండదు; జిజ్ఞాసయున్నగాని అసంతృప్తియు నుండదు. ఎదుటి కొండపైగల ఆశయముపై కన్నుంచి, దానికి దిగువనుంటినను చింతపడు శక్తి గలవాడే ముందుకువచ్చును. "నేనెక్కడ? అదెక్కడ?" అనుకొనువాడు తనమనుష్యజన్మకు సిగ్గుదెచ్చును. దేవతవేయజాలని అంజ మనుష్యుడువేయును. మనుజుడైనయనంతరమే దేవత జగదీశు నుద్దేశించి "సోఽహమ్" అనగలడు అనంతవిశ్వము తలుపు తెఱచుకొని ముందు దోచుచుండ, గాళ్లు వెనుకకు విఱిచి దిడ్డిగంతబ్రతుకులో కాలక్షేపము చేయువాడు బండరాయియై పుట్టును. రవీంద్రు డనిన చిరపథికుడే ("The Eternal Wayfarer") మనుజుడనిపించుకొనును. స్థిరవాసమువ నక్కయుండువాడు గోరీయందలి వాడే యనినాడు రవీంద్రుడు. † కాని మానవుడు కన్ను

* రెడ్డికి న్యాయవాదవృత్తిపై మక్కువ యుండెడిది. ఈతనికి చక్కని వాదనాకౌశల మున్నది. కాని, నిలుకడలేనివాడు కావున నందు విజయమందువాడుకాడు. ఏ ఇండియాకౌన్సిల్ మీదనో కన్నువేసి నెగ్గునాడేమో! లేక ఏ స్కాట్‌వలెనో కలమునే శరణ్యము జేసికొని యుండునేమో!

† Tired and wornout those who abandon the road and build themselves a permanent house have in fact built their mausoleums. Animals have their lairs but man has taken the road. Those who are great among men are the road-builders and the path-finders."

—Rabindranath Tagore.

తెలచి ముందులకు నడువవలెను. కంటికి గంతలుకట్టు కొని ఎగిరెగిరిపడుచో అతడు కాళ్లు విఱుచుకొనును. పరుగెత్తవలెనను కాంక్ష యుండవలసినదే! ఈ కాంక్షకు సంవరణశక్తి యుండుట అనివార్యము. గంతు వేయు హృదయమును పగ్గముతో లాగు మేధస్సున్నది కావుననే, మనుజుడు ద్విపదపంక్తులుపోలు అడుగులు వేయుచు అగ్రసరుడగుచున్నాడు. రాగాలాపనమును శోధింపుడు. వేగసంవరణాలు కలిసియేకదా మాధుర్యమును కురిపించును. ఈ రెండుగుణములను సమన్వయము చేయగలవాడే వృద్ధిసిద్ధిగాంచును. మిల్టన్‌కవి భావిగమ్యస్థానమును చేరవలెనని పసితనమునుండియు నాతురపడువాడు. ఇంకను దానేమి చేయలేదని ఇరువది మూడవయేడున వాపోయినాడు. (Vide: Milton's "On his arriving at the age of twenty-three") కాని, "శాంతిల్లుము; తడయుము" అని యావేగభరితమైన హృదయమున జేయివేసినాడు. బాయిలర్‌లోని స్టీమ్‌వలె ఈయావేగము అతనియందణగి యున్నది. మిల్టను దానిట్లు ముప్పదిమూడేండ్లు అణపగలిగినాడు. రాజకీయములందు కర్తవ్యమును నెఱపుచు మన్నుపై గాలుంచియు, నక్షత్రముపై కన్నుంచినాడు. ఏబదేండ్లు కడచినపిదప తారవంటి తన ఆశయములు విరిసినమల్లెమొగ్గను త్రుంపునట్లు త్రుంపినాడు. వసుంధరకు Paradise Lost ఇచ్చి, ధనంజయుడైనాడు. ఈతని యావేగము విచ్చలవిడిగ బర్వెత్తగడగు ఇంద్రియహయమువలె ముందుల కుఱాయింపలేదు. జితేంద్రియునివలె ఇతడు కళ్లెమును గట్టిగ బట్టినాడు. తుదకు విజయకేతన మెత్తినాడు. ఆంగ్ల రాజ్యాంగ విధానములో Checks and balances పద్ధతి చాల దొడ్డది. ఇది మనుష్యజీవనమందుగూడ నుండుట మేలు. రెడ్డి ఆవేశముగల అదృష్టవంతుడు. కాని సంవరణశక్తిలేని దురదృష్టవంతుడు. Checks and balances ఇతనికి కల్లలు. కలలోని చెత్తప్రోగులు. ఇతని హృదయమందలి ఇంజన్ ఒకబద్దెను, ఒక బాటను పట్టలేదు. చరచరపోవుటే రెడ్డి యెరుగును. చక్కనైన అసంతృప్తిని స్వాధీనమందుంచుకొని దానిచే నీతడెంతేనియాడిగము జేయించుకొనకలసినది. కాని, దాని నీతడు బలియనిచ్చినాడు. అది యాతని బిరబిరలాగినది. ఈ లాగుడులో రెడ్డి బోర్లపడినాడు. మైసూరునుండి మదరాసునకును, మదరాసునుండి బెజవాడకును బిరబిరలాగబడిన రెడ్డి చిత్తూరులో నేమైనాడు? అధ్యాపకవృత్తికి ఉద్వాసమని రాజకీయములందడుగిడినాడు. ఇటు జస్టిస్‌పార్టీముక్కుకు సూటిగా పిడికిలి చూపినాడు; అటు స్వరాజ్యపార్టీని 'బహు పరాక్' అనినాడు. నాడీతడు చేసిన దేవసేవ రామారాయణి గారి గుండెలో రామ్మఠోలు వాయించుటే! ఉలికి పడిన పానుగల్లుప్రభువు రెడ్డినాడి నెఱుగును. "ఆంధ్ర విశ్వకళాపరిషత్ స్వయంవర మహోత్సవము! నిన్నది ముందే వరించినది. ఇదిగో విరిదండ. ఇక రంగస్థలమును వీడి దానిని కౌగిటజేర్చుకొమ్ము" అని గడుసు పానుగల్ పలికినంతనే దానిపై రెడ్డి వాడిమాపుకాక వారచూపు పాటించినాడు. రాజకీయములను లుంగజుట్టి మెడ్రాసు బీచియొడ్డున పాఱవేసి పాలకియెక్కి బెజవాడ పయనమైనాడు. కొంతకాలమందు 'తధికిణతోం!' అనినాడు. మరల నుఱుకు! దానితో పిల్లిమంత్రము !! తన యూపాధ్యక్షపదవిని పళ్లెములో పెట్టి "మీ వాయనము మీరు పుచ్చుకొను"డని మదరాసుగవర్నరుకు దాని నప్పగించినాడు. నాడీతడు కాంగ్రెస్‌ఛత్రముక్రింద నిలిచి, కాంగ్రెసుశంఖధ్వానము విని, కాంగ్రెసు విజయమును కాంక్షించి, కాంగ్రెసుసేనయందలి యోధుడై అగ్రసరుడైయున్నచో దశదిశలీతని చరణములమ్రోల మోకరించి యుండును. శూద్రజాతీయులత్యాచారమునకు గుఱియైరని రాగాలాపన మొనరించినాడు గాని (Vide: Reddy's letter of resignation) వారికి బుజమొడ్డి వారివలె సేవామహత్త్వమును చూపినాడుకాడు. చిత్తూరుగూట్లో దూరినాడు. ఇది Tragy-comedy కాదా? రెడ్డికి పట్టుదలసున్నయని ఇవి తెలుపుటలేదా? దేశసేవ తన ముఖ్యాశయమని యెంచిన పెద్దమనిషియైనచో, రెండువేల గచ్చకాయల కపేక్షించి ఇతరుద్యోగమున వేలు పెట్టకుండువాడు. విద్యాంగణమే తన క్రియాంగణమని నిశ్చయించినచో

రాజకీయరంగములోనికి పిప్పిగంతు వేయకుండువాడు. తుదకు దీనికిని దానికిని మారముకాకుండువాడు. పరుగులాటలో రెడ్డిజీవనమందలి అమూల్య భాగము వ్యర్థమైపోయినది. రెడ్డిప్రజ్ఞ రెడ్డికి గాని, ఆతని గన్న దేశమునకుగాని ఉపయోగించినదికాదు. సాహిత్యమునే నమ్మికొనియుండుచో, రెడ్డి రవీంద్రున కెనయైనవృద్ధ కవీంద్రు డగువాడు; విద్యారంగమే తన జీవనరంగమని యెంచినచో, రెండవ రాధాకృష్ణ దయ్యెడివాడు; హృదయపూర్వకముగ రాజకీయములందే తనువు గడపి యున్నచో అపర గోఖలే యయ్యెడివాడు. తుదకు రెడ్డి ఎవ్వరైనాడు? ఏమైనాడు?

పదములమీది నమ్మకము గోల్పడి, రెడ్డి పక్షములు గట్టికొని యెగురమాచినాడు. ఆతని నిఘంటువున 'యోజన' యను పదమే లేదు. అడుగులు లెక్కించుట యెట్లు కూడదో, కనురెప్పల నెత్తక నడచుటయు నట్లే కూడదుకదా! హేమ్‌లెట్‌వలె నూగిసలాడుట కూడదు; తెంపుతెగువలులేక అల్లాడుచుంట తగదు. కాని చింతను పరిశీలనమునకు ఆంక్షబెట్టు టేటిపాడి? ఈయాంక్షవలన రెడ్డి వృద్ధినందలేకపోయెను. ఈతడు చేయివెట్టిన కృషియు నభివృద్ధి నెఱిగినదికాదు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు ఉపాధ్యక్షుడై రెడ్డి విజయడిండిమము మ్రోగించినాడా? తన గుడుగుడుకుంచమును పరిషత్తునకు కట్టవలచినాడు. అనేకకేంద్రస్థలము లీతని తలచుట్టు గిఱ్ఱుమనినవి! తొలుత నీతనిదృష్టి రాజమంద్రిపై బడినది. రాజమంద్రి ఆంధ్రుల ఆక్స్‌ఫర్డ్. ఆయూరుమున్నులో మిన్నువెలుగు లున్నవి. అందుండి దృష్టిమరల్చి, రెడ్డి ఇందందుల జిక్కుకొనినాడు. నోటగల లంకచుట్టలు మొగలుగములను సృష్టించుచుండ "మేఘసందేశము" లూహించుచు, నాగపురమునుండి గల్లుగల్లుమని వచ్చిన ముప్పదిలక్షలను వెనుకకు బట్టించినాడు. విశ్వకళాపరిషత్తులో తెలుగునకు ప్రాముఖ్యమిచ్చి పాపము కొంతపున్నెము గట్టుకొనినాడు. కాని సహస్రగాయత్రి జపించి ఆంధ్రాభ్యుదయమునకు ఆటపందిరికాదగు సంస్థయందు మహత్త్వ పటుత్వములను నెలకొలిపినాడుకాడు. ఆశుతోషుశక్తి కొంత ఇతనికి కలదని రామణ అనినాడు. కాని ఆతనికి గల వ్రతనిష్ఠ ఇతనికి లేనందున ఇత డాంధ్రకళాపరిషత్తునొసలున గళ్యాణతిలకమును దిద్దలేకపోయినాడు. ఇతడు బ్రహ్మచారియేకాని దీక్ష నెఱుగడు. దీక్షయందేకదా ఘనకార్యములు చేజిక్కిన మేరువలగును!

రెడ్డిని ప్రశస్తిశిఖరముపై కాలుమోపనీయని ప్రతికూలశక్తులు కొన్ని ఆతని ప్రకృతియందున్నవి. పలుకుబడి ఆత డపేక్షింపలేదు. మంచిమాట జేసికొనుట రెడ్డి యెఱుగడు. యశస్సిలకులకుండు తొలిగుణము ప్రజల మనసులను రంజింపజేయగలుగుట. నిర్భాగ్యుల మొఱకు తనమునకు తాళమువేయక కుసుమకేసరములు తుమ్మెదల నాకర్షించులీల మేలిపలుకులచే వారియుల్లము లాకర్షించి బుద్ధిమంతుడు సంఘమందలి కర్తవ్యమును నెఱపుకొనును. నక్షత్రవీథియందు వెలుంగువాడయ్యు మిల్టన్ కవిచంద్రుడు ధూళ్యవలుంఠితులైన పేదలందు నిలిచినాడని వర్డ్స్‌వర్త్ పలికినాడు (Vide : Wordsworth's "London 1802") ఇట్టిగుణమును జూపగల మిల్టను లెందఱో మానవసంఘమందు తలసూపలేదు. కవితాశక్తి గల మానవులు సాధారణముగా విహంగములట్లు మేఘవీథులందే యెగయుచుందురు. తన ఘనప్రజ్ఞయందతి విశ్వాసముగల రెడ్డి తనభావన సౌధాగ్రమునుండి దిగి రవీంద్రుడనిన "రాలుగొట్టువాని" తోను, నడుమొగ్గి సూర్యాతపమున గృషిసల్పు (Vide: Tagore's "Gitanjali") వానితోను చేతులు కలుపుకొనలేదు. వానికి తలలో నాల్క కాలేదు.

మాటయూ కాన్సెపైరుమ్మ పగతురను పెంచుకొనడు కాని, మైత్రికాంక్ష లేక స్వయంనిర్మితస్వర్గమందే వసింపనెంచువాడు కావున, రామేశ్వరలింగమువలె రెడ్డి జనసామాన్యమునకు తాకరానివాడైనాడు. పామరులతో కలియకపోవుట అట్లుండ పండితులతోడనైన ప్రగాఢసంబంధము లేర్పఱుచుకొనుట కీతడు మక్కువపడడు. నవగ్రహములు పరస్పరశక్తివిజృంభణముకతననే కాంతిలుచున్నవి; నిర్దిష్టవలయమున చలించుచున్నవి. సూర్యతేజము నెఱుగనిచో, చంద్రుడు విశ్వవిఖ్యాతి నెఱిగియుండునా? తనకు జ్ఞానభిక్ష

నిచ్చువానికిని, తానిచ్చు విజ్ఞానభిక్ష నంది, అందలి తీయందనము గ్రోలగలవానికిని నడుమ నిలుచు మనీషియే ప్రతిభ నందగలడు. మహాపురుషుల నారాధించునాతడే పల్వురు మహాపురుషుల కారాధ్యదేవత యగును. తాను మహాపురుషుడని పృథ్వికి తెలుపగల మహాపురుషులకును, తన సత్తువను గుర్తించి, తన మహత్త్వమును వ్యక్తీకరించి, ప్రజలదృష్టి నాకర్షింపగల సహృదయులకును, తనచేవ చూచి తన కంజలిఘటించు జనవితానమునకును దూరమై, తనకుదానై యుండువాడు ఎంత ప్రజ్ఞగలవాడైననేమి, సమీరస్పర్శ నెఱుగక ఒ[illegible] బ్రదుకీడ్చు మల్లికవలె, అడవియందు మసల కేగిన వెన్నెలవలె, కడలికడుపున దాగొను రతనమువలె, హృదీశ్వరి నెఱుగని రసపిపాసువువలె వ్యర్థజీవి యగును. వ్యర్థజీవులైన ప్రజ్ఞాధురంధరులలో రెడ్డి అగ్రాసనాధిపతి యగుట అబ్బురముకాదు.

రెడ్డిదేశసేవ ఈవలలో రెడ్డి భాషాలంకారములందే తళ్కొత్తినది. దేశసేవ ఇతనికి చక్కనిభావమే.

"...............there ever rolls
A vast idea before me."

అని కీట్సుమహాకవి పలికినట్లే రెడ్డియును పలుకుచుండును. ఇతడు కీట్సు తెలిపిన "Glorious denizen" అయియుండనోపు. కాని శిలువను పూనగలిగిన యోగి కాడు, యోధుడును కాడు. ఆవేశము వచ్చినపుడు అమృతవర్షధారలట్లు చక్కని పలుకులను కురిపింపగలడు. పండితు లీతని భావములందలి మాధుర్యమును గ్రహించి గ్రోలుదురు; పామరుల కీతడు దురూహ్యుడు. తమవలె కాయకష్టములు పడి, తమకై కన్నీరోడ్చి, తమభారమును కొంతమోసి, తమ్ముద్ధరించువారినే వీరెఱుగుదురు. వెనుక ఓట్లకై రెడ్డి సంచారము చేసినపుడు సుబ్రహ్మణ్యరెడ్డిగారి కొడుకనియే ప్రజలు తనకు ఓటిచ్చినట్లు అతడు తెలుపుకొనినాడు. కేంబ్రిడ్జిలో పూలకిరీటమును దాల్చినవ్యక్తి ఇంకను తోడిజాతీయుల అనురాగమాల్యము నందజాలకపోయినాడు.

"Shelly was a poet of pure impulse" అని బేజ్‌హాట్ పలికినాడు. "Reddy was a patriot of pure impulse" అనినను అనవచ్చును. చక్కని తలపు మనసున మెఱయు ముహూర్తమున ఉన్నత భావనావీథియందెగసి, అది యారినంతనే కాళ్లుముడుచుకొనుట కవికితగునేమోకాని కర్మవీరునకుతగదు. ప్రజలు కవిచంద్రుని పల్కులను కనుల నద్దికొందురు గాని ఆతని ననుగమింపజాలరు. కర్మవీరుని అడుగుదమ్ములు పుడికి, వాని యడుగుజాడలందు నడతురు. కవియైన రెడ్డి, ఇంక కర్మవీరుడు కావలెను.

చాలకాలమునుండి రెడ్డికి కాంగ్రెసుపై అభిమానముండుట నిస్సంశయము. కాంగ్రెసుఆశయములపై ఈతనికి మక్కువయున్నది; కాంగ్రెసునాయకులయెడల నాదరమున్నది. కొంతకాల ముదాసీనుడై ఇటీవల ఇతడు తనహృదయమును సమ్మరించినాడు; కాంగ్రెసుతత్త్వమును ప్రస్తుతించినాడు. ఈతని నుడువులు ఆధునాతన సారస్వతమున శిలాక్షరములు కాగలవు. * సత్యమూర్తివలె కడచిన ఎన్నికలందు అభ్యర్థియై నిలిచి ఈతడు నెగ్గవలసినది. ఈతడు అసెంబ్లీలో ప్రవేశించుచో, అందలికంబములు రెడ్డిపల్కులకు వీనుదోసిల్లొగ్గి తనివార హాయిని జుఱ్ఱగలవు. లాఠీదెబ్బలు

* "It (ie. the congress) has imbued the ashes of our civilisation with life, and more than life, spirit, spirit of patriotic courage and adventure."

"It may suffer defeat, as Abhimanya did, but never disgrace, and its spirit will always remain different."

"The Congress is the only party of patriotic action in the country though other parties may well claim patriotic feelings and desires."

(Vide: Mr. C. R. Reddy's "Appeal to Voters", Hindu, Oct. 15, 1934)

తినిన అంగప్రత్యంగములును, కైదులందుడికిన మనసులును, వట్టికన్నీళ్లనుకాక భారతాంబకై ఆయువును ధారవోయసమకట్టిన హృదయములును, దేశక్షేమమునకై నిక్కంపుత్యాగముచేసినపవిత్రాత్మలును మొన్నటియెన్నికలలో నెగ్గినవి. రెండువేలరూకల జీతమును గిరవాటువేసిన రెడ్డి త్యాగమే సలిపెను. వంగీయుడైనచో ఎట్టి లోపములు కలవాడైనను, ఈయొక్కక్రియకతన రెడ్డి పుష్పవృష్టిని పడయువాడు. కర్మవీరుడును, కండలు కోసి యిచ్చినవాడును కాదుకావున కడచిన యెన్నికలలో కాంగ్రెసు ఈతనికి ఓటుఅర్ఘ్య మిచ్చినది కాదు.

కర్షకసంతతివాడ నని ఇపుడు సగర్వమున రెడ్డి చెప్పుకొనుచున్నాడు.* కర్షకసంతతివాడ నని ఒకానొకప్పుడు ఒకసహకారమహాసభ కధ్యక్షుడైన కూర్మారెడ్డి చెప్పుకొనెను. వీరి భావములందు స్వర్గసౌందర్యమున్నది. భారతదేశముపైబడిన బరువునంతను మోయువారు వీరిక్వర కులజులే. నేడెముకల ప్రోవులై యున్నవారును వీరి కుగ్గుపాలిచ్చినవారే. వీరి జాతియందు జ్యోతులై వెలుగు నీమనీషు లీవఱలో వీరి నాగళ్లను, వీరి తప్పెగోలలను పట్టినారు కారు; వీరికై చెమ్మటలోడ్చినారుకారు. రామలింగారెడ్డిహృదయ మిపుడు కొంచెము కదలినట్లు తోచుచున్నది. నిరుపేదలపట్ల నెఱపవలయు కర్తవ్యముపై కన్ను వేసినాడు.† నేతగాడ ననియు, సేద్యకాడననియు గాంధిజీ చెప్పుకొనెను. చెప్పినదానిని ప్రత్యక్షజీవనమున జూపినాడు.

సాహితీకలమాన్నమునకు తోడుగ సేవామృతమును తన దేశీయుల కిక రెడ్డి వడ్డింపగలడా?

రామలింగారెడ్డి ఇపుడిపుడే ఏబదవయేట గాలువెట్టినాడు. విశాలవిహాయసమువలె భావికాల మీతని కనులెదుట విప్పారియున్నది. రెడ్డి నలుతట్టుల బరికించుచున్నాడు.

నేటి రాజకీయములందు ఎండవానలు కురియుచున్నవి. వేసవిదినములుపోలు రిఫారములతో నెండదెబ్బ కూడ పడుచున్నది. నిర్మాణక్రియకై నడుము గట్టవలెనని గాంధిప్రభృతులు కృతనిశ్చయులైరి. కాని వీరి నిశ్చితముపై వేడిబొట్లులు రాలుచున్నవి. వీరి శాంతిమంత్రముపై పిడుగులుపోలు గర్జనలు దొరలుచున్నవి. దుర్భరదుఃఖదారిద్ర్యములచే పొగులుచు దివ్వన నెగిరివచ్చు క్రొత్తగాడ్పుల కుస్సురస్సు రనక భారతాంబ ప్రేమతారకమునే జపించుచున్నది. ఈతారకమహత్త్వమును నిరూపించుట భారతీయుల కర్తవ్యము. విద్యార్థుల సేవను గుఱించి, రెడ్డి చక్కని ప్రణాళికను ప్రకటించినాడు. వారికి సేనాపతియై, గాంధిజీకి కుడిభుజమై ఐకమైన నితడు భారత పునరుద్ధరణమునకై శ్రమించునా? "పద్మప్రభాస"నుండి చరచర నడచివచ్చి మహత్తరమైన తన కర్తవ్యమును నెఱపుకొనునా? ప్రపంచశాంతిని నెలకొలుపజాలునది ఒక్క భారతభూమి యని నిరూపించునా? ఉత్తమాశయముల కంఠములకు కట్టముంచి రెడ్డి జేగంటలు కట్టగలడా?

---

* "I am by birth and love of occupation a member of the agricultural community." (Vide: Mr. C. R. Reddy's article, "Hindu" December 6, 1934.)

† It is the higher call of humanity.

"Humanity towards our starving helpless masses." Mr. C. R. Reddy.

# ఆంధ్రవాచస్పత్యము*

అయల సోమయాజుల సుబ్బారావు

మన యాంధ్రవాఙ్మయమున భాషాభ్యాసకులకు నానార్థముల దెల్పు నిఘంటువు లేక తీరనిలోపమై యుండెడిది. అద్దానిని దీర్పసమకట్టి బ్రహ్మశ్రీ సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమను కోశమును సమకూర్చి యాంధ్రలోకమునకు మహోపకారము గావించిరి. ఇయ్యది పదమును సులభముగ జూచుకొనుటకు దగు నవకాశమును గలిగియున్నది; నానార్థములను, గూఢార్థములకు బ్రయోగములను జూపుచున్నది. ఇటీవల గొన్ని నిఘంటువులు ప్రకటితమై ప్రచారములోనున్నవి. ఓగిరాల జగన్నాథకవిసంకలితమగు "ఆంధ్రపద పారిజాతము" అను శుద్ధాంధ్రనిఘంటువును, మహాకాళి సుబ్బారాయుడుగారి "శబ్దార్థచంద్రిక" యు మొదలగున వెన్నియేని గలవు. ఇంకను ఆంధ్రసాహిత్యపరిషత్తువారు "సూర్యరాయాంధ్రనిఘంటువు" అనునొక్క యమూల్య కోశరాజమును సమకూర్చుచున్నారు. వావిళ్లవారుకూడ ఒక నిఘంటువును వ్రాయించుచున్నారు. ఇవికూడ పదమును సులభముగ జూచుకొనుటకు నకారాదిగ నుండి నానార్థములను, గూఢార్థములకు బ్రయోగములను జూపునేగాని యొక్కటియు బర్యాయపదంబుల జూపదు. అట్టిలోపము దీర్ప బ్రహ్మశ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిలవారు "లక్ష్మీనారాయణీయ" మను శుద్ధాంధ్రప్రతిపదార్థపర్యాయపదనిఘంటు వొకటి వ్రాసియున్నారు. ఇప్పుడు వారిపుత్రులగు బ్రహ్మశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిలవారుభయభాషలయందును పర్యాయపద నిఘంటు వొకటి వ్రాయుచున్నారు. ఇందొక్కొక్క శబ్దముంగూర్చి యెన్నెన్ని విశేషములు తెలిసికొనవలసియుండునో యవియన్నియు గరతలామలకముగ నొసగబడియున్నవి. ఇది యాంధ్ర సారస్వతమునకు గొప్ప లాభము. ఇందున్న విశేష మితరనిఘంటువులు వేనియందును లేదు. ఇందపారమగు సంస్కృత శబ్దజాలమును, అనంతమగు నాంధ్రశబ్దజాలమునుగూడ బూర్తిగ గలవు. అయ్యవి శబ్దరత్నాకరాదులవలె నకారాదిగ నుండుటచే జూచుకొనువారికి జాల నుపయుక్తముగ నుండును. ఒక్కొక్క శబ్దమున, కెన్నెన్ని యర్థములు గలవో అవియన్నియు నిందీయబడినవి. అంతియగాక యొక్కొక్క పదమునకెన్నెన్ని పర్యాయపదము లుభయభాషలయందును గలవో అవియన్నియు నిందీయబడియున్నవి. ప్రతిపదమునకుగూడ పర్యాయ

* నిఘంటుకర్త: కొట్ర శ్యామల కామశాస్త్రిగారు, కరప, కాకినాడ.
మొత్త మిరువదియైదు సంపుటములు వెలువడును. సంపుట మొక్క రూపాయ.

పదములపట్టిక యిచ్చుచుండిన గ్రంథము విపులమై మోయుటకు గూడ నలవిగాకుండును. కావున నాలోపము దీర్చుటకై పర్యాయగణంబుల నొక ప్రధానపదముకడ నీయబడి తక్కిన పదములకడ పర్యాయపదములకు ప్రధాన పదము జూచుకొనవలసినదిగా ఇందు గుర్తింపబడినది. ఎట్లన, 'అంశము' అనుపదము చూడుడు.—

"అంశము. సం. వి. అ. పుం. 1. పంపకము: చూ, భాగము. 1; 2. పాలు: చూ, వంతు. 5; 3. కిరణము: చూ, మయూఖము. 1."

అనగా నొకటవయర్థమగు 'పంపకము' నకు 'భాగము' అనుపదమునందొకటవయర్థము చూడవలయునని తెలియుచున్నది. ఇట్లే ప్రతిపదమును పర్యాయపదముల దెలిసికొనుటకై 'చూ' అనుగుర్తుతో పర్యాయపదములున్న పదము తెలుపబడియున్నది. మఱియు నిందు తత్సమరూపమునకు తద్భవరూపమును, తద్భవరూపమునకు తత్సమరూపమును గనుపఱుపబడియున్నవి. ఎట్లన, 'అట్టశాల' చూడుడు. ఆ పద మిం దిట్లున్నది.—

"అట్టశాల. సం. వి. ఆ. స్త్రీ = అడసాల. పాకస్థానము."

మఱియు

"అడసాల. వై. వి. = అట్టశాలా. వంటయిల్లు."

ఇటులనే 'అడవి', 'అంబే' మొదలగు పదములు పెక్కులు గలవు. మఱియు నిందు పారిభాషికపదములును, జాతీయపదములును, న్యాయములును తెలుపబడియున్నవి. ఎట్లన:— పారిభాషికపదములకు 'అండదశ' చూడుడు. అం దిట్లున్నది.—

"అండదశ. పా. గ్రుడ్డుఆకారమునందును, పరిణామమునందును ఆయాజాతులందుఁ గల భేదము."

ఇట్లే 'అండపోషకయుతులు', 'అంతరకుసుమ', 'అంతరిక్షవిద్యాశాల' మున్నగునవి యుదాహరణములు. జాతీయములకు 'అరచేతికిఁ బండ్లువచ్చు.' ఎట్లన:—

"అరచేతికిఁబండ్లువచ్చు. జా. ఎక్కువ శౌర్యము వచ్చుట. రూ. అఱచేతికిఁ బండ్లు వచ్చు. "కం. అఱవు లుడిగిపోపోసీ, యఱచేతం బండ్లువచ్చినప్పుడు నుమ్మీం, గఱచెదపుగాని.—కళాపూర్ణోదయము."

ఇట్లే "అర చేతిలో నిమ్మపండు" మొదలగునవి యుదాహరణములు. న్యాయములకు 'అంకోలబీజన్యాయము.' ఎట్లన:—

"అంకోలబీజన్యాయము. సం. వి. అ. పుం. నేలకురాలిన ఊడుగువిత్తనములు ఉఱుము వినఁబడఁగానే మఱల మ్రానును అంటినరీతి." ఇట్లే "అంధపంగున్యాయము", "అంధకరదీపికా న్యాయము" మున్నగునవి యుదాహరణములు.

మఱియు నాయాపదములచే బోధింపబడు పదార్థముల రూపపటములుగూడ నిందొనగబడియున్నవి. ఎట్లన:— "అక్షాంశరేఖలు", "అనాసపండు" మొదలగువానికి వాటియర్థములవ్రాయుచు తద్రూపపటములుగూడ నొసగబడియున్నవి. ఇది యాంగ్లనిఘంటువులపద్ధతి నవలంబింపబడినది. మఱియు వ్యాకరణపదములుగూడ నిందొసగబడియున్నవి. ఎట్లన :—"అడ్డాదులు." ఇందిట్లున్నది.—

"అడ్డాదులు. పా. అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు. అప్పాదులకు విభాషనగు. ఉ.—అడ్డము + ఇంచు = అడ్డగించు. మువర్ణమునకు లోపము. ఇట్లు ఓర-ఓరగించు; చిత్తము-చిత్తగించు; ఇత్యాదులు అడ్డాదులు. అప్ప-అప్పగించు-అప్పించు. అప్ప - ఒప్ప-తల్లము ఇత్యాదులు అప్పాదులు. (తత్స) కోపము-కోపించు-కోపగించుననియు నగు."

ఇట్లే "అపాదానము", "అరసున్న" మొదలగునవి. మఱియు కవిత్వము నభ్యసించువారలకు సుబోధకమగునటుల వృత్తములు, తల్లక్షణములు నిందొసగబడియున్నవి. ఎట్లన :—'అపరాజితము.' ఇందిట్లున్నది :—

"అపరాజితము. సం. వి. అ. పుం. 1. ఇంద్రునితేరు: చూ, శకటము. 1: పా. 2. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్కపాదమున న, న, ర, స, వగణములు గలిగి తొమ్మిదవ యక్షరము యతిగాఁగల పదునాలుగవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—ననరసలగలొందిననవవిశ్రమం." ఇట్లే "అసంబాధ", "ఇంద్రవంశము", "ఉత్పలమాల" మొదలగునవి యుదాహరణములు.

మఱియు జ్యోతిషపదములును, వైద్యపదములును, ధర్మశాస్త్రపదములును మొదలగు విశేషము లిందు సమకూర్చి యాంధ్రభాషకు మహోపకార మొనరించిన శ్రీ శాస్త్రులవారి నాంధ్రభాషాప్రియు లెప్పుడును మఱువకుందురు. ఇది యాంధ్రభాషాయోషామణికి నవీనాలంకారము.

ఇట్టి యమూల్యగ్రంథముద్రణమునకై భాషాపోషకులు చేయూతనొసగి శ్రీశాస్త్రులవారియందును, వారినిఘంటురాజమునందును గౌరవాదరాభిమానము లుంచి ధన్యులు కాగలరని నమ్ముచున్నాడను. ఇట్టిపని నెంతశ్రమయైనను జేయబూనినందులకు శ్రీశాస్త్రులవారెంతయు వందనీయులు. వారిని భగవానుడాయురారోగ్యంబుల నిచ్చి రక్షించు గాక! ఇంక నిట్టి సద్గ్రంథరాజములు ప్రకటించి తెలుగుతల్లి వాత్సల్యము బడయునట్లు జేయుగాక!!

---

# నక్షత్రశక్తికి మూలము: ద్రవ్యవినాశం

కాళీపట్నపు కొండయ్య

ఆకాశంలో అనవరతంగా ప్రకాశించే నక్షత్రాల అపారమైన శక్తికి మూలమేమిటి అనేసమస్య ఇటీవలివరకూ సహేతుకంగా పరిష్కారంకాలేదు. ద్రవ్యతత్త్వాన్ని గురించి ఈమధ్యజరిగిన నూతనపరిశోధనల వల్ల అనేకవిచిత్రవిషయాలు బయల్పడ్డాయి. ఈనూతన విషయాలు ఆధారంగా తీసుకొని, నక్షత్రశక్తికి మూల మేమిటి అనేప్రశ్నకు సమాధానం ఆలోచిస్తే కొంత వరకు సంతృప్తికరమైన ఫలితం చేకూరుతుంది.

రేడియోధార్మిక పరమాణువులు (Radio-active atoms) మన ప్రమేయ మేమీ లేకుండా, వాటంతట అవి విచ్ఛిన్నమై నూతనతత్త్వాలుగా పరివర్తనపొందే సందర్భంలో కొంతద్రవ్యం (matter) ప్రకాశముగా పరివర్తనజెందుతుందని విశదమైంది. దీనికి ముఖ్యమైన తార్కాణ యురేనియంధాతువు అనేకపరివర్తనలు జెంది, తుట్టతుదకు సీసముగా మారడంలో కనపడుతుంది. మనభూమిమీద యురేనియం ఈవిధంగా సీసముగా పరివర్తనకావడంలో మొత్తము మీద ౪౦౦౦ లలో ౧ భాగంవంతున ద్రవ్యం మాయమై, తత్తుల్యమైన ప్రకాశరూపంగా ప్రత్యక్ష మవుతుంది. కాని సూర్యునిలో, ప్రకాశరూపంగా మార్పు జెందే ద్రవ్యపరిమితి, ఇంతకంటె చాలా ఎక్కువగా ఉంటుందని చెప్పడానికి సావకాశ ముంది. సూర్యగోళంలో ధనఋణవిద్యుత్కణాలు (ప్రోటానులు, ఎలెక్ట్రానులు) సంయోగం చెంది అనేకవిధ పరమాణువులను కలుగజేసే సందర్భంలో పైని పేర్కొన్న ద్రవ్య-శక్తి పరివర్తన కలుగుతూ ఉండవచ్చునని మొదట పెర్రాన్స్, ఎడ్డింగ్టను మహాశయులు సూచించారు. హీలియం పరమాణూత్పత్తివలన బహిర్గతమయేశక్తిని లెక్కకట్టాడు ఎడ్డింగ్టను. హీలియం పరమాణువుయొక్క అంగములు నాలుగుప్రోటానులూ, నాలుగు ఎలెక్ట్రానులూను. అంటే సరిగా నాలుగు హైడ్రోజని పరమాణువులయొక్క అంగములని మనకు నిశ్చయంగా తెలుసును. నాలుగు ప్రోటానులూ, నాలుగు ఎలెక్ట్రానులూ లేశమాత్రమైనా ద్రవ్యనష్టం లేకుండా సంయోగం జెంది హీలియంపరమాణువును కలుగజేసేటట్టయితే హీలియంపరమాణువుయొక్క భారం హైడ్రోజనిపరమాణుభారానికి సరీగ్గానాలుగింతలుండాలి. హైడ్రోజనిపరమాణుభారం ౧ అనుకొంటే హీలియంపరమాణుభారం సరిగా నాలుగు కావాలి. కాని అట్లాలేదు. ౩.౯౭౦ మాత్రమే ఉంటోంది. సిద్ధాంతరీత్యా ఉండవలసిన భారానికీ (౪) ప్రత్యక్షంగా ఉన్న భారానికీ (౩.౯౭౦) ఉన్న ఈ తేడా (౪.౦౦-౩.౯౭౦ = .౦౩౦) నాలుగు హైడ్రోజనిపరమాణువుల కలయికవల్ల హీలియంపరమాణువు సంజనితమైనప్పుడు, ద్రవ్యరూపం నశించి, ప్రకాశ (శక్తి) రూపంగా వెలువడే ద్రవ్యపరిమితిని సూచిస్తుందని నిశ్చయమవుతుంది. ఈసందర్భంలో ౧౩౦ భాగాలకు ౧ భాగం ద్రవ్యభారం నష్టమవుతోంది. ఇది పైనివివరించిన రేడియోధార్మికపరివర్తనలో పోడగట్టే భారనష్టంకంటె (౪౦౦౦ లలో ఒకటి) చాలా అధికంగా ఉంది. కాని చాలా అధికమైన ఈశక్తి కూడా పూర్తిగా నక్షత్రశక్తికి మూలంకావడానికి సరిపడదు. ఆరంభంలో, పూర్తిగా హైడ్రోజనిభూయిష్ఠమైన సూర్యుడు పూర్తిగా హీలియంభూయిష్ఠమైన సూర్యుడుగా పరివర్తనఆయాడని ఊహించినప్పటికీ, ఆపరివర్తనవల్ల జనించిన మొత్తంశక్తి, సూర్యునికి పదివేలకోట్లసంవత్సరాల కాంతిప్రసరణానికి సరిపడే శక్తికిమాత్రం సరిపడుతుంది. అంటే, ప్రకృతంలో సూర్యుడు ప్రకాశిస్తూఉన్నప్రకారం, సూర్యుని జీవిత కాలం, పదివేలకోట్లసంవత్సరాలకు మించి ఉండడానికి అవకాశముండదు. కాని అనేకమైన ఇతరప్రమాణాల వల్ల సూర్యుని వయస్సు (అన్ని నక్షత్రాలవయస్సలూను) ఈసంఖ్యకు అనేక రెట్లు ఉండవలసిఉంది. అందు

చేత ప్రోటానుఎలెక్ట్రానుసంయోగ జనితమైన శక్తి నక్షత్రాల అపారమైనశక్తికి మూలంకాజాలదని చెప్ప వలసివస్తోంది.

యుగయుగాలనుంచి నిరంతరంగా ప్రకాశిస్తూ ఉన్న అసంఖ్యాకనక్షత్రాల అతిదీర్ఘమైన జీవితాలకు అవసరమైనశక్తి లభించడానికి ఒక్కటేమార్గం కనపడు తుంది. ఏమిటంటే పరిపూర్ణంగా ద్రవ్యం వినాశం చెందడము. ద్రవ్యవినాశం అనేమాట ముప్ఫయి నలభయి సంవత్సరాలకిందటి శాస్త్రజ్ఞులు కలలో నైనా తలపెట్టిఉండరు. మొన్న మొన్నటివరకూ ప్రకృతిశాస్త్రజ్ఞుడు, సంశయంలేకుండా నమ్మిన నియమాలలో ముఖ్యమైనది ద్రవ్య అవినాశ నియమం. ఈనాడుకూడా భౌతికశాస్త్రపుస్తకాలు కొన్నింటిలో ఈనియమం సవరణలేకుండానే కనబడుతుంది. ఇది వరలో విడివిడిగా చెప్పబడిన ద్రవ్య అవినాశకత్వం, శక్తిఅవినాశకత్వం అనే నియమాలు రెండూ శిథిలమై వాటిస్థానే ద్రవ్య - శక్తిఅవినాశకత్వం అనే ఒక్కనియ మం బయల్పడింది. ద్రవ్యవినాశం అన్నమాట నేటి ప్రకృతిశాస్త్రజ్ఞుని కలవరపెట్టడంలేదు మిగిలిన అన్ని నియమాలతోపాటూ అదీ యథాస్థానం పొందింది.

ద్రవ్యవినాశంవల్ల జనించే శక్తి అపారం. అనేక ప్రమాణాలవల్ల నక్షత్రశక్తికి మూలం ద్రవ్యవినాశమే అని చెప్పడానికి అవకాశం కలిగింది. నక్షత్రాల నిరం తర ప్రకాశానికీ, అతిదీర్ఘమైన వాటి జీవితాలకీ మూలా ధారం ద్రవ్యవినాశం అయిఉంటుందన్న అభిప్రాయం మొట్టమొదట ౧౯౦౪ సంవత్సరంలో సర్ జేమ్సు జీన్సు మహాశయుడు వెల్లడించాడు. ద్రవ్యవినాశంవల్ల ఉత్ప న్నమయే అతివిస్తారమైనశక్తి ఒక్కటిమాత్రమే నక్ష త్రాల దీర్ఘజీవితాలకు ఆధారమై ఉండడానికి అవకాశం ఉందని నిరూపించాడు జీన్సు. ఆమరుసటి సంవత్సరం లోనే పిన్నవయస్కుడైన అయిన్‌స్టయిను తన సాపేక్ష సిద్ధాంతం (Theory of Relativity) వివరించాడు. అందుమూలంగా శక్తిద్రవ్యాలకు పరస్పర సంబంధం ఏర్పడింది. ఇంతద్రవ్యం వినాశమయితే ఇంత శక్తి ఉత్పన్నమవుతుందని లెక్కకట్టడానికికూడా సూత్రం దొరికింది. వినాశంచెందిన పదార్థంయొక్క స్వభావ మేదైనప్పటికీ, ఒకగ్రాముద్రవ్యం వినాశంచెందితే, తత్ఫలితంగా ౯ × ౧౦,౦౦౦,౧౦౦,౦౦౦,౦౦౦, ౦౦౦,౦౦౦౦ ఎర్గులశక్తి ఉత్పన్నమవుతుందని తెలి సింది. ఈసూత్రం ఆధారంచేసుకొని పిమ్మట జీన్సు మహాశయుడు, ద్రవ్యవినాశపద్ధతిమూలంగా, నక్షత్రా లకు చేకూరే వయఃపరిమితులను లెక్కకట్టాడు. కొన్ని లక్షలకోట్ల సంవత్సరాలకాలం అని తేలింది కాని, అప్పటికింకా నక్షత్రాలవయస్సులు ఇంతదీర్ఘంగా ఉంటాయని తలంచడానికి తగిన ప్రమాణాలుదొరక లేదు. అందుచేత, అప్పట్లో, జీన్సుమహాశయునిభావం అసంగతంగానే కనపడింది. కాని, తరువాత లభించిన అనేక ఆధారాలవల్ల, నక్షత్రాలవయస్సులు, ద్రవ్య వినాశంవల్ల సిద్ధిస్తాయని, జీన్సుచెప్పిన కొన్నిలక్షల కోట్ల సంవత్సరాలపాటు అయివుంటాయని స్థిరపడింది. ప్రకృతంలో అనేకమంది శాస్త్రజ్ఞులు, ద్రవ్యవినా శమే నక్షత్రశక్తికి మూలమని విశ్వసిస్తున్నారు.

ద్రవ్యవినాశమన్నమాట ప్రాచీనభౌతిక విజ్ఞా నంలో విప్లవభావమనడం నిస్సంశయం. మొన్నమొన్న టి వరకూ ద్రవ్య అవినాశ సిద్ధాంతం పునాదిగాజేసి, భౌతికవిజ్ఞానంలో ఎన్నోసౌధాలు నిర్మించాము. అనేక భౌతికనియమాలలో ఇది అతిప్రాముఖ్యమైన నియమ మని నిర్ణయించాము. ఈనాడు కూడా, ఈనియమం ఋజువుచేయడానికి అనేక ప్రయోగాలు చూపిస్తాము. అతిసిసలుగా లెక్కలుకట్టి, ద్రవ్యం వినాశంచెందదు అని సిద్ధాంతం చేస్తాము. ఇదేవిధంగా శక్తిసందర్భం లో కూడాను. ద్రవ్యఅవినాశనియమం ప్రతిపాదించి నట్టే, అనేకప్రయోగాలుచేసి, లెక్కలుకట్టి, శక్తి వినాశం చెందదు అని సిద్ధాంతంచేశాము. కాని ప్రకృత భౌతికవిజ్ఞానంలో ఈరెండు నియమాలనూ కూడా విస ర్జించవలసివచ్చింది. ద్రవ్యం వినాశంచెందుతుందని ఒప్పుకోకతప్పనిస్థితి వచ్చింది. ఇట్లా అనడంచేత ఇంత వరకూ చేసినకృషి అంతా నిరర్థకమైందని భావించ

కూడదు. ఈనియమాలను ఋజువుచేయడానికి ఇదివరకు చేసిన అనేకప్రయోగాలు ఇప్పుడూ చేస్తున్నాము. ఇదివరకు ఏమాదిరిఫలితాలు లభించేవో ఇప్పుడూ అవే లభిస్తున్నాయి. ఈఫలితాలను ఆధారంచేసుకొని, పై రెండు నియమాలనూ, ఇదివరకువలెనే ఋజువు చేస్తున్నాము. కాని ఇదివరలో తెలియనివిషయాలు కొన్ని ఇప్పుడు తెలియడంవల్ల, పైరెండు నియమాలలోనూ ఉండే లోటు పూర్తికావడానికి అవకాశం ఏర్పడింది. ఈలోటు, నేను తెలిసిన అతిసూక్ష్మవిషయాల్లోనే వ్యక్తమవుతుంది కాని, మామూలు ప్రయోగాలలో ఎక్కడా రవంతైనా వ్యక్తం కాదు. అందుచేత చాలా కాలంనుంచి చేస్తూవున్న మామూలుప్రయోగాలు నేను చేసినప్పటికీ, మనకు వ్యక్తమయే లోటుకాని, ఆరెండు నియమాలల్లోనూ ఉండే అపరిపూర్ణత్వం కాని వ్యక్తం కావడానికి అవకాశంలేదు. కాని పరమాణువుల అంతర్భాగాలలో సంచరించవలసివచ్చినప్పుడుమట్టుకు ఈ రెండు నియమాలూ విడివిడిగా వర్తించవు. విడివిడిగా వీటిని భావించినంతసేపూ, వీటిల్లోగల అసంపూర్ణత పోదు. పరమాణుగర్భంలో వ్యక్తమయే విషయాలు బోధపడవలెనంటే, ఈరెండు నియమాలనూ ఒకటికింద మార్చవలసివస్తుంది. ద్రవ్యం, శక్తీ, అనేవి రెండూ వస్తుతః భిన్నమనేభావం విసర్జిస్తేనేకాని పరమాణువుల అంతరార్థం మనకు విశదంకాదు. వాటిరహస్యం వ్యక్తంకాదు. ద్రవ్య అవినాశం, శక్తి అవినాశం అనే విడివిడినియమాలకు తావులేదు పరమాణు గర్భంలో. ఈరెంటింటినీ ఏకంచేసి, వాటిస్థానే ద్రవ్య-శక్తిఅవినాశమనే ఏకనియమం ప్రతిష్ఠచేయాలి. మామూలు స్థూలప్రపంచంలో స్పష్టమయే ద్రవ్యశక్తిద్వైతభావమూ, తత్ఫలితమైన భిన్ననియమాలూ పరమాణు సూక్ష్మప్రపంచంలో కేవలం భ్రమమాత్రమే. ద్వైతభావం పూర్తిగా విసర్జిస్తేనేకాని సత్యతత్త్వం బోధపడదు. ఇంతేకాదు; పరమాణు సూక్ష్మప్రపంచంలోనే కాదు ఈద్వైతభావానికి తావులేకపోవడం, బ్రహ్మాండ స్థూలప్రపంచంలోకూడా దీనికి తావులేదు. అద్వైతసిద్ధాంతం అంగీకరిస్తేనేగాని బ్రహ్మాండతత్త్వం కూడా బోధపడదు. అనంతకోటి నక్షత్రలోకాల అతినిగూఢ రహస్యాలన్నీ బయటపెట్టాలంటే అద్వైతసిద్ధాంతమే మనకు శరణ్యం. ఈవిధంగా స్థూలసూక్ష్మభేదం లేకుండా, పరమాణు నక్షత్రతారతమ్యం లేకుండా, విశ్వమందంతటా వ్యక్తమయేది శక్తి-ద్రవ్య-అవినాభావమైన అద్వైతమేకాని, భిన్నత్వ ప్రతిపాదకమైన ద్వైతం కాదు.

శక్తిద్రవ్యాలకు అవినాభావం అన్నంతమాత్రంచేత, వ్యావహారికంలోకూడా వాటికి పరస్పరభిన్నత్వం లేదని కాదు. వస్తుతః వాటికి భేదంలేదన్నమాత్రం గ్రహించాలి. ఇదివరలో ఉష్ణం, ఒత్తిడీ, కాంతీ, విద్యుత్తూ మొదలయినవి భిన్నభిన్నశక్తులని భావించాము. కాని, చివరకు, అవన్నీ స్థూలదృష్టికి భిన్నభిన్నంగా కనపడినప్పటికీ, వస్తుతః ఏకశక్తియొక్క రూపాంతరాలుమాత్రమే అని గ్రహించాము. ఈవివిధ శక్తులన్నింటికీ, పరస్పర పరివర్తన యోగ్యత వ్యక్తం చేశాము. ఈభిన్నభిన్నశక్తులన్నింటికీ ఏకత్వం ప్రతిపాదించాము. వీటినన్నింటినీ ఏకశక్తికింద పరిగణించే, మొత్తం అన్నింటికీ కలిపి శక్తిఅవినాశనియమం ప్రతిపాదించాము.

ఇదేవిధం ద్రవ్యంవిషయంలోకూడాను. అసంఖ్యాకవిధములైన ద్రవ్యాన్ని చూచి, భిన్నభిన్నద్రవ్యాలని భ్రమపడ్డాము. కాని చివరకు వాటిభిన్నత్వంలో ఉండేరహస్యం బయటపెట్టాము. స్థూలదృష్టికి భిన్నభిన్నంగా కనపడే పదార్థాలన్నీ వస్తుతః ఏకద్రవ్యంయొక్క రూపాంతరాలని గ్రహించాము. ఈవిధంగా విశ్వంలోని అనంతభిన్నత్వమంతా రూపుమాపి, శక్తిద్రవ్యయుతమైన ద్వైతము ప్రతిపాదించాము. ఇదీ సత్యతత్త్వమని విశ్వసించాము. కాని పరస్పర సంబంధ రహితమైన ద్వైతభావం, చిరకాలం సంతృప్తికరం కాజాలదు. ఎంత ఉత్కృష్టమైనప్పటికీ, ద్వైతంలో అంతర్భూతమై ఉండకతప్పదు అసంతృప్తి. విడివిడిగా కనపడే ఈరెంటింటినీ ఆధారంచేసుకొనికాని పైకి ఎక్కలేము. కాని ఈరెంటినీ అతిక్రమించనంతవరకు

అసంతృప్తి తప్పదు. తుట్టతుదకు ద్రవ్య శక్తు లనే ఈద్వైతభావం అంతరింపజేశాము. అనంతభిన్నత్వం స్థూలదృష్టిఫలితంమాత్రమే కాని సత్యం కాదని నిర్ణయించినట్టుగానే, ఈద్రవ్యశక్తి భిన్నత్వంకూడా స్థూల దృష్టిఫలితమే అని వ్యక్తంజేశాము. గ్రాముద్రవ్యానికి ౯ × ౧౦ ^౨౦ ఎర్గులశక్తి అనే నిర్ణీతమైన మారకం రూపంగా, శక్తి ద్రవ్యాలకు, పరస్పర సంబంధం బయల్పడడంతోనే, ఇంతవరకూ స్థూల దృష్టితో పాటించిన వాటి భిన్నత్వం అంతరించి, ఏకత్వం వ్యక్తమయింది. ఈభావపరిణామం అంతా సక్రమమైనదే కాని, సరిగా యోచిస్తే, అందులో విప్లవకరమని చెప్పడానికి తగిన దేమీ లేదు.

ఈసిద్ధాంతాన్నిబట్టి ఆలోచిస్తే, ఈభూమిమీద ఏమూల, ఏకాలంలో, ఏక్రియలో వ్యక్తమయే శక్తి అయినప్పటికీ, ఏవిధమైన భేదప్రమేయమూ లేకుండా ఆయావత్ శక్తీ ఆరంభంలో సూర్యగోళంలో ప్రోటాను ఎలెక్ట్రానుల వినాశంవల్ల ఉత్పన్నమైనదని స్పష్టమవుతుంది. చిత్రవిచిత్రంగా జీవలక్షణాలు వికసించడానికి కారణమైనశక్తీ, అనంతకోటిజీవాల పోషణకు వలసిన ఆహారాది పదార్థోత్పత్తికి అవసరమైనశక్తీ, మానవుని బుద్ధివిశేషంవల్ల కల్పింపబడిన సకలవిధసౌకర్యప్రదమైన యంత్రసమూహాన్ని నడుపుట కగత్యమైన ఉష్ణవిద్యుదాదిశక్తీ, ఈమొదలయిన సకల శక్తులకూ మూలం సూర్యునిలో నిరంతర ద్రవ్యవినాశ జనితమైన అపారశక్తి అని విశదమవుతుంది. సూర్యుడూ, నక్షత్రాలూ ఉద్భవించిన మరుక్షణంనుంచీ అవిచ్ఛిన్నంగా ద్రవ్యవినాశం జరుగుతూఉండడంవల్లనే ప్రదర్శితమవుతోంది అతి విచిత్రమైన ఈవిశ్వనాటకం. ఈఅవిచ్ఛిన్న వినాశంవల్ల సూర్యునిలోనూ, నక్షత్రాలలోనూ ఉన్న ద్రవ్యం పూర్తిగా నశించిపోయి, ఈ విశ్వరంగంలో ప్రదర్శితమయే విచిత్రనాటకానికి భరతవాక్యం చెప్పవలసివచ్చే స్థితి చేరువకు వస్తోందని మనం విచారపడనక్కరలేదు. అనేకవిధసాధనా లుపయోగించి అతిదీర్ఘమైన కాలవాహినిలో ఎంతవెనుకవెనుకకు పోగలిగామో, అంతకంటె అధికంగానే కాలప్రవాహంలో ముందుముందుకు తేలిపోవడానికి అవకాశం ఉండడంచేత మనం ధైర్యం వహించవచ్చు.

సూర్యునిలోనూ, నక్షత్రాలలోనూ అంతర్యాభ్యతమైన శక్తి ఒకపట్టున అంత మవుతుం దని భయంలేదు. ఇప్పటికి ౬ లేక ౭ లక్షలకోట్ల సంవత్సరాలనుంచి అవిచ్ఛిన్నంగా ప్రకాశిస్తున్నాయి బ్రహ్మాండంలోని అసంఖ్యాకతారకలు. ఇంకా కోట్లకోట్ల సంవత్సరాలపాటు అవిచ్ఛిన్నంగా ప్రకాశించడానికి తగినశక్తి సామర్థ్యాలు కలిగిఉన్నాయి.

ప్రకృతం, సూర్యునిలో వినాశమయే పరమాణువుల లెక్కనుబట్టి చూస్తే, సూర్యునిభావిజీవితం, కనీసం ౧౫,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ సంవత్సరాలకు తక్కువ ఉండదని తేలుతుంది. అంటే ప్రతిసంవత్సరం సూర్యునిలోఉన్న మొత్తం పరమాణుసంఖ్యలో ౧౫ లక్షలకోట్లకు ఒక్కటిచొప్పున వినాశ మవుతోందన్నమాట, సూర్యుని అపారమైనశక్తి ఉత్పన్నంకావడానికి. మొదట ఇది విపరీతంగా స్వల్పంగా కనపడుతుంది. కాని, సూర్యునిలో వినాశమయే మొత్తంద్రవ్యం లెక్కకడితే దాని విస్తారత వ్యక్తమవుతుంది. సూర్యగోళం యొక్కత్రిజ్య (Radius) ౪౩౩౦౦౦ మైళ్లు. ఒక చతురపు అంగుళం వైశాల్యంగలిగి ఇంత ఎత్తుగల స్తంభంలో ఉండే పరమాణువులసంఖ్య ౧౦ అని లెక్కతేలింది. ఇందులో, ప్రతిసంవత్సరం ౧౫ లక్షలకోట్లకు ఒక్కపరమాణువుచొప్పున వినాశమైనప్పటికీ, ప్రతి సెకనుకూ వినాశమయే పరమాణువుల సంఖ్య ౨,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ కు తక్కువ ఉండదు.

సర్వశక్తికీ మూలమైన ఈద్రవ్యవినాశ మనేది ఏవిధంగా సంభవిస్తుందో నిశ్చయంగా చెప్పడానికి ప్రస్తుతంలో సావకాశం ఎంతమాత్రమూ లేదు. మనకింతవరకూ తెలియని ఏనియమాలవల్లనో, భిన్నవిద్యుదావేశ యుతములైన ప్రోటాను ఎలెక్ట్రానులు రెండూ, ఒకదానితో ఒకటి సంయోగంచెందడం, భిన్న విద్యుదావేశాధారమైన వాటిద్రవ్యం తరుక్కుమని ఒక్క

ప్రకాశకిరణరూపంతో అంతర్హితం కావడం జరగవచ్చు. లేకపోతే మరొకవిధ మేదైనా ఉండవచ్చు. ఇదమిత్థమని చెప్పడానికి అవకాశం లేదు.

పైవిషయాలనుబట్టిచూస్తే పుట్టుక కల ఈదృశ్య ప్రపంచానికి అంతంకూడా తప్పదని నిశ్చయమవుతుంది. ఈమహావిశ్వంలోని ప్రతిపరమాణువుకీ నాశనం తప్పదని తెల్లమవుతుంది. అనంతకోటి నక్షత్ర లోకాలలోని అసంఖ్యాక పరమాణువులకు పట్టినగతే ఈదృశ్య ప్రపంచంలోని ప్రతిపరమాణువుకీ పడుతుం దని నిశ్చయంగా తోస్తుంది. ఈదృశ్యప్రపంచ మంతా నశించి ప్రకాశ రూపంలో లీనమైపోతుంది. చెట్లూ పుట్టలూ, కొండలూ గుట్టలూ, నదులూ సముద్రాలూ భూములూ, చంద్రులూ, సూర్యులూ. నక్షత్రాలూ, ఇదీ అదీ అనడమెందుకు, సకలదృశ్యప్రపంచమూ ఆనవాలయినా లేకుండా నశించిపోయి, కాలవాహినిలో లీనమైపోతుంది. ఆతరువాత ఉండేది ఏమిటి? ఈ దృశ్య ప్రపంచం పుట్టుకకు పూర్వం ఉన్నదేమిటో, దాని అంతానికి అనంతరంకూడా అదే! అయితే కాలవాహిని ఏమయిపోతుంది ? గట్లేమీ లేకపోతే వాహిని ఏమిటి? అదీ నశించి లీనమైపోతుందా? ఎందులో? నిర్వికారమైన విశ్వరూపంలో!

అంటే ? ఏమిటో !!

---

## సంబోధన

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యం

వ్యోమ నదీ జలజాత సలాలస
వ్యర్థ నిరంతర ఝుంకరణాలస
నైమిషనైమిష వర్ధద్విభ్రమ
నిశ్రమ మానుమ యింక ద్విరేఫమ.

భూలోకస్థితసకల లతాంతల
నాలోకింపవ యతిలోకాంతర
తత్పరిమళముల నాఘ్రాణింపవ
తన్మైరేయము లాస్వాదింపవ

సంప్రాప్యాఖిల సూనవిలోలల
న్యూనతఁ జూచెద వళి బాంధవుల
అప్రాప్యామర కుసుమోత్కంఠుని
వా రెదనెంతురు నినుఁ జ్యుతమతియని

మహదనుకాంక్షయె త్యాగవిభూతికి
ప్రహితంబని బోధింతువొ జీవికి ?
ఇహావస్త్వనుగత బహుళానందము
అహరహ మొదవ ప్రజించునె డ..ము.

---

అందంగా పది
మంది కూడినా
పందిట్లో,
ఇందరు చేసే
తీయని తెలుగు
సందట్లో,
గొంతుదారిలో
కొట్లాడే, మా
వంతుతలపులు
తందనపదముగ
పాడేస్తాము;
విందో మందో,
వినితీరాలి.

తల్లియడుగులకు
తడవులాడుతూ
అమ్మమాటలకు
ఆసలూరుతూ
దూబరదిండులమై
గుమ్మం
దూరముననె నిలచీ
వారిని వీరిని బిలచీ
కన్నీటను మొగమే గడిగి
కసరుమొగ్గలుగ ముడిగి
అత్తుల్లారా!
పత్తుల్లారా!
అమ్మేదీ? యని

బితుకుబితుకుగా
కొతుకుగొంతుతో
బిక్కమొగముతో
వేడేనాడు
కూడుక వచ్చిందా?
ఆటలు మరిగి కన్నతల్లినే
ఆదమరచినామా?

తూరుపుకనుమలు
శేషాచలములు,
నల్లమలలు
ఎఱ్ఱమలలు
జవ్వాదికొండలూ
నగరికొండలూ
చిగురుతోరణాల్
గట్టినగుమ్మాలు,
వంశధార, ఋషికుల్యా,
నాగావళీ, శారదలూ
చిత్రావతీ
యుత్తరపినాకినీ
గుండ్లకమ్మ
పాపఘ్నులు
కృష్ణాగోదావరులు,
ఏటిపైయెదువలు
మేటిబత్తితో
కమ్మనికలయంపి
చిమ్మినవాకిళ్లు,

ప్రాణహితా ఇంద్రావతి
వరదా, మంజీరా,
భీమరథీతుంగభద్రలూ,
ఏటికన్నెలూ
నేటికి తీర్చిన
నీట్ముగ్గులూ
నాటినగడపలు
ఆనవాలుపట్టలేక
'ఓనమాలు' మొదలిడినామా!

అంతయేల ? మన
అమ్మమాటనే
పాలమాటనే
పైడిమాటనే
'ఇటాలియను' కడనే
మిఠాయిచవులూరే
తల్లిమాటనే
చల్లనిమాటనె
తెలుగుమాటనే
తేటమాటనే
గురుతుపట్టలేకా,
గుటుకలు మింగే
మెతుకబ్రతుకుతో
మేనులు మరచేమా ?

కారుటడవులను
చీలిచి యిండ్లను
తీరిచి కట్టిన
నాటియులయికా
తీరిందో లేదో!

వాగులు త్రిప్పి
సాగులు మప్పిన
నాటిచెమ్మటా
ఆరిందో లేదో!

మురిపెముతో గట్టికొన్న
బొమ్మలయిల్లు
ముచ్చటగా గూర్చికొన్న
పిచ్చుకగూడు
రేకులల్లినా
ఆకుటీరము,
పన్నుపడ్డతొల్లి
తబిసివాకిలీ,
పచ్చనినేలా,
అచ్చపునేలా,
తెలుగునేల
చిలుగునేల
ఎల్లలెరుగనీ
కౌగిలి చూపిందా ?
కల్లలెరుగని
మనుగడ రేపిందా ?

ఒత్తిళ్లెరుగని
సత్తెకాలపు
మొత్తనిరోజులవీ!
మనయింటికి
తలుపేలేదు ;
మనకంటికి
గొలుపే లేదు.

కాటకమున బడి
కూటికి తడబడి
నాటికి వచ్చిన
బాటసారికి
'రా'యని
చోటు పెట్టినామా ?
తీయని
మాట నేర్పినామా ?
మాటవరుసకూ
మమ్మును జూడండీ !
ఆనా డేనాడో
ద్రావిడ బాసకు
దండంబెట్టీ
తెలుగు తేటలో
ఈదుకవచ్చిన
ద్రావిడులము మేమూ,
రాజును చూచినకళ్లా
మగణ్ణిచూస్తే
మొత్తా లనిపించింది
తెలుగే చిత్తాలను నించింది.

మెప్పే తప్పయి
మీదికి వచ్చిందా ?
గొప్పే కీడయి
కొంపను గాడిందా ?
వాసా ల్లెక్కకు
వచ్చినదా బ్రతుగు ?

బిడ్డలతల్లికి పెంపక మేలా ?
అడ్డాల్లో పెరబిడ్డకు చోటా ?

అయ్యయ్యో !
గంపెడుబిడ్డలతల్లి
కాదంటుందా ?
లేదంటుందా ?
చేదా ? ఆదరువు !

తెలుగుచేలు
మొలచినచోటు
తెలుగుఊాలు
నిలచినచోటు
తెలుగునాడు
పెనిచినచోటు
తెలుగుమాట
వినిచినచోటు
వెనుకటికతలు
వినిపిస్తాయి,
విప్పినకంటికి
కనిపిస్తాయి.

చెరపగ
మసిబొట్టుకాదు,
కరపగ
పసిబొట్టుకాదు.

కట్టెదుటకు
రాయబారము
పట్టపగటికీ
దివిటీవెలుగు,
నాయమునకు
నడిమివాడు,
కావలసివచ్చెనా ?

ఇంతింతలు
కావలసివచ్చెనా?

తెలుగుదిట్టలూ
తీరిచినట్టి
కూటమి యిది మో
మాటము విడిచి
నాటుకుపోయే
మాటలు ముడిచి
చెప్పండి
డెండాలన్నీ విప్పండి!
లోటుపాటులను గప్పండి!
సరిహద్దులు చక్కగ నప్పండి!

మేనోలచియిచ్చినవారిని
మేటికతలలో విన్నాము;
ఆలుబిడ్డలను ఒసగినవారిని
గాలికతలలో విన్నాము,
కన్నతల్లినీ చాగం చేసిన
మిన్నలమా మనమూ?

కాణాచిని చిదిపి
కానుకపెట్టిన
జాణలమా మనము?

నేలవిడిచి సాములుచేయు
శేలలమా మనము?

తల్లిబాసను బెల్లించి
తనముద్దూముచ్చట చెల్లించి
వెనుకటిముక్కలు వల్లించి
మత్తుమందు మనపై చల్లించి

మగసా లెక్కిన వేలుపుబాసను
నగము చిక్కిన తల్లిబాసను
తారుమారుగా జేసికొని
నీరే పాలని త్రావిననాడు
తిక్కన మనమాటాడి
చిక్కని తెలుగే
చిలికేడు.

చక్కని తెలుగే
చవిచూపేడు.

మక్కువ మనలో
నెలకొల్పేడు.

ఎక్కడికక్కడె
చిక్కులుబడుతూ
వెక్కుబాసలా
నొక్కులు పడుతూ
నేటికి సూటిగ
నెగ్గుకొవచ్చిన
తెలుగుతల్లికి
గిడిగిల్లూ!
తేనెవెల్లికి
గిడిగిల్లూ!
అన్నల్లారా!
అక్కల్లారా?
అందుకొవచ్చిన
హిందీవాకిట
బందిపెట్టె మన
ముందటిబాసను



నటరాజ దేవాలయము-చిదంబరము K. P. S.



వేయికాళ్ల మంటపము-చిదంబరము K. P. S.



దేవాలయము-తటాకము-చిదంబరము K. P. S.



నటరాజ దేవాలయము అంతఃప్రాకారద్వారము, నందిమంటపము-చిదంబరము K.P.S.

చిందరవందర
చేయకుడీ!
చీకటికొట్లో
త్రోయకుడీ!

విద్దెలు నేర్చే పెద్దరికం
కబ్బము లల్లే అబ్బురమూ,
పాటలుపాడే మేటితనం
బొమ్మలు చెక్కే ప్రోడతనం
అన్నిటిలోనా తెలుగుదనం
అల్లికలిగి చూపించే నేము
బొల్లిమాటలకు చెవియొగ్గి
'అన్నదిమాటా, మన్నదిపేటా'
అనుకుంటూ

తాటాకూటం చేసుకో అవలకు
దాటేస్తా మనుకోకండి
జోగులమై మన మేగచూచినా
మూగమొగ్గలూ విరిసేకారు
ముందరనున్నాది
మునుపున్నది యుగాలకు
ముడుపేగట్టి
పుట్టువునే అరికట్టిస్తామని
నట్టికబురులూ పట్టుకొ రాకండీ!
నందుకొన్నది తిందాము,
పంచిన వెన్నెలలో ఉందాము,
మన కున్నది నిలువబెట్టుకే
'మడిమాన్యా' లనుకుందాము.

---



బకింగ్‌హాం కాలువ-మదరాసువద్ద
"ఎక్స్‌ప్రెసు" రైలుబండిలో పోవుచు తీయబడినది. K. K.

# నక్షత్రమండలము

(భావసంవత్సర మాఘమాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(కవితాసమితి)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగా నుండునట్లు తలమీదుగా పెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాగులు

ఫిబ్రవరి 8 తేదీని రాత్రి 8-51 గంటలకును, ఫిబ్రవరి 22 తేదీని రాత్రి 7-56 గంటలకును
,, 15 ,, ,, 8-24 ,, ,, 31 ,, :, 7-21 ,,
కనబడును.]

"One day telleth another; and one night ceritfieth ano her : There is neither sp ech nor language but their v ices are heard among them Their sound is gone out into all lands: and their words in to the ends of t e world " Ps lms XIX 2-3:4.

"The Heavens declare the glory of god, and the firmam nt showeth His handi-work.
Psalms 191.

(ఒకదివసము మరియొకదివసమును తెలుపుచున్నది. ఒకరాత్రి వేరొకరాత్రినిగూర్చి ప్రశంసించుచున్నది. ఆపలుకులు-ఆప్రసంగములు-మానవభాషలలో కానున్నేమి? ఆస్వరములు పరస్పరసువ్యక్తములే. ఆశబ్దము అన్నిదేశములలో వినబడుచున్నది. ఆపలుకులు ప్రపంచాంతమునకును వ్యాపించియేయున్నవి.

ఖగోళము భగవంతుని మహామహిమమును స్ఫుటముగా తెలుపుచున్నది. ఆకాశరంగ మాసృష్టికర్తయొక్క రచనాప్రాగల్భ్యమును ప్రదర్శించుచున్నది.)

ఈభావసంవత్సర మాఘమాసమున రాత్రితొలిజామున నగపడు నక్షత్రాదుల వరయుదము.

### పాలవెల్లి (Milky Way)

ఈమాసములో పాలవెల్లి ఆగ్నేయదిక్కున నౌకామండలముకడ నారంభించి, వాసుకి, శ్వాన, పూర్వశ్వాన, వృత్ర, మిథున, వృషభరాసులమీదుగా గగనమధ్యము నతిక్రమించి, సారథి, భృగుపరశు, అప్సరసమండలములం గడచి, వాయవ్యదిశను ఊర్వశీమండలములపై వ్రాలి, గొప్పఆర్చి (Great arch) రూపముతో మెఱయుచున్నది.

### First Magnitude Stars

తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు మన కిపుడు తొమ్మిది కనబడుచున్నవి. అవి యేవేవియనగా,

తూర్పున మఘ (Regulus)
దక్షిణమున అగస్త్యుడు (Canopus)
మధ్యను రోహిణి (Aldebaran)
బ్రహ్మహృదయము (Capella in Auriga)
ఆర్ద్ర (Betelgeaux)
రిగెల్ (వృత్రపాదము - Rigel)
మృగవ్యాధుడు (Sirius)
మిథునములోని అర్ధనారీశ్వరుడు (Pollux)
పూర్వశ్వానము (Procyon)

### ఉత్తరనక్షత్రములు

ఈశాన్యదిక్కున బృహదృక్షము (Ursa Major)లోని సప్తఋషులు బాగుగా ఉదయించినారు. క్రతు-పులహ-పులస్త్య-అత్రి-అనునామములుగల నాలుగు నక్షత్రములును ఒకచతురస్రముగా నేర్పడి మెఱయుట గమనింపదగును. ఈవల ఆంగీరస-వసిష్ఠ-మరీచి-ఋషులు ఒకత్రిభుజముగా నేర్పడి మెఱయుట కానవచ్చును. వసిష్ఠునికడ ఈత్రిభుజమునకు గొప్పకోణము ఏర్పడినది. (obtuse angled near వసిష్ఠ) వసిష్ఠుని ప్రక్కనే ఆవగింజలాగున నాతని ధర్మపత్ని, మహాపతివ్రత, అరుంధతి మిణుకుమనుచున్నది. పులహక్రతు నక్షత్రములు ధ్రువసూచకములు (Pointers). ధ్రువుని దిగువను ధ్రువరక్షకులు (Guardians of the Pole Star)అని చెప్పబడు ధాత, విధాతలున్నారు. ధాతవిధాతలు లఘుఋక్షము (Ursa Minor) లోనివారు. ఆంగీరస, వసిష్ఠుల కెదురుగా సరిగా ధాతవిధాతనక్షత్రములు కానవచ్చుచుండును. ధ్రువుడు లఘుఋక్షముయొక్క తోకచివర నున్నాడు. ఆతోకలో కశ్యప, మహేంద్ర, అగ్ని నక్షత్రములు వరుసగా నున్నవి. అగ్నికి దిగువను, విధాతకు ప్రక్కను మిత్రతార కలదు. లఘుఋక్షమునంటి ధ్రువునికెడముగా ఊర్వశీమండలము గలదు. ఊర్వశికి దిగువ పాలవెల్లిలో అప్సరసమండలము వాయవ్యదిక్కున వ్రాలి యగపడుచున్నది.

## ప డ మ ట

పేద్దఘూశ్వము (Square of Pegasus) అస్తమించినది. అనగా పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు అస్తమించినవి. రేవతి త్వరలో అస్తమింపనైయున్నది. నైరృతిదిశను రేవతికి దిగువ శింశుమారములో మైరానక్షత్రముయొక్క తేజస్సు అద్భుతముగా మారిపోవుచుండును. శింశుమారముకూడ అస్తమింపనైయున్నది. పాలకల్లిదిగువను వాయవ్యదిశను ఇంద్రమదయును, ఆమెను భంగపఱుప యత్నించిన పులోమరక్కసుడును, పులోమునికి పడమటను చ్యవనుడును కానవచ్చుచున్నారు. రేవతికి ఎగువ అశ్వినికి తూర్పున భరణి చూడనగును.

## ద క్షి ణ ము న

శింశుమారమునకు దిగువ నైరృతిదిశను ధుంధుడును, ధుంధునకు ఈవల ఎన్నో వంకరలు తిరిగి యమునానదియును, బకదాల్భ్యుడును తెలియనగును. ఉపరిచరవసువును, అద్రికయును, వలయు దక్షిణమున క్రమముగా కానవచ్చుచున్నారు. ఆగ్నేయదిశను అగస్త్యుడును, నౌకాస్తంభాదులతో నౌకామండలమును కాననగును.

## తూ ర్పు దె స ను

క్షీరోదఉత్తరధ్రువము (North Galactic Pole) కన్యారాశిసమీపమున నున్నది. సారమేయమండలముదిగువ నద్యాది యున్నది. కన్యారాశి ఇప్పుడే ఉదయముకాగలదు. నాలుగుమంచముకోళ్లవలె పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీనక్షత్రములు కానవచ్చుచున్నవి. ఈయర్జునీనక్షత్రములకు పడమటను పల్లకిబొంగువంటి వంకరయాకారముతో మఘ మెఱయుచున్నది. మఘకు పడమటగా రెండు చిన్నచుక్కలమధ్య పొట్లపూవువలె దృశ్యాదృశ్యమై పుష్యమి యున్నది. పుష్యమికిదిగువ ఆశ్రేషసర్పము ఆగ్నేయమునకు వ్యాపించియున్నది.

## మధ్య నక్షత్రములు

అశ్వినికి ఈవల ప్రాయ్యిపొక్కిళ్లవలె భరణి చుక్కలు మూడును, భరణికి ఈవల, వెండిరుమాలున కట్టువడిన మిణుగురుపురుగులో—పూచిన కోఱవిపూపొదరిల్లో అనునట్లు—పిల్లలకోడిచుక్కలు, అనగా కృత్తికనక్షత్రములు మెఱయుచున్నవి. కృత్తికనుండి ఉత్తరముగా భార్గవులైన ఔర్వ, జమదగ్ని, రుచికాది నక్షత్రము లున్నవి.

ఎఱ్ఱుకన్నులాగున నెఱ్ఱగ మెఱయుచు వృషభ(రాశిక)నేత్రమువలె నున్న రోహిణి గగనమధ్యరేఖదాటి పడమటకు వ్రాలినది. గర్గుడు ప్రక్కనే ఉన్నాడు. వృషభమునకు ఎగువను ఉత్తరముగా సారథిమండలము నందలి బ్రహ్మహృదయము తెల్లనితేజముతో మెఱసిపోవుచున్నది.

బ్రహ్మహృదయమునకు ఉత్తరముగా కల్పవృక్షము కలదు. దానినీడనే అప్సరసలు మెఱయుచుందురు. రోహిణికిదిగువ దక్షిణముగా, నాలుగుమూలలను నాలుగుమంచముకోళ్లవలె మెఱయు చుక్కలతో Orion యోధుడు నేత్రపర్వము చేయుచున్నాడు. అందు ఆర్ద్ర (Betelgeaux) ఆయోధునికి ఒక బాహువు. Bellatrix (పరివృక్త) రెండవ బాహువు. Rigel ఒకపాదము. గొల్లకావడిచుక్కలు పటకా. ఆక్రిందిచుక్కలు వాని కరవాలము. ఆకరవాలముప్రక్కనే * గొప్పచుక్క మబ్బు (Great Nebula) ఉన్నది. ఇప్పుడిది శ్వేతధూమజాలానిబద్ధమై, మహాగ్నిమయమై, శతఘ్నితుల్యమై, మహోద్రేకపూరితమై బహుముఖముల పరిభ్రమించునదియైయున్నను, కొన్నియుగములనాటికిది గ్రహ, గ్రహాకల, ధూమకేతు, ఉల్కాదులతో కూడుకొనిన యొక్క సూర్యకుటుంబముగా పరిణమింపగలదని జ్యోతిశ్శాస్త్రవేత్తల యభిప్రాయము.

ఒరయన్ (Orion) యోధుని పాదములదిగువను బెదరిబెదరి చూచుచు శశకమును, దానిదిగువ కపోతము

* Nebula is "Some tumultuous cloud instinct with fire and nitre."

ఐతరేయబ్రాహ్మణము. ౧ పంచిక. ౭:—

“యజ్ఞో వై దేవేభ్య ఉదక్రామ త్తే దేవా న కించనాశక్నువన్ కర్తుం న ప్రాజానం స్తేఽబ్రువ న్నదితిం త్వయేమం యజ్ఞం ప్రజానామేతి సాతథే త్యబ్రవీ త్సా వై వో వరం వృణా ఇతి; వృణీష్వేతి సైత మేవ వర మవృణీత మత్ప్రాయణా యజ్ఞాః సంతు మదుదయనా ఇతి తథేతి. తస్మా దాదిత్య శ్చరుః ప్రాయణీయో భవ త్యాదిత్య ఉదయనీయో వరవృతో హ్యస్యా అథో ఏతం వర మవృణీత. మయైవ ప్రాచీం దిశం ప్రజానాథాగ్నినా దక్షిణాం సోమేన ప్రతీచీం సవి త్రోదీచీ మితి.”

అనగా:—యజ్ఞము దేవతలను విడిచి వెళ్లిపోయెను. అందువలన దేవతలు ఏయజ్ఞకర్మను చేయజాలకపోయిరి. యజ్ఞము ఎక్కడకు పోయెనో దేవతలకు తెలియలేదు. అపుడు వారు అదితితో ఇట్లనిరి: “అదితీ, నీవలన యజ్ఞమును తెలియవలచినాము.” అదితి “అలాగే కానిండు. కాని నాకు మీ రొకవర మియ్యవలెను” అనెను. దేవతలు వరముకోరుకొనుమనిరి. “సమస్త యజ్ఞకర్మలు నాతో ప్రారంభమై నాతో అంతము పొందవలెను.” అని ఆమె కోరెను. అందుచేతనే ప్రాయణీయఇష్టిప్రారంభమునందు ముందు అదితికి చరువు ఇచ్చుచుందురు. ఆవరము ననుసరించి అంతమందుకూడ ఆమెకు చరువు సమర్పింపబడుచున్నది. అపు డామె రెండవవరము కోరినది. “నావలన మీరు తూర్పుదిశను తెలిసికొందురు. అగ్నివలన దక్షిణమును, సోమునివలన పశ్చిమదిశను, సవితృనివలన ఉత్తరదిశను తెలిసికొందురు.......”

ఇట్లే కృష్ణయజుర్వేదము, ౬-౧-౫-౧లో కూడ చెప్పబడినది.

“...తేదిత్యాగం సమభ్రియంత త్వయా ప్రజానామేతి సాబ్రవీ ద్వరం వృణై మత్ప్రాయణా ఏవ వో యజ్ఞా మదుదయనా అసన్నితి తస్మా దాదిత్యః ప్రాయణీయో యజ్ఞానా మాదిత్యః” వాజసనేయసంహితలో [౭-౧౯] అదితి రెండుశిరస్సులుకలది. “ఉభయతః శీర్ష్ణీ”గా వర్ణింపబడినది. యజ్ఞారంభ, యజ్ఞాంతములందు విధిగా రెండుసారులు పూజింపబడుటచేత ఆమెకు రెండుశిరస్సు లున్నట్లు చెప్పబడినది. ఆకాలములలో ఉత్తరాయణమునకు దేవయానమనియు, దక్షిణాయనమునకు పితృయానమనియు పేర్లుండెను. దేవయానము అపుడు పునర్వసు – అనగా అదితితో ఆరంభమయ్యెడిది. అందుచేతనే ఆమె దేవతలకు, ఆదిత్యులను సూర్యులకుకూడ తల్లియని చెప్పబడియెను. అంతేకాదు. ఋ ౧.౮౯-౧౦

“అదితి ర్ద్యౌ రదితి రంతరిక్ష
మదితి ర్మాతా సపితా స పుత్రః
విశ్వేదేవా అదితిః పంచజనా
అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్.”

పుట్టినట్టియు, పుట్టబోవునట్టియు సమస్తమును అదితియే యని చెప్పబడినది. ఇట్లు దేవమాతయు, విశ్వమాతయునై మనమూహింపరాని యనంతము (Infinity) యొక్క మూర్తివంతమై అదితి వేదవాఙ్మయమున నొప్పుచున్నది.

విశేషించి వేదవాఙ్మయములో యజ్ఞమన్నను, ప్రజాపతియన్నను, సంవత్సరమన్నను ఒక్కటేఅర్థముతో పెక్కుసారులు వాడబడినట్లు కానవచ్చుచున్నది. (చూ. సంవత్సరం వై ప్రజాపతిః-సంవత్సర మేవ ప్రజాపతిః. సంవత్సరః ప్రజాపతిః. ప్రజాపతి ర్యజ్ఞః. ఐతరేయబ్రాహ్మణము, ౨-౧౭; యజ్ఞో వై ప్రజాపతిః - సంవత్సరః ప్రజాపతిః. తై. సం. ౭-౨-౧౦-౩.)

దక్షు డొక ప్రజాపతి. వేదార్థములో సంవత్సర స్వరూపుడు. అసంఖ్యసంవత్సరములచే ననంతస్వరూపియగు అదితి యేర్పడుచున్నది. పునర్వసు (అదితి)తో సంవత్సరమును యజ్ఞము ఆరంభమగుచున్నది. కాబట్టి దక్షునివలన అదితియు, అదితివలన దక్షుడును ప్రభవించిరని ఋగ్వేదము, X. ౭౨-౪-౫.

“అదితే ర్దక్షో అజాయత దక్షా ద్వదితిః పరి
అదితి ర్హ్యజనిష్ట దక్ష యా దుహితా తవ.”

అదితి దక్షుని కూతురు, దక్షుడు అదితికొడుకు అని

పరస్పరసంబంధము వర్ణింపబడినది. మానవసంబంధములనుబట్టి యీచుట్టరికము సాధించుట అసాధ్యమేగాని శాస్త్రార్థములో నిట్టియూహలును, వర్ణనలును సాధ్యమనుచున్నవి. దక్షునికి కూతుండ్రనేకులు గలరు. అందు ఇరువదియేడు కూతుండ్రను చంద్రునికిచ్చి పెండ్లిజేసినట్లును, ఒకొక్కరాత్రి చంద్రుడొకొక్కభార్యతో గడుపుచున్నట్లును పురాణగాథలుకలవు. ఈయిరువదియేడుగురు భార్యలలో నేభార్యకడ చంద్రుడు రాత్రి యగపడునో ఆమెయే ఆనాటినక్షత్రముగా మనము నిత్యము వ్యవహరించుకొనుచున్నాము. పంచాంగము చూచి ఈవేళ పునర్వసునక్షత్రము అని చెప్పుకొందుము. అనగా అర్థమేమి? ఈ వేళ రాత్రి చంద్రుడు పునర్వసు చెంత కనబడును. ఆమెతో రాత్రిగడుపును అని యర్థము. అది యటుండనిండు. పునర్వసుతో సంవత్సరముగాని, యజ్ఞముగాని ఆరంభమగుట అనగా అర్థమేమో మనము స్పష్టముగా తెలిసికోవలెను

మున్నూటఅరువదియైదు దినములుగల సంవత్సరమంతటిలో రెండుదినములలోమాత్రము రాత్రింబగళ్లు సమపరిమితిగలిగియుండును. తక్కినదినములలో వేసవిలో పగలు రాత్రికంటె ఎక్కువయుండును. శీతకాలములో పగటికంటె రాత్రులే దీర్ఘములైయుండును. దివారాత్రములు సరిసమానముగా నుండుదినములు సంవత్సరమంతటిలో రెండుమాత్రమే యుండును. ఆ దినములకే 'విషువత్' లని పేరు. వేసవియందు విషువద్దినమున సూర్యుడేనక్షత్రములో నుండునో, అనగా ఏకాలములో విషువద్దినము సంభవించునో ఆనక్షత్రములో **Spring Equinox** ఉండుననియు, దానితోనే సంవత్సరారంభమగుననియు నిర్ణయము. సంవత్సరము విషువత్తుతో ఆరంభముకావలెను. సంవత్సరమధ్యమున సరిగా రెండవవిషువద్దినము రావలెను. విషువత్పురుషుని వర్ణనము ఐతరేయబ్రాహ్మణమునం దిట్లు గలదు: (౪-౨౨.)

"యథావై పురుష ఏవం విషువాం స్తస్య యథా దక్షిణోఽర్ధ ఏవం పూర్వోఽర్ధో విషువతో యథోత్తరోఽర్ధ ఏవ ముత్తరోఽర్ధో విషువత స్తస్మాదుత్తర ఇత్యాచక్షతే; ప్రబాహుక్సతః శిర ఏవ విషువా న్బిదల సంహితఇవ వై పురుష స్తస్మాత్సీవన్యామేవ మధ్యే శీర్ష్ణో విజ్ఞాయతే." 'విషువన్' ఒకపురుషునివలె భావించుకొనవలెను. అందొకసగము పురుషుని కుడిభాగము. రెండవసగము పురుషుని యెడమభాగము. చేతులుచాచిన మనుష్యునియొక్క కుడి, యెడమ చేతులు పార్శ్వములు, భాగములు వలె సరిగా సమానముగానుండగా, ఆ మనుష్యునియొక్క శిరమువలె, రెండుభాగములకు మధ్య సరిగా 'విషువన్' ఉండును. ఇట్లు సమదివరాత్రములుగల పుణ్యదినముతో సంవత్సరము-యజ్ఞము-ఆరంభముకావలెను. విషువత్తే సంవత్సరప్రజాపతికి శిరము.

ఋగ్వేదకాలమునందు ఈ విషువత్తు - ఈ ప్రజాపతి-శిరము పునర్వసులో నుండెడిది. ఆకాలము క్రీస్తుపూర్వము ఆరువేలసంవత్సరములకుముందు అయియుండునని లోకమాన్య బాలగంగాధరతిలకుగారి నిర్ణయము. అనగా ఇప్పటి కెనిమిదివేలసంవత్సరములకుముందు అనునని లోకమాన్యుల అభిప్రాయము.

ఈ విషువత్తు అనునది స్థిరముగా నుండునదికాదు. అది వెనుకకు జరిగిపోవుచున్నది. అది మృగశిరలోనికిని, పిమ్మట కృత్తికలోనికిని జరిగినది. కృత్తికనుండి మేషమునకు జరిగినది. ఆయంశమే కుమారసంభవము నందలి దక్షాధ్వరధ్వంసకథకు మూలము. ఎట్లనగా కాలాతీతుడైన ఈశ్వరుడు సంవత్సరమాత్రుడగు దక్షునికి లోబడలేదని, మామగారగు ప్రజాపతికి అల్లుడగు ఈశ్వరునిపై కోపము కలిగినది. ఈశ్వరుని నీచపరచుటకు యజ్ఞముచేసినాడు దక్షుడు. వీరభద్రాదులాయజ్ఞమును ధ్వంసముచేసి దక్షునిశిరస్సు ఖండించినారు. పిమ్మట దేవతల ప్రార్థనపై ఈశ్వరుడు దక్షునికి మేషశిరస్సు అతికినాడు. నాటినుండియు దక్షుడు మేషవదను డైనాడని భాగవతాదులు తెల్పుచున్నవి. కారణము సంవత్సరారంభమగు విషువత్ శిరము మేషములో నుండుట యని స్పష్టమేకదా! అది యటుండనిండు.

పునర్వసులోని దిగువరెండుచుక్కలు **Castor and Pollux** అనబడుచున్నవి. ఈచుక్కలు మొదట ఇద్దరుసోదరులనియూ, వారత్యంతస్నేహము కలిగియుండి

రనియు, యుద్ధములో ఒకడు చనిపోగా, రెండవవాడు సోదరవియోగము భరింపలేక, "దేవా! మాసోదరుని బ్రతికించి నాకిమ్ము. లేదా నన్నుగూడ వానికడకు గొనిపొమ్ము. ఎడబాసి బ్రతుకజాలను" అని ప్రార్థించె ననియు, భగవంతుడు దయదలచి ఇద్దరను ఈచుక్కలుగా మార్చి నక్షత్రమండలము చేర్చెననియు పాశ్చాత్య గాథలు గలవు. ఇవి జంట—యమక-నక్షత్రములని వేద వాఙ్మయమున గలదు. అశ్వినులే కవలలని యొకభావము ఉన్నది. కాని ఇవి స్త్రీపురుషనక్షత్రములని మనవారి భావన. ఇవి ఈశ్వరుడును, ఆతని చెల్లెలు నని యజుర్వేదము తెలుపుచున్నది. కాలక్రమమున ఈమిథునము దంపతులుగాను, పార్వతీపరమేశ్వరులుగాను భావింప బడుచున్నారు. వీరిదిగువనున్న వృషభరాశియే యీ దంపతుల వాహనము. మనశివాలయములలో నంగులు ఈవృషభరాశి సంజ్ఞకములే.

పార్వతీపరమేశ్వర సమాగమము సృష్టిరహస్యమునకు చిహ్నముగా నున్నది. నిగూఢమైన జీవతత్త్వ జిజ్ఞాసకు అజ్ఞేయఅనంతభావము లవసరము. ఆ infinity-అనంతభావము-అదితియం దీవఱకే మనవా రారోపించియున్నారు. ఆనాడు యజ్ఞాదులలో సంవత్సరారంభముతో అదితికి ప్రథమపూజ ఉండెడిది. విషువద్గమనముతో సంవత్సరారంభము మారుచు వచ్చినది. అయినను అనంతమూర్తియగు అదితియొక్క ప్రథమ పూజాగౌరవము ఇటీవల గజాసురసంహారమై వృషభ రాశి ప్రాముఖ్యముగనినపిమ్మట, పార్వతీపరమేశ్వరుల పుత్రుడగు గజాననునియం దారోపితమైయున్నది. అదితి యందు అనంత (Infinity) భావమును, సాంబమూర్తియందు అనంతజీవరహస్యభావమును (Mystery and infinity of life) ను ఆరోపితమగుట స్పష్టమే. ఆనాడదితికి యజ్ఞాదిసమస్తకర్మలతో నుండిన ప్రథమ పూజాగౌరవము ఈమిథునమునకును, సప్తఋషులకును నడుమనున్న ఈశ్వరపుత్రుడగు గణపతికి పిమ్మట లభించుట సహేతుకమై గన్పట్టుచున్నది.

> గణానాంత్వా గణపతిం హవామహే
> కవిం కవీనా ముపమశ్రవస్తమం
> జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
> ఆనశ్శృణ్వ న్నూతిభి స్సీదసాదనం.

---

# నాటకోపన్యాసములు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

(అనువృత్తము)

రంగస్థలమున స్త్రీపాత్రములను స్త్రీలే వహింపవలయు ననుపై స్వభావవాదము యొక్క వేఱొకపరిణామమునుగూర్చి రెండు మాటలు మనవి. దీనిని రెండుత్రోవలఁ బరీక్షింపవలసియున్నది: ఒకటికళ, రెండవది నీతి. కళాదృష్టితోఁ జూచినపక్షమున స్త్రీలు రంగమున కెక్కుటచేత అభినయకళ వృద్ధి నొందినదని చెప్ప వీలులేదు. కారణ మే మనఁగా, కళ వ్యక్తికిఁ జేరినదిగాని జాతికిఁ జేరినది గాదు. స్త్రీజాతిలోఁ బుట్టినమాత్ర మున స్త్రీత్వమును చక్కఁగా నభినయింపఁ గలరని చెప్పుట కెవరును సాహసింపరు గదా. నే నెందఱో స్త్రీలు అభినయించుట చూచినాను. వారిలో చాలమంది యత్నము లేక స్త్రీలుగా నున్నారేకాని అభినయమును జూచినచో వారు స్త్రీలునుగారు, పురుషులును గారు. అట్లే పురుషు లందఱు పురుష పాత్రమును సరిగా నిర్వహింపలే రనుటయు మన మందఱును చూచిచూచి వేసరిన విషయము. వారిలోఁగాని, వీరిలోఁగాని కొందఱకే అభినయశక్తి యుండును. తమలో లేనిధర్మము నారోపించుకొని యనుకరించుటయే కళాకౌశల్యమందలి ముఖ్యతత్త్వమనుటయు అందఱెఱిఁగినదే. అట్లున్నపుడు అట్టియభినయ శక్తిగల వ్యక్తి పురుషుఁడైన పురుషపాత్రమునే, స్త్రీయైన స్త్రీపాత్రమునే వహింప వలయునను నిర్బంధమేమి? పురుషులు స్త్రీ పాత్రమును చక్కఁగా నిర్వహింపలేరనుట అనుభవవిరుద్ధమైన విషయము. స్థానం నరసింహారావు, మైసూరు శామణ్ణ* మొదలగు వారు స్త్రీమనస్తత్త్వమును జూపుటలో ప్రదర్శించినశక్తి చూచినవారందఱును ఎన్నఁడు మఱవరానిది. పురుషుఁడెంత నాజూకుగా వేషము వేసికొన్నను అచ్చపు టాఁడుదాని వలె కానరాఁడనుట కొంతవఱకు సత్యమే. కాని అచ్చపుటాఁడుది యనఁగా ఇట్టిదియని చూపుటకా రంగస్థల మేర్పఱచినది? అమ్మలు అక్కచెల్లెండ్రు ఆలుబిడ్డలు ఇంటిలో లేరా? ఇరుగుపొరుగువారికి నుండరా? వారి ఆఁడతనములో మనము చూడని అచ్చమును వారిని రంగమున కెక్కించినమాత్రాన చూడఁగలమా? మఱియు ఈఅచ్చపు ప్రశ్న ఒకఆఁడవేషమునకేనా వచ్చినది? ముసలి వేషము వేసినవారిలో చర్మమునకు ముడుతలు చూపఁగల యభినేత యున్నాఁడా?

* మైసూరుమహారాజుల నగరి యాజమాన్యమున కొన్నేండ్లక్రిందటివఱకు సుప్రసిద్ధముగా నుండిన శ్రీ చామరాజేంద్రకర్ణాటకనాటకసభలోని యసాధారణాభినేతలలో నొక్కఁడు; ఇప్పుడు కీర్తిశేషుఁడు.

అందుకై ముసలివానినే యేఱితెచ్చి ఆవేషమునకు నియమింతురా? అట్లయిన దుష్యంతుని వేషమునకు దొరనే యెవనినైనఁ బట్టుకొనిరావలయును. ఇఁక హనుమంతుని వేషమునకు రావలసిన దెవరు? ఈ వ్యవహారము తెగుట యెప్పటికి? అభినయించునది నిజముగా ఆఁడదా, మగవాఁడా యను చింత కళానుభవముగల రసికులకు కలుగనే కలుగదు. కొందఱికి కలిగినను వారికి సంస్కారము చాలదనియు, అచ్చపు టాఁడువారిని జూడవలయునన్న వారుపోయి చూడవలసిన చోటు వేఱనియు చెప్పవలసియుండును. ఇఁక నాయకవేషము ధరించినవానికి నాయికాపాత్రము వహించియుండునది నరసింహారావుగాని నరసమ్మకాదని నిరుత్సాహము జనించునేని అట్టి వానికి రంగస్థలమునెట్లు త్రొక్కుట కధికారములే దంతే. కాఁబట్టి స్త్రీపాత్రమును స్త్రీలే వహించుట వలన కళకు ప్రత్యేక మగు మేల్మి యేమియు లేదు. అభినయించువారి సంఖ్యను పెంచినట్లగునంతే. వారి కభినయశక్తి కలదేని మగవారివలె నన్ని పాత్రములను వహించు నవకాశమును కల్పింపవచ్చును. కాని యిదివఱ కెవరును ఆయౌదార్యమును వారియెడల చూపినట్లు కానము. ఏల? అవకాశ మిచ్చి చూడుఁడు. మగవారు మగపాత్రము వహించి చూపు నభినయముకంటె ఆఁడవారి పురుషపాత్రాభినయము ఏమిటను తక్కువగా నుండదనుట నానమ్మకము.

ఇట్లు కళాదృష్టితోఁ బరీక్షించితిమేని స్త్రీలు రంగమున కెక్కుటచే కళకు విశేషలాభ మేమియులే దని యేర్పడఁగా నీతి దృష్టితోఁ జూచినపుడు గొప్పనష్టముగలదనియు మనము గమనించిన విషయమే. కళాప్రపంచమున నీతిదృష్టి యెందుకని ప్రశ్నించువారు లేకపోలేదు. మనుష్యజీవితమునకును నీతికిని విడరాని సంబంధ ముండఁగా మనుష్యుఁడు ఆత్మక్షేమమునకై సృజించు కళమాత్రము నీతిప్రపంచమునుండి పూర్తిగా ఎట్లు వేఱుపడునో నాకర్థముకాదు. మఱియు స్త్రీవేషములు స్త్రీలే ధరించి పురుషులతో రంగమందు వ్యవహరించుటవల్ల చూచువారి నీతికంతగా నష్టము లేదు. కథాప్రవాహమునఁ దన్మయులై యుండువారికి సావిత్రివేషము వేసినది ఏసానియైనను, సంసారియైనను రసానుభవమునందు భేదముండదు. వారురంగముపై సంబంధము గలిగియుండునది ఆరోపితమైన పాత్రముతోనేకాని అసలువ్యక్తితోఁగాదు. మఱి యీ నీతిప్రశ్న నటుల యోగక్షేమములఁ గూర్చినది. అభ్యాసకాలమందును, అభినయించునప్పుడును వారు పరస్పరము చాలసమీపముగా వ్యవహరించవలసినవారు. అభినయించునప్పుడును భావము లెంతతీవ్రముగానున్నను తమతమ స్వరూపములను కొంచెమును ఏమఱక యుండువారు; ఉండవలసినవారు. అట్టిచో నిజమైన భార్యాభర్తృసంబంధము లేని స్త్రీపురుషులు రంగమున అనేకవిధముల వ్యవహరించునపుడు వారొకరొకరి

వలపులో పడకయుండుట సామాన్యముగా అనుభవమునందసాధ్యమైనవిషయము. 'స్త్రీ పురుషుల పరస్పరాకర్షణశక్తి దూరదూరముగా నిర్బంధముగా నున్నప్పుడే యుండును గాని వారికి సామీప్యవర్తన మధికమైనకొలఁది, మైత్రి పెరిగినకొలఁది అది కృశించును గావున నీతికి భంగము లేదు. సరిగదా భద్రమే యెక్కువ యనువాదము సత్యమని నమ్ముధైర్యము నాకు లేదు. పరస్పరాకర్షణ యీ రెండుజాతులకును సృష్టిమూలమై బలవత్తరమైన ధర్మము. దూరముగా నున్నప్పుడే యుదాసీనత యెక్కువ యనియు, సమీపించినకొలఁది రూపగుణాది విశేషధర్మములచే కొన్నిచోట్ల కృశించినను, మఱికొన్నిచోట్ల దాని ప్రాబల్యము మఱింత యధికమగుననియు చెప్పుటయే యెక్కువసత్యమను విషయములో నాకు సందేహము లేదు. ఇది సాధారణమనుష్యులమాట. విశేషవ్యక్తులచింత మన కప్రకృతము. ఇప్పటికిఁగాని, యెప్పటికిఁగాని నాటకములలోఁ జేరి యభినయించు నటులందఱును నావంటి సామాన్యమనుష్యులే కాని మహర్షులు ప్రాయికముగా కారు; మహాపాపులును గారు. అట్టివారిట్టి అగ్నితో చెరలాటము - కత్తిమీఁది సాముచేయుట, వారిని చేయనిచ్చుట సామాన్యమైన సాహసము కాదు; సంఘముయొక్క ధర్మమును గాదు. నీతి సామాన్యమనుష్యుల దేహమనస్సులను ఆరోగ్యముగా నుంచుట కేర్పడిన కట్టుఁబాటు. ఆయారోగ్యమును చెఱుచు విషబీజములలో ముఖ్యమైనది స్త్రీపురుషుల స్వచ్ఛందవర్తన మనుట అందఱు అన్నికాలము లందును అనుభవించి యంగీకరించినదే. దానిని మన మల్పముగా చూడవచ్చునా, ప్రోత్సాహించవచ్చునా? మనలో ఈవిషయమున నీతిశాస్త్రములు అనావశ్యకమైన, అన్యాయమైన నిర్బంధముల నేర్పఱిచినవి గావున వానిని అక్షరశః గమనించి నడచుట పొరఁబాటని కొందఱు వాదింతురు. కొంత నిజమే. కాని అట్లు వాదించువారును ఏవో కొన్నియైన నిర్బంధములను పెట్టుకొనక తీఱదు. లేకున్న నీతికిని కామవర్తనకును సంబంధమే లేదని చెప్పవలసివచ్చును. మనుష్యుల దేహమనస్తత్త్వముల నెఱిఁగి యోగక్షేమచింతగల యేవివేకిగాని యట్లు చెప్పఁడని నానమ్మిక. కావున అట్లు మనము ఈవిషయమున నుంచుకొనవలసిన కట్టుపాటు లేవి? పరపురుషుఁడు పరస్త్రీతో ఎంతవఱకు వ్యవహరింపవచ్చును? ఏమేర మీఱినప్పుడు నీతికి భంగము? ఆమేర మీఱకుండుటకై పుచ్చుకొను జాగ్రత్త యెట్టిది? ఇత్యాది ప్రశ్నలకు తృప్తిగా, బహిరంగముగా సమాధాన మీయవలసియున్నారు నీతిశాస్త్రసంస్కారులు. ఆ నిర్ణయము చేయకమునుపు ఇట్టి తెగువపనులకు చేయివేయుట సంఘవిషయమున చేయు గొప్ప యపరాధము. ఇఁక ఇట్టినిర్ణయమునకు మనుష్యసంఘమంతయు వచ్చుట యెన్నఁడు? అంతవఱకును స్త్రీలను రంగమునుండి దూరముగా నుంచవలసినదేనా? అను ప్రశ్న

వచ్చును. మనుష్యజాతి కంతయు ఒకనీతి శాస్త్ర మేకాలమందును లేదు. కాని 'నీతి'ని పూర్ణముగా ఉదాసీనముచేసిన జాతి యేదేశ మందును, ఏకాలమందును ఉండదు. ఆయా సంఘములందలి నాగరికత ననుసరించి, నీతికి భంగము కలుగు వేఱువేఱు సన్నివేశముల ననుసరించి, వేఱువేఱు విధములుగా వారు దానిని పదిలముచేసికొందురు. అట్లు మీరును నీతిని నమ్మినవారేకదా, దానికి భంగము రానీక మీరు చేసుకొన్న కట్టులేవి యనుట బహిరంగముగా చెప్పుడనుటయే నాప్రార్థన. అట్టి యేర్పాటులు, నియమములు జరుగువఱ కును ఆఁడవారు పురుషులతోపాటు రంగ మెక్కక దూరముగానుండిన పుట్టిమునిఁగిన దేమియు లేదు. లేదా, స్త్రీలే ప్రత్యేకముగా తమ యభినయకళను బ్రదర్శించుమార్గములు కల్పించుకొనవచ్చును.

మఱియు నీతి సాధింపవలసిన ధర్మము కాని సహజమగు గుణము కాదు. దేనిని సాధింపఁబూనుకొందుమో దానిని విఘ్నము గలిగించు సన్నివేశములనుండి సాధ్యమైనంత వఱకు తప్పించుకొనిపోయినపుడే మన ప్రయత్నము కొంతవఱకైన నెగ్గును. నీతిమంతు లని పేరుపడినవా రందఱు చేసిన పనియు, చేయఁగలపనియు ఇంతేకాని వేఱుకాదు. కాఁబట్టి నాటకములందు స్త్రీలను చేర్పనివా రందఱు చాల నీతిమంతులుగా నున్నారో యని యెవ్వరైనను ఎగతాళిప్రశ్న వేసిరేని దాని కర్థము లేదు. దుర్నీతికలుగు అవకాశ మును ఆయింతమాత్రములో దూరముచేసిన వారు వారనుట సత్యమనక తప్పదు. ఇట్లే నాటకములందు చేరిన స్త్రీపురుషు లందఱు నీతికి దూరులా యనుటయు పిల్లతనపు ప్రశ్నయే. అట్టి సన్నివేశములలో ప్రాయశః నీతికి భంగము కలుగవచ్చు ననుటయే మన వాదము. అంతకన్న ఎక్కువగా అట్టి స్త్రీ పురుషుల జీవితమునుగూర్చి మనము తెలిసి కొనలేము; అక్కఱయును లేదు. వారును మనవంటి రక్తమాంసమయమగు మనుష్యులే కావున మనకుఁగల కామక్రోధాదులు వారి కిని గలవని యూహించుటచే, అట్టి సన్నివేశ ములందు మనమే యుంటిమేని హృదయ దౌర్బల్యము నడఁచుకొని నీతిని నిలుపుకొనఁ గల స్థైర్యము మన కుండదను నమ్మికచే ఇట్లు వాదింపవలసియున్నది. రంగస్థలమున నిప్పుడు కలియుచున్న స్త్రీపురుషు లందఱు జితేంద్రియు లగు అసాధారణ వ్యక్తు లని ప్రపంచమునకు స్పష్టమయ్యేనేని అప్పు డిట్టి ప్రశ్నలు రంగమందుఁగాని, బైటఁగాని రానే రావు. ఎందఱు మీరాబేనులు, ఎందఱు నీలనాగిణులు ఏకాంతమందు పరివారించి యున్నను ఆమహాత్మగాంధినీతిని ప్రశ్నించు నక్కఱగాని, ధైర్యముగాని యెవరికిఁగలదు!

ఈ విషయమున ఆంధ్రనాటకపితామ హుఁడు రామకృష్ణమాచార్యుల యభిప్రాయ మెట్టిదో తెలియు వీలు నాకులేదు. కాని వారి 'సరసవినోదసభ'లో ఎప్పుడుగాని స్త్రీ

నటులను వారు చేర్చకయుండుట ప్రసిద్ధవిషయమే. కావున వా రిప్పుడు జీవించియుండు భాగ్యముండిన నాతో ఈవిషయమున నేకీభవించియుందురను పేరాస నాకుఁగలదు. శ్రీ కోలాచల శ్రీనివాసరాయలును తమ 'సుమనోరమసభ'లో స్త్రీలకు చోటియ్యలేదని విన్నాను. కాని వారి 'ప్రపంచనాటకచరిత్ర' లో "ఇంగ్లీషుస్త్రీలయంత మనస్త్రీలు చదువుకొనువఱకు, వారియంత నాగరకత మనము సంపాదించుకొనువఱకు మనస్త్రీలు నాటక రంగమెక్కరాదని నాపేరాస"అని వ్రాసిరి. (పు. ౧౨౪) అనఁగా తరువాత ఎక్కవచ్చునన్నమాట. కాని చదువుసంప్రదాయములు వేఱు, - నీతివేఱు. చదివిన నాగరకులందఱు చదువని అనాగరకులకన్న ఎక్కువనీతిమంతులుగా నున్నారని చెప్పధైర్యము నాకు లేదు. ఇది మనస్త్రీలనుగూర్చిమాత్రము చెప్పవలసిన మాటకాదు. ప్రపంచమందలి స్త్రీపురుషసామాన్యులకును సంబంధించిన సమస్యయిది. ఇంగ్లండు మొదలగు దేశములలోని నటస్త్రీపురుషులు మనదేశమువారికన్న ఎక్కువ నీతిమంతులని ఆదేశములకు పోయి చూచివచ్చిన యెవరుగాని దృఢముగా నాతోఁ జెప్పలేదు. నేను ఎఱిఁగినంతవఱకును వారిసాహిత్యమున ప్రతిఫలించిన సంఘజీవితముఁ జూచిన అట్టినమ్మికకు అవకాశము లేదు. ఇన్నాళ్లవలె ఏనలుగురు ఇంగ్లీషువారో, లేక వారియుప్పుదిన్న కింకరులో యీదేశమునకు వచ్చి, ఆచార్యపీఠము నధిష్ఠించి పాశ్చాత్త్యదేశము లన్నియు పవిత్రమూర్తులని, నీతిన్యాయము లచ్చటనే అవతరించినవని వర్ణించి ప్రబంధకవిత్వకల్పనలతో ఇప్పుడు మనలను బేలుపుచ్చుటకు సాధ్యము కాదు. నైతికముగా వారి సంఘమందు జరుగుచున్న యల్లకల్లోలమును వారి సాహిత్యమే కన్నులుగలవారికందఱికిని ఘంటాఘోషముతో చాటుచున్నది. కాఁబట్టి శ్రీనివాసరావుగారి యాశ నాకు లేదు. స్త్రీపురుషవ్యవహారమునకును నీతికిని సంబంధముండువఱకును, నేఁడుగాని, రేపుగాని ఆ యిరువురును అన్నిసన్నివేశములందును చాల మెలఁకువతో సంవ్యవహారము నడువక తీఱదని నాదృఢాభిప్రాయము.

స్త్రీజాతివిషయమున నింతటి యధికారమును ఈయిరువదవ శతాబ్దమునఁ గూడ చెలాయించుట నాగరకతలక్షణముగాదని యొకవాదము. కాని నావాదము స్త్రీలకు మాత్రము సంబంధించినది గాదు; మనుష్యజాతిసామాన్యపు యోగక్షేమములఁగూర్చినది. స్త్రీపురుషులలో ఒకరు చెడి యొకరు పవిత్రులుగా నుండుట యెన్నఁడును సంభవింపదు. చెడిన నిరువురును జెడుదురు; తప్పిన నిరువురును తప్పుదురు. కాఁబట్టి యీవిషయమున ఎక్కువ తక్కువ లెవరికిని లేవు. మఱియు మాతో మీరు రంగమున కెక్కవలదని మగవారు చెప్పుట స్త్రీలపై నధికారము చెలాయించుట యగునేని, మీజతకు మేము

రామని తిరస్కరించు నధికారము స్త్రీలకును గలదు గావున ఇరువదవ శతాబ్దపు నాగరకత భద్రముగానే యుండును. దీనికిఁ దోడు స్త్రీలే ప్రత్యేకముగా అభినయసంఘములను స్థాపించుకొని లేని మగవారిని రావలదని నిషేధించు నధికారమును వారి కబ్బినట్లయి తూనిక సరిపోవును. మఱియు అధికారము చెలాయించుటయే యపరాధమా? అట్లని మగవారి నీతిరీతులనుగూర్చి మగవారిప్పు డెన్ని విధముల నపరాధపడుచుండలేదు? ఆఁడవారిని గూర్చినప్పుడుమాత్రము ఈ జోలి మనకేలయని యూరకుండవలయునా? ఏల? వారేమి యేయడవులలోనో వసించు మృగజాతివారా? మనుష్యులుకారా? వారును వీరును కలసిమెలసి యుండవలసి యుండఁగా, ఇద్దఱికిని పరస్పర సహవాసమున లాభనష్టము లెన్నోయుండఁగా, దానికిఁ దగినట్లు వ్యవహారపు నియమముల నేర్పఱుచుకొనుట అనాగరకతయగునా? నియమములేని స్వేచ్ఛావర్తనమే నాగరకత యేని యది యెంతత్వరలో నశించిన నంత క్షేమము.

---



యాత్ర

# వలసరాజ్యములందు భారతీయ శిల్పకళ



తాడిశెట్టి రామారావు

## ౫

## బ్రహ్మదేశము

భారతదేశముయొక్క తూర్పు వలసరాజ్యములలో బ్రహ్మదేశము మన కతిసమీపమున నున్నది. శ్యామ, కాంభోజదేశములందు కనబడు హిందూవిజ్ఞాన చిహ్నము లిచ్చట విశేషముగ గనబడుట సహజము. చాలాపూర్వమునుండియు నీరెండుదేశములకు సంపర్కమేర్పడుటయు, హిందూవిజ్ఞానాంకురములు బాగుగ నిచ్చట నాటుకొనుటయు చరిత్ర పరిశోధనమువలన స్పష్టపడినది.

క్రీస్తుకు సుమారైదుశతాబ్దములకుపూర్వ ముత్తర బ్రహ్మదేశము మధ్యఆసియానుండి వచ్చిన ప్రజలకును, దక్షిణబ్రహ్మదేశము మాను-ఖ్మెర తెగకు జెందిన తెలాంగులకును నివాసమైనది. మౌర్యులకాలమున (క్రీ. పూ. ౩౨౦-౧౮౫)* ఉత్తరబ్రహ్మదేశమునగల తాగాంగునకును, ఇప్పుడు ప్రోము అనబడుచున్న శ్రీక్షేత్రము, విష్ణునగరము (పిసాను మ్యొ) అను స్థలమునకును మచిలీ బందరు ప్రాంతములనుండి పడవలమీద నాంధ్రులు మొదలైనవారు పోయి కాపురము నేర్పరచుకొనిరి.* క్రీ. శ. ఐదవశతాబ్దమునాటి కీరెండు స్థలములందును వైష్ణవ, శైవ, బౌద్ధమతము లామోదమునకు వచ్చినవి. ప్రోమువద్ద నొక సంస్కృతశాసనమును, తాటూనువద్ద దక్షిణహిందూ దేశాక్షరములతోగల పాలిభాషశాసనములును లభించినవి.

క్రీ. శ. సుమారు ౪౫౦ లో బుద్ధఘోషుడు బ్రహ్మదేశమునకు బోయి, బౌద్ధమతమునెడల ప్రజలలో నుత్సాహమును కలుగజేసిననాటినుండియు నచ్చట నామతము మిగులవ్యాపించి, తక్కినమతములకు తావు లేకుండ జేసినది. నేపాలముయొక్క సంపర్కమువలన కొన్నాళ్లు నుత్తరబ్రహ్మదేశమునందు తాంత్రిక బౌద్ధమత మిటీవల ప్రవేశించినది.

ఎనిమిదవశతాబ్దమున తెలాంగులు ప్రోమును జయించి, పూర్వపు పగానువద్ద నొకరాజధాని నేర్పరచుకొనిరి. ఒకానొకప్పు డీనగరము చుట్టును ప్రాకారముండినది. ఎనిమిది, తొమ్మిది శతాబ్దములలో టిబెత్తు దేశీయులు దండెత్తివచ్చి బ్రహ్మదేశమును పూర్తిగ నాక్రమించుకొనిరి. పగానును ౧౦౪౦ - ౧౦౭౭ లో పాలించిన అనవ్రతుడు (అనిరుద్ధుడు) తాటూనును జయించి యాదేశము నొకరాజ్యముగ జేసి, యైక్యము నేర్పరచెను; హీనయానగ్రంథములను సేకరించి, భిక్షులను పోషించి, తాంత్రికమతము నాదేశమున నిర్మూలము గావింప యత్నించెను; ఇతరరాష్ట్రములతో సంపర్కము నేర్పరచి, బౌద్ధమతమునకు జెందిన సనాతన పవిత్రవస్తువులను సంగ్రహించి యనేకములగు దేవాలయాది నిర్మాణములకు కారకుడయ్యెను. ఈనాటినుం

* మౌర్యులు క్రీ. పూ. ౧౫౩౫-౧౨౧౯ సంవత్సరములందు పాలించిరని కొందరు భారతీయచరిత్రకారులు సహేతుకముగ జెప్పుచున్నారు. ఇదియే నిజమైనయెడల చరిత్రమునుగూర్చియు, భారతీయ విజ్ఞానమును గూర్చియు మనయం దేర్పడిన భావములను పూర్తిగ మార్చుకొనవలసియుండును.

డియు బ్రహ్మదేశమునందు జాతీయభావము బాగుగ బెరుగుటచే శిల్పకళ - నూతనమార్గములను ద్రొక్కుటయు, నిర్మాణమునం దొకవిధమైన వ్యక్తిత్వ మేర్పడుటయు గలిగెనది.

క్రీ. శ. ౧౨౮౭ లో కుబ్లైఖాను చైనాతిబెత్తుల ద్వారా వచ్చి పాగనును నాశనముచేసెను. తరువాత షానుజాతివారు దండెత్తివచ్చి ఆవావద్ద రాజధాని నేర్పరచుకొని ప్రోమువరకు జయించిరి. బ్రహ్మదేశమున నివాస మేర్పరచుకొనిన షానులకును తెలాంగులకును యుద్ధములు జరుగుటచే ౧౭౬౦ లో అలాంగపాయ అను షానుచక్రవర్తికి తేలాంగులు లొంగిపోయినవరకు దేశమున శాంతి లేకపోయినది. బౌదపాయయను షాను చక్రవర్తి (౧౭౮౧-౧౮౧౯) కొన్ని పెద్దనిర్మాణములను గట్టించెను.

ఇంతలో శ్యామదేశముతో విరోధము ప్రబలముగుటచే యుద్ధములందు దేశము చాలాకాలమువరకు చిక్కుకొనినది.

౧౮౫౭ లో మాండలే నగరము నిర్మితమైనది. ఇచ్చట పాలించిన 'మిండునుమిను' అనురాజు శిల్పకళ ననేకవిధముల పోషించెను.

తరువాత త్వరలోనే బ్రహ్మదేశముయొక్క రాజకీయవ్యక్తిత్వము తుదముట్టినది.

క్రీ. శ. తొలిశతాబ్దములం దీదేశమున నిర్మింపబడిన దేవాలయములు మొదలగునవన్నియు, హైందవ (గుప్త) శిల్పరచన ననుకరించియున్నవి. అనిరుద్ధుడు ౧౧-వ శతాబ్దమున తాటూనును కొల్లగొట్టినపిమ్మట నీసనాతననగరము క్షీణించుటచే నాకాలమునకు జెందిన యమూల్య నిర్మాణములు శిథిలములై మనకిప్పుడు కానవచ్చుటలేదు. నగర ప్రాకారచిహ్నములుమాత్రము మిగిలియున్నవి. ప్రాకారముయొక్క పొడవు ౭,౭౦౦ అడుగులు; వెడల్పు ౮,౦౦౦ అడుగులు. లోనున్న భూప్రదేశముయొక్క వైశాల్యము ౭౦౦ ఎకరములకు మించియుండును. ఇందుండిన దేవాలయములందు ముఖ్యమైనది ౧౦౮ అడుగుల భుజముకల చదరముగను, ౧౮ అడుగుల యెత్తుగను ఉండిన వేదికపై వెలయుచుండినది. రెండవయంతస్తు చదరముయొక్క భుజము ౭౦ అడుగులు. మూడవచదరము ౮౮ అడుగుల భుజము కలది. దీనిపై నిప్పుడు గుండ్రని యాకారముకల శిఖరము (దాగబ-Dagoba) కలదు. చదరమైన మొదటి మూడంతస్తులుండుటచే గౌడపాలినువర్ధనున్న నిర్మాణమునిది పోలియుండెననియు, పైనున్న గుండ్రని యాకారము తేవల నిర్మితమైనదనియు శాస్త్రజ్ఞుల యూహ. రెండవ యంతస్తునకు బోవుటకు నాలుగువైపుల మెట్లుండినవి. ఈవిషయమున నీకట్టడము కాంభోజమునందలి దేవాలయములను పోలియున్నది. పూర్వ మీయాలయమంతయు చక్కని శిల్పరాజములతో నలంకృతమైయుండెను. ఇదియు, నిచ్చటగల తదితర నిర్మాణములు నేనాటివో చెప్పుట కాధారములు లేవు. కాని శైలిని బట్టి బహుపురాతనములగుట నిశ్చయము. తాటూను సుప్రసిద్ధ హిందూబౌద్ధ నివాసమై, ప్రాముఖ్యమున అనురాధపురమునకు మించినదై యుండెను.

ప్రోము (శ్రీక్షేత్రము, విష్ణునగరము) క్రీ. పూ. ౮౩౩ లోనే రాజధానిగ నేర్పడెనని బ్రహ్మదేశవాసులు చెప్పుదురు. కాలాశోకుని ప్రోత్సాహమున బౌద్ధభిక్షులిచ్చటికివచ్చి, మతప్రచారమునకు బూనుకొనియుండురు. ఇచ్చటి పురాతననిర్మాణములపై నూతనముగ మరల స్తూపాదినిర్మాణములు లేచుటచే తొలిశిల్పరచన మరుగుపడిపోయినది. ఒకానొకప్పు డీప్రదేశమున తాటూనునందు వెలయుచుండిన కట్టడములవంటి వనేకము లుండెననుటకు నిదర్శనములు కలవు.

బ్రహ్మదేశపు చరిత్రయందు మిగుల ప్రాముఖ్యమునకు వచ్చిన పాగను శిల్పచరిత్రమునం దత్యంతాద్భుతమైన స్థానము నలంకరించినది. ఈప్రాంతములందు ౧౦-౧౩ శతాబ్దములలో సుమారు ౫,౦౦౦ దేవాలయములు నిర్మింపబడినవట! ఇన్నింటిని నిర్మించుట కాకళారాధకుల కెట్టిభక్తి,యుత్సాహము,ఓపిక యుండవలెనో పాఠకులకు గ్రాహ్యము కాగలదు.

ఇచ్చటగల సాట్‌హాంగుగ్యాంగు అను విష్ణ్వాలయము ౯౩౧ లో కట్టబడినటులు చెప్పెదరు. ఈ ప్రాంతములం దిప్పటికి మిగిలియున్న దీహిందూదేవాలయ మొక్కటియే యని చరిత్రకారులు వ్రాయుచున్నారు.

గాక్యేనాడాంగు అనుస్తూపము సారనాథునందు గల దామేఖను బోలియున్నది. పావడాముకూడ భారతదేశమునందలి బౌద్ధనిర్మాణముల ననుసరించినది. పెబినుగ్యాంగు సింహళద్వీపమునందలి కట్టడములను స్మరింపజేయును. అనిరుద్ధుడు ౧౧-వ శతాబ్దమున రాజ్యాధికారమును వహించిననాటికి పాగనున కన్నిదేశముల నుండియు భారతదేశీయులు పోవుచుండిరనుట కివి నిదర్శనములు.

అటుపిమ్మట నిచ్చట నిర్మింపబడిన వాటిలో నధికము లతిసుందరముగ నున్నవి.

ఆనందదేవాలయము (౧౦౮౨-౧౦౯౦) ౨౦౦ అడుగుల భుజముకల చదరముపై గలదు. నలువైపులనున్న ద్వారములవంటి నిర్మాణములతో గలపి యొక్కొక్కవైపును ౨౮౦ అడుగుల పొడవుగగలదు. ఆంధ్రదేశము నందువలె శిఖరమునం దంతస్తులు (ఏడు) కలవు. మీదియంతస్తు సాధారణ హిందూదేవాలయమును బోలియున్నది. కాని క్రిందియంతస్తున గర్భగుడికాని, విగ్రహముకాని లేదు. ద్వారమువలె గానవచ్చుదానియం దొక చిన్నగుడియును, అందు ౩౦ అడుగులయెత్తయిన విగ్రహమును గలదు. గర్భగుడిలేని యిట్టి నిర్మాణము లాప్రాంతములందే తాట్‌బిన్యూ, ష్వేగుగ్యీ, గౌడపాలిను మొదలగుస్థలములందు కలవు. మీరుపూరుఖాసు వద్ద గల నాల్గవశతాబ్దమునాటి దేవాలయము ననుసరించి యివి నిర్మితమైయుండుట సంభవము. ఆతరువాతను కూడ భారతదేశమున పాలిటానువద్ద చౌముఖి దేవాలయ మిటులనే కట్టబడినది.

తాంపిన్యవద్ద ౧౧౦౦ లో నిట్టిదేవాలయము మరియొకటి నిర్మితమైనది. దీనియం దొకవైపుననే ద్వారాకృతియు, విగ్రహమును గలవు.

గౌడపాలినువద్ద గల దేవాలయము లనేకములు మానవనివాసమును బోలియున్నవి. మధ్యనున్న శిఖర




ములు మాత్రమివి పూజాగృహములనుటకు చిహ్నములుగ గలవు. వీటియందు చాల నిర్మాణము లాంధ్రదేశము నందలి "అమ్మవారిగుడుల" వలె కానవచ్చును.

సారనాథువద్ద గల గుండ్రని శిఖరములు, సాలా రాజుల కాలమునాటి స్తూపాకృతులు, సింహళదేశపు నిర్మాణములను పోలునవి, ఆర్యావర్త శిఖరములు, కాంభోజశిఖరములు, చైనాశిఖరములు మొదలగు భిన్న విధానములన్నియు నిచ్చట నుండుటచే నీప్రదేశము శిల్పనిర్మాణమునకు కేంద్రస్థానమువలె నుండును.

క్యాశిత్తా, నాన్‌పాయవద్దనున్న దేవాలయములు తప్ప తక్కినవన్నియు నిటుకలతో గట్టబడినవి.

ఇచ్చటగల చదరపు నిర్మాణవిధానము బాబిలోనియానిర్మాణమున కనుకరణమనియు, హిందూదేశమున నిట్టివి కానరాకపోవుటచే మధ్యఆసియా ద్వారా యీశైలి బ్రహ్మదేశమునకు దిగియుండవచ్చుననియు ఫెర్గుసనుగారి యభిప్రాయము. కాంభోజమునందలి చదరపు స్తంభములు ఈజిప్టుశిల్పరచనకనుకరణములని వీరే మరియొకచోట వ్రాసిరి. విజ్ఞానమంతయు పాశ్చాత్య దేశములందు బుట్టినదనియు, తరువాత తూర్పుదేశములు కల్గినిప్పినవనియు చెప్పెడి యైరోపాపండితుల పలుకు బడి గలించినది. "ఆర్చి", శిఖరము మొదలగు శిల్ప

విధానములు తూర్పునుండి - ముఖ్యముగ భారతదేశము నుండి-పశ్చిమదేశములకు వ్యాపించినవనియు, చదరపుభవన నిర్మాణములు హిందువులకు క్రొత్తవి కావనియు పరిశోధనవలన తెలిసినది. హిందూదేశముయొక్క సనాతన నాగరికతకు కళంకము నాపాదించెడి యిట్టి పాశ్చాత్య పండితుల యభిప్రాయములను బరిశీలింపనిది విశ్వసింప రాదని పాఠకులకు మనవి.

చైనా, తిబెత్తుల పరిచయమువలన రానురాను బ్రహ్మదేశముయొక్క హిందూశిల్పశైలి మారిపోయినది. ఇదివరకు నామోదమునందుండిన చక్కని హిందూవలయచతురస్రాకారశిఖరములకు బదులు కొసకు వెళ్లినకొలది సన్నముగ పరివర్తనము బొందు శిఖరములు నిర్మితములు కాజొచ్చినవి. మొదలు వలయముగను, సాధారణముగ సుంద్రముగను ఉండి, కొంతయెత్తులోనే సన్నముగ మారి మేఘముల కంటుకొనునట్లు యెత్తుగ బెరిగిన యీనిర్మాణము లన్నియు చాల వెలితిగ, సౌందర్యరహితములుగ నున్నవి. హిందూశిఖరముల నిండు, అలంకారముల సొంపు వీటియందు కానరావు.

వలయముగనున్న పునాదులుకల నిర్మాణములలో కోంసుమెండు వద్దనున్న స్తూపమువంటి యాలయ మాకారమున క్రీ.పూ. సుమారు రెండవశతాబ్దములో అనురాధపురమున నిర్మింపబడిన దాగబ(Dagoba)ను బోలి యున్నది. దీనిచుట్టును ౭౮౮ రాతి స్తంభములు ఆవరణవలె నున్నవి. ఇది సుమారు క్రీ. శ. ౧౬౩౬-౧౬౫౦ లో నిర్మింపబడినను భారత, సింహళదేశముల ప్రాతనిర్మాణములను బోలియుండుటచే వాటి యనుకరణమే యగును.

చైనా శిల్పవ్యామోహముయొక్క ప్రారంభము షాయిమూడు శిఖరమున జూడవచ్చును. ఇది హిందూస్తూపమునకును, చైనావిధానమున నాతరువాత బ్రహ్మశ్యామదేశములందు నిర్మితములైన స్తూపములకును తప్పియున్నది. పునాది మొత్తముమీద వలయముగ నున్నను బహుముఖ సమకోణాకారముగ విడదీయబడియున్నది. చుట్టును స్తంభములకు బదులు చిన్నశిఖరములు రెండు వరుసలుగ నుండుటచే వింతగ గానవచ్చును. శిఖరపు మీదిభాగముమాత్రము పూర్తిగ వలయముగ మారినది. పునాదియాక్రమించిన విస్తీర్ణము ౧౩౯౧ చదరపుటడుగులు. సుప్రసిద్ధమగు సెంటుపాలు కెథీడ్రలంత యెత్తుగ (౩౯౧ అడుగులు) నున్నది. చాలకాలముక్రిందట నిరువురువర్తకులు దీని నిర్మాణమును బ్రారంభించిరనియు, పిమ్మట నాప్రాంతముల రాజు లప్పుడప్పుడు శ్రద్ధబూని పూర్తిచేసిరనియు ప్రతీతి.

రంగూననందుగల షాయిడగాంగ నిర్మాణము షాయిమూడు స్తూపమును బోలియున్నది. కాని శిఖరము



మరికొంతసన్నముగ పరిణమిల్లి శిల్పపరిణామమునందు రెండవయుగముయొక్క రుచులకు చిహ్నముగ నున్నది. గౌతమబుద్ధుని ఎనిమిది తలవెండ్రుకలును, క్రీ. పూ. ౩౦౦౦ సంవత్సరముల క్రిందట నివసించిన కాకసంధుని చేతికర్రయు, కోనగమ్మని జలపాత్రయు, కశ్యపుని గావంచాయు, వీటిపై గట్టబడిన చిన్నస్తూపమును దీనియందు గర్భితమై యున్నవని ప్రతీతి. ఇటీవల దీని

ననుసరించి యనేకములను చిన్నస్తూపములు నిర్మింపబడినవి.

బౌదాపాయ యను రాజు అమరపురమునకును, మాండలేకును మధ్యనున్న మెంగును అనుచోట ౧౭౧౬లో నొకమహాస్తూపమును నిర్మింపబూనుకొనెను కాని రాజకీయపరిస్థితు లనుకూలముగ లేకపోవుటచే సగము లో నిలిచిపోయినది. బోరొబుదరు, అనురాధపుర స్తూపములందువలెనే యాత్రికులు ప్రదక్షిణము చేయుటకు చుట్టు నైదుమార్గము లిచ్చట నిర్మితమైయున్నవి. స్తూపమునంటి సర్పములను సూచించుటకు గాబోలును వంకరలుగ నలంకృతములైన "పిట్ట గోడ" లున్నవి. నాలుగు వైపుల నెత్తయిన మెట్లవరుస లున్నవి. అనురాధపురమున గల మూడుమార్గములు నిచ్చట నైదుగ పెంచబడినవి. అన్నిటికి నావరణముగ నున్న చిన్న గోడ యనంతుడని చెప్పుదురు.

ఈస్థలముననే మరియొక్క సగము కట్టబడిన నిర్మాణముకలదు. పూర్వము హిందూశైలి ననుసరించి పాగనువద్ద కట్టబడిన చదరపునిర్మాణమువంటిది కట్టి యాసనాతనవిధానమును పునరుద్ధరించుటకు బౌదాపాయుడుచేసిన ప్రయత్నమునకుఫలమిది. పూర్తియైనయెడల ప్రపంచమునందుగల యన్నినిర్మాణములకును మించిన యెత్తుగ నుండెడిది. ౧౮-వ శతాబ్దము నిట్టి నిర్మాణమునకు బూనుకొనుట కారాజుయొక్క యుత్సాహమంతులేనిదై యుండవలెను.

సాధారణముగ భారతదేశమునందలి హిందూ దేవాలయ శిఖరములం దంతస్తుపై నంతస్తును, మీదికి వెళ్లినకొలది పరిమాణములం దీయంతస్తులు చిన్నవగుటయు, చివర కొక ఆమలకాకారమో, కమలాకారమో యుండుటయు నీశిఖరముల యందమునకు కారణములు. నిర్మాణమునం దీప్రధానసూత్రములను గైకొని, శైలియందు చైనావారి ననుకరించి, బర్మాదేశీయులు వింతయైన నూతనశిఖరములను కల్పించిరి. దీనికి మంచి నిదర్శన మాదేశపు రాజుయొక్క నగరద్వారము. ఇం దొకొక్కొక్క యంతస్తు నలంకృతమైన సాధారణ గృహమువలె నుండును. మీదికి పోయినకొలది పరిమా




ణములం దంతస్తులు విశేషముగ తగ్గకపోవుటవలనను, చివర పొడుగుపాటి సూదివంటికట్టడ ముండుట వలనను శిల్పవిధానమునందు వెలితిగ నున్నది.

విహారము లింతగొత్తుగ నుండవు. బర్మాయందు గృహములలో నధికాంశములు కర్రలతో గట్టబడును కనుక విహారమొకటి పూర్తియైనతరువాత నలంకారప్రాయముగ మలచబడిన దారుఫలకములు మొదలైనవి తొలినిర్మాణముల కతుకుటకలదు. ఈవిధముగ కొన్ని విహారములు చాలా విరివిగ నలంకరింపబడియున్నవి.

పెంకులతో నున్న యింటికప్పువలె కలపతో కప్పులను నిర్మించుకొనుట బ్రహ్మదేశమున నాచారమైనది. ఇట్టికప్పులనే యొకదానిపై నొకటి నిర్మించి శిఖరములుగ నేర్పరచుకొని కొన్నివిహారముల నాదేశమున గట్టుకొనిరి. ఇవి వింతగ గనబడునేకాని సుందర




ముగ నుండవు. తొలుత చైనా, టిబెత్తు లీవిధానము నకు జన్మస్థానమై యుండవలెను. నేపాలమునందును కొన్ని నిర్మాణములు కానవచ్చుచున్నవి.

తాటూను, ప్రాతప్రోము మొదలగు సనాతన హైందవనగరములవద్ద వైష్ణవ, శైవ శిల్పచిత్రములు లభించినవి. ఇవి హిందూచిత్రకారులచే మలచబడి యుండవలెను.

రానురాను నిర్మాణమున రుచులు మారినను శిల్పమునందుమాత్రము హిందూ ప్రాబల్యము చాలా వరకు నుండినది; ఇప్పటికి నున్నది.

ఎనిమిది, తొమ్మిది శతాబ్దములనాటి ప్రతిమా నిర్మాణము గుప్తులరచనను పోలియున్నది. హ్లాంగు గ్యాంగు దేవాలయమునగల ౧౧-వ శతాబ్దమునాటి దశావతారశిల్పచిత్రములు కొన్ని స్వల్పమైన మార్పులతో హిందూరచన ననుకరించినవి. ఆనాడు బీహారు, వంగ దేశములనుండి ప్రతిమ లెనుమతియైనటుల నిదర్శనములు కలవు. దూరనిదాన, లలితవిస్తరముల ననుసరించి యానందదేవాలయమున మలచబడిన శిల్పచిత్రములందును, ఆదేవాలయమును కట్టించిన క్యాంశిత్తుడను రాజవీరుని ప్రతిమలందును బర్మాశైలియొక్క పరివర్తనము గోచర మగుచున్నది. ఒకొక్కొక్క చిత్తరువు నొకొక్కొక్క గూటియం దుండుటచే నివి ప్రత్యేకచిత్రములుగ నున్నవి. అంగ విన్యాసమునందును, భావ ప్రదర్శనమునందును చక్కగను, స్ఫుటముగను ఉండుటచే సుందరముగ నున్నవి.

పెళ్లేకు, ఆనంద, ష్వేజిగాను, మింగలజేడి మొదలగు దేవాలయములందు మెరుగుపెట్టబడిన యిటుకలపై జాతక కథలు హిందూశైలిని చిత్రితములై యున్నవి.

కుబేజతుపాయ, కుబ్యాక్యి దేవా లయములందు గోడలపై జాతకకథలు విరివిగ చిత్రితములై యున్నవి. ప్రత్యేకముగ వ్రాయబడియున్న బుద్ధుని, బోధిసత్త్వుల రూపపటములు చాలా పెద్దవిగ నున్నవి. పాయతోంజు



[బుద్ధునివిగ్రహము. బర్మాయందు ౧౨-వ శతాబ్దమునాటి శిల్పశైలి యిందు గోచరమగును.]

దేవాలయమున బౌద్ధహిందూమతముల కలయికవలన బుట్టిన తాంత్రికబౌద్ధమత చిత్రములు కలవు. ఇందు చాలా అశ్లీలములుగకూడ నున్నవి. క్యాంశిత్తు చిత్రము లందు చైనారచనయొక్క చిహ్నములును, కొన్ని

చిన్న దేవాలయములందు పాశ్చాత్యశైలి చిహ్నములును కానవచ్చుచున్నవి. ఇవి గతశతాబ్దమున వ్రాయబడినవై యుండవలెను.

రచనయం దీచిత్రములలో నధికాంశములు వంగ నేపాలదేశముల సనాతనచిత్రములను పోలియున్నవి. నయనముల రచనయందు గుజరాతు జైనచిత్రములను స్మరింపజేయునవిగ నున్నవి. అంగవిన్యాసము సుందరముగ నున్నది.



[పద్మపాణి. ౧౩-వ శతాబ్దమున బర్మాయందలి కుడ్యచిత్రరచనను తెలియజేయును.]

ప్రోమువద్దనున్న శిల్పచిత్రములు కుశాన - గుప్త రచన ననుకరించినవి.

తాటూనువద్దగల మృత్తికాఫలకములపై శైవమత చిత్రములు కలవు.

పండ్రెండవ శతాబ్దముతరువాత నిర్మాణవిధానములందు గలిగిన మార్పువంటిదే శిల్ప, చిత్రరచనలందును గలిగినది. హిందూసంప్రదాయములను బ్రహ్మదేశవాసులు విడనాడినపిమ్మట సృజింపబడిన చిత్రములు భావమునందును, రచనయందును పటుత్వములేకయున్నవి. ఇంతటితో నీదేశము చిత్రరచనయందు వెనుకబడినది.

లక్కతో దారుఫలకములపై చిత్రించుటయం దీదేశమువారు కొంతప్రవీణులు. స్తంభములు, పెట్టెలు, గ్రంథములపైనుండు దారుఫలకములు నిటుల చిత్రితములగుట సుప్రసిద్ధము. కొన్ని స్థలములందు జాతకకథలను, బౌద్ధమతముయొక్క వేల్పులను చిత్రించెదరు. వీటిలో కొన్ని అతిసుందరమైనవి కలవు. నల్లని రంగుపై బంగారువర్ణముతో నలంకరించుటయం దీచిత్రకారులు మంచి ప్రవేశమును కలుగజేసుకొనిరి.

బర్మాదేశపునగలు కొన్ని సుందరముగ నుండును.* ఇతరదేశములవారి కమ్మటకిప్పుడు చేయబడుచున్న వంతబాగుగలేవు. జేగంటలు మొదలగు కంచు సామానులను, విగ్రహములను చేయుటయందును, పట్టువస్త్రములపై జరీబుటాల నల్లుటయందును బ్రహ్మదేశపు పనివాం డ్రతినిపుణులు.

నాట్యకళయందు ఈదేశము హిందూదేశము ననుకరించినది. కాని రానురా నీకళయందు అనేకములగు మార్పులు ప్రవేశించినవి. తోలుబొమ్మలతో రామాయణకథనంత నిప్పటికిని ప్రదర్శించుచుందురు.

---

* వీటి ఛాయాచిత్రము లిదివరలో భారతియందు ప్రచురింపబడినవి.

# మూఢతీర్మానాలు

కనుపర్తి వరలక్ష్మమ్మ

## ౧

రాత్రి యెనిమిదిగంట లైంది. రాఘవరావు భోజనంచేసి కొంచెముసేపు అటూయిటూ షికారుచేసి వ్రాతబల్లముందు కూర్చొని యేదో వ్రాయటం ఆరంభించాడు. ఇంతలో రాజేశ్వరి వంటయింటి పనులన్నీ సర్దుకొని పిల్లకు పాలుపట్టే సీసా, గిన్నెలు, చెంచా, వేడినీళ్లూ అన్నీ సరిచూచుకుంటూ, చప్పున జ్ఞాపకంవచ్చి "యేమండీ! రబ్బరుపీక తెచ్చారా? పొద్దున్నే చెప్పితినే! ఇప్పుడు బిడ్డలేస్తే పాలుపట్టేదెట్లా? మధ్యాహ్నమే ఆపీకతో యెంతో అవస్థపడ్డానే" అన్నది పెనిమిటితో.

"అబ్బా పోనూ! పాడుగోల! ఎన్నిడజన్లు తెచ్చినా నిముషంలో ఫైసలుచేసి మళ్లీ పీకలు పీక లంటూ పీకమీద గూర్చుంటావు."

"అదేమిటండీ అట్లాఅంటారు. పసిబిడ్డతోగూడిన పని ఆయెను. ఆపిగిలిన పీకతో పాలుపట్టితే బిడ్డ గుడ్డు గుడుచుకోదండీ."

"కథ పట్టులో ఉన్నది. మాట్లాడించకు. రసం చెడుతుంది."

"మీ రాకథలో ఉంటే యిక్కడ యీకథ గడిచేదెట్లా? ఇప్పుడు యేమంత పొద్దుపోలేదు. ఒక్క మాట్లు షికారుగా బోయినట్టు పోయి ఒక్కపాలపీక కొనుక్కొస్తురూ. మీకు పుణ్యముంటుంది. మళ్లీ ఆలస్యమైతే దుకాణాలు కట్టివేస్తారేమో."

"మ రేమీ భయంలేదు. ఈబస్తీలలో రాత్రి పదిన్నరగంటలదాకా అంగళ్లు తీసేఉంటాయి. పాల పీకలు దొరక్కపోవు. ఈరోజుల్లో మీవంటితల్లులే యెక్కువని అందరికీతెల్సు. కాబట్టి దయచేసి నాకథా రచనకు అడ్డురాకు, ఏవేళకైన నీపాలపీక తెచ్చియిస్తాను గాని."

"మళ్లీ ఏమిటో కథ మొదలుపెట్టారే. అన్నట్టు నిన్నసాయంత్రం సినీమాకు వెళ్లివచ్చారు గాదూ? ఏ స్త్రీనో చూచివచ్చారుకాబోలు, మొదలుపెట్టారు కథ."

"నిజంగా నీకు మంచిజోస్యం వచ్చినట్లున్నది. తగినంత ప్రకటనలేక నీప్రతిభ కట్టుబడి ఉన్నది గాని లేకపోతే ఆమధ్య గాంధీగారి విడుదలనుగూర్చి రోజూ పత్రికలునింపిన దైవజ్ఞులకువచ్చినంత కీర్తివచ్చిఉండును."

"రోజూ మీరువ్రాసే కథలనుబట్టే చెప్పవచ్చు. దీనికి జ్యోతిష్యంగూడా రావాలెనా? ఎందు కింత హేళన గాని నిజంచెప్పండి, మీ కథావస్తువు స్త్రీయే కాదూ?"

"కావచ్చు."

"కావచ్చు నేమిటి, యెవరు వ్రాసినదానినో ఊహించినట్లు? నిజం అంతే! కాదూ?...... అవును. సందేహం లేదు. అయినట్టు మీ ముఖంవంక చూస్తేనే తెలుస్తున్నది."

"ఓహో! జ్యోతిషం ఒకటేఅనుకుంటూఉంటే సాముద్రికంగూడా చెప్పుతున్నావే. భేష్."

"ఊరిక హాస్యంచేయక చెప్పండీ, నేను ఊహించి నది నిజమేగదా."

"అబ్బ! నన్ను ఊరికె విసిగింపక వెళ్లిపో. నీ పాలబుడ్డీ, పీక నీకు తెచ్చి సమర్పించుకుంటా గాని ఒక్కక్షణమాగూ. కథ సాగనీ! మనస్సులో అచ్చు గుద్దినట్లు చిత్రించుకున్న దివ్యసుందర విగ్రహమంతా నిముషంలో వచ్చి చెడిపివేశావు."

"అదిగో దివ్యసుందర విగ్రహ మంటున్నారే యింకా సందేహమెందుకు? ఒకవంక కన్నుదోయి కన్యకాంత లడ్డంబైన మాతృభావముచేసి మరలవలె నంటూనేయుంటారు. పరనారీసహోదరుల మని ప్రగల్భాలాడుతునే ఉంటారు. కలం చేతబుచ్చుకుంటే

ఆడేదాని కథతప్ప మఱొకటి వ్రాయరు. ఇదేమి చిత్ర మండీ!"

"మఱేమి చేయమంటావు, యిప్పు డిటువంటి కథలకుగాని పత్రికాప్రపంచంలో చలామణిలేదు. హాస్యపుపత్రికలలో యివి మఱీముఖ్యం."

"పోనీ, ఆహాస్యపు పత్రికలకే వ్రాయకపోతే మఱొపత్రికకు మంచికథలు వ్రాసిపంపరాదా?"

"ఇతరపత్రికలకు పంపి యేమిలాభం? చదివే వాళ్లెవరు? ఏపత్రికలకూ వీటి వ్యాప్తిలేదు. అసలు ప్రజల అభిరుచే వీటిమీదఉన్నది."

"సరేలెండి. పిచ్చికథలన్నీ వ్రాసి పైన ప్రజల మీద తోసేస్తున్నారా, మొన్న యేదో పత్రికవారు ఒక ప్రత్యేకసంచిక ప్రకటించి ప్రజల యభిరుచి అన్నట్టుగానే?"

"నిజం అంతే. అవి యెన్నివేలో కర్చుపడ్డా యట, విన్నావా? దీన్నిబట్టి యేమి తేల్తున్నది. నేను నిష్ఠగా ఉంటున్నానుగదా, లోకమంతా అట్లాగే ఉంటున్న దనుకుంటున్నావు. ప్రజల్లో ముక్కాలు మువ్వీసం అంతా యిటువంటిరకమే. వీరి అభిప్రాయాన్నిబట్టే పత్రికలు గూడా సంచరిస్తున్నాయి. తమ సంచికలు అమ్ముడుపోకపోతే పత్రికాధిపతులు పత్రికలు ప్రకటించి యేమిలాభం? ప్రజల యభిరుచిని బట్టి వ్యాపారం సాగించడం వర్తకనీతి గదా."

"అవును, మంచిమాట చెప్పారు. వ్యాపార దృష్టే యీపత్రికలకు; లోకహితచింత లేదు. ఉన్నట్లయితే యిటువంటి వెఱ్ఱికథలు ప్రకటిస్తారా?"

"ప్రకటింపక యేమిచేస్తారు? ఇందాకనే చెప్పాను గా, ప్రజల యభిప్రాయ ప్రకారం పోవడం పత్రికల ధర్మమని."

"ఇదేమిటండీ, ధర్మమంటారు? ప్రవాహంలో పడి కొట్టుకుపోతూఉన్నవాడిని వెనుక నున్నవాడు ఒడ్డుకు లాగడం ధర్మమా, నీళ్లల్లో త్రోయడం ధర్మమా? పత్రికలు మంచిఆదర్శంగలవైతే ప్రజలదృష్టి వక్రంగా ఉన్నా మంచిమార్గానికి లాగుతాయి. మఱి పత్రికలే ఆమార్గాన నడుస్తూ ప్రజలయభిరుచి అట్లా ఉన్నదని సమర్థిస్తూఉంటే పత్రికల ప్రయోజనం యేమిటి? అయితే, మొన్న మనపెద్దవాడు గోగుపుల్లను సిగరెట్టుగా వ్రేళ్లసందున యిరికించుకొని నోట్లో పెట్టుకొని కాలుస్తూఉంటే వాణ్ణి చెంపపగలవేశా రెందుచేత?"

"అవును. ఆరేండ్లకుంకకు అదేమిపని, కాకపోతే?"

"వాడికి వాటిమీద అభిరుచి ఉన్నది, ఏమి చేయమంటారు? మంచిసిగరెట్లు దొరకక ఆగోగుపుల్ల పట్టుకొని అఘోరిస్తున్నాడు. తండ్రి అయినవారు మీరు వాడిఅభిరుచి తెలుసుకున్నతర్వాతనైనా అసలు సిగరెట్లు తెచ్చియిచ్చి 'కాల్చుకోరా నాయనా' అనక, చెంపలు వాయించడమా?"

"చాలు నీతెలివి. ఇకనోరుమూసుకో."

"మఱి మీరు చెప్పినదేగా? వెనుకోమాటు నేను మాయింటికొచ్చినకొత్తల్లో యెవరో ఒకావిడ అతిసన్ననిచీరొకటి కట్టుకోగా అది యెంతో బాగున్నదని నేను మోజుపడి నాకుగూడా అటువంటి చీరొకటి కొనిపెట్టండని నేను యెన్నివిధాల బ్రతిమలాడినా మీరు కొనిపెట్టారా, 'ఛీ యిట్లాంటిచీరెలు కట్టుకోడం మర్యాదకా'దని చీవాట్లుపెట్టారుగాని?"

"అయితే యెందు కీఉపన్యాసమంతా?"

"ఉపన్యాసంగాదు, అభిరుచిని బట్టి వ్రాస్తున్నామంటే చెప్పుతున్నాను. ప్రజల అభిరుచి వక్రంగానే ఉన్నా రచయితలు తమ రచనానైపుణ్యంచేత వారిని మంచిమార్గాన బెట్టాలె గాని నిద్రబోతురోగంతో కొట్టుకొనేవాడికి నల్లమందుఔషధం వేసినట్టుగా ప్రజల కుమార్గానికింకా దోహదంచేసే వ్రాతలు వ్రాయడమా? అయినా, యిప్పటి రచయితల ధోరణే యింతలెండి. ఇంతకంటె మంచికథలు వ్రాయడం వారివల్లగాదు."

"ఎంతమాటన్నావు? స్త్రీప్రశంస లేకుండా కథలే వ్రాయలేమా? మీరేనా మాకుదిక్కు?"

"నిజమే. వ్రాయగలిగేడుంటే యెవరువ్రాసినా ఒక్కమాదిరిగా బింబప్రతిబింబాలులాగా యీ కథ లేమిటి?"

"అదో షోక్."

"పాడుషోకు. ఇందువల్ల మీకెంత అపఖ్యాతి కలుగుతుందో మీరు ఆలోచించుకోడం లేదు. ఇంతకూ నేను మిమ్ములను ప్రార్థించేదేమంటే యిటువంటి కథలు వ్రాసి మీగౌరవం వమ్ముచేసుకోవద్దని."

"రాజ్ఞీగారి ఆజ్ఞ శిరసావహిస్తాను."

"ఇదుగో యివే మనుష్యులను మాడ్చేమాటలు. అదిగో......పిల్ల లేచినట్లున్నది. మీరు పాలపీక తేనే లేదు. మాటలుపెట్టుకొని కూర్చున్నారు. ఎట్లాగో!"

"బజారుకు వెళ్లబోతున్నవాణ్ణి అనవసరంగా కదిపి యీచర్చలోకి దింపి కథారచయిత లందరినీ దూసి పోస్తూ బజారుకు పోకుండాచేసింది నీవా నేనా?"

"సరే, నేనే లెండి. ఎందుకీవివాదం. బజారుకు వెళ్లిరండి త్వరగా."

"చిత్తము."

"మటిత్రోవలో హఠాత్సంభవాలేమైనాకనిపిస్తే కథకు సామగ్రి కూర్చుకుంటూ అట్లాగే నిలబడిపోతా రేమో! ఇది సినీమాలో మొదటిఆట విడిచే సమయం గూడాను."

"సరే, నేనుబిడ్డను చూస్తూఉంటాను. నీవుపోయి ఒక రబ్బరుపీక తెచ్చుకో."

"అమ్మో! నావల్లగాదు."

"నన్నుపంపలేవు. నీవువెళ్లలేవు. ఎట్లాపాపం?"

"అబ్బ! వెళ్లిరండీ! ప్రతిదానికీ ముక్కు పట్టుకుంటారు. మీరువెళ్లకుండా ఎవరుపట్టుకున్నారు?"

"సరేలే. నే నీరాత్రివేళ వెళ్లడం, నీవు సందేహించడం, మీ ఆడవాళ్ల నెవరినో చూచి యేదో వ్రాస్తానని ఉడుకోడం—ఎందు కీగోల? ఈరాత్రివేళ యీచీకట్లో యీచలిలో బజారికిపోవడం నాకూ కష్టంగానే ఉన్నది గాబట్టి నాకోటుజేబులో పాల పీకలున్న అట్టలపెట్టె ఉన్నది తీసుకోపో."

"అమ్మో యెంతవారండీ! తెచ్చి యింట్లో పెట్టేనా నన్నింతగా వాగించడం?"

"హుజూరివారి ఉత్తరువు ఉల్లంఘించి వస్తే అప్పటికప్పుడు పరువులుదీయిస్తారని భయంగానూ."

## ౨

రాఘవరావు అప్పుడే సాయంత్రపుషికారు వెళ్లి వచ్చి కాళ్లూ చేతులూకడుక్కొని తువ్వాలుతో తుడుచుకుంటూ వంటయింటిగుమ్మంముందు నిలబడి "యెక్కడికి వెళ్లిందండీ" అన్నాడు యింట్లో వంట చేస్తున్న అత్తగారితో. ఆవిడా అల్లుణ్ణిచూచి ఆత్రంతో నెత్తిమీది చెంగు సవరించుకుంటూ "ఎక్కడికో పేరంటానికి వెళ్లిం"దన్నది.

రాఘవరావు వచ్చి వాకిట్లో వరండాలో ఉన్న పడకకుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో పిల్లలిద్దఱూ గేటువద్దనుంచే "నాన్న, నాన్న" అంటూ పరుగెత్తుకొని వచ్చి యిదిగో! అరటిపండనీ, ఇదుగో మిఠాయిఉండనీ, ఇదిగో పంచదారచిలకనీ తండ్రిని ఊరించడం మొదలుపెట్టారు. రాజేశ్వరి లోపలికి వెళ్లింది. "ఓయి బాబో యెక్కడో పెద్దపద్దే పడ్డదే. చాలా కొట్టుకొచ్చారే"అంటూ రాఘవరావు బిడ్డలను ముద్దాడి"రాజేశ్వరీ!" అని పిల్చాడు భార్యను. రాజేశ్వరి లోపలినుంచీ ఊఁ అన్నదేగాని బయటికి రాలేదు యెంతసేపటికీనీ. రాఘవరావు బెట్టుమనిషిగాడు. ఆవిడ పలుకరిస్తేనే పలుకుదామనీ, ఆవిడ చెప్తేనే విందామనీ, తానే అడిగితే తనగొప్ప కేదో లోటనీ, యేదో విపరీతపు ఊహలతో యెక్కడనో ముడుచుకొని కూర్చుండే ప్రకృతిగా దతనిది. ఉల్లాసం ముందుపుట్టి తర్వాత అతను పుట్టాడు. ఒక్కమాటు బజారుకు వెళ్లివస్తే పుట్టెడు కబుర్లు కనుక్కొచ్చి వింతవింతకల్పనలతో అవి భార్యకు వినిపించి ఆవిడను నవ్వించి తానూ నవ్వు

తాడు. అట్లాగే భార్య యెక్కడికి వెళ్లివచ్చినా ఆనిశే షాలన్నీ చెప్పినదాకా వదిలిపెట్టడు. కబుర్లు చెప్పే విషయంలో రాజేశ్వరికిగూడా మంచి పాండిత్యమే ఉన్నది. అన్ని విషయాలూ బీరుబోకుండా పూసగ్రుచ్చినట్లు చెప్పుతుంది ఎక్కడకు వెళ్లివచ్చినా. కనుక ఆసతీపతులలో అరమీరలేదు. ఒకరినొకరు ముందుసల్కరించాలననే వంతు లేదు సరిగదా ఒకరు తెలుసుకొనివచ్చిన సంగతు లొకరికి ముందుముందుగా చెప్పాలని వంతులుపడుతుంటారు. ఈచనువులు మెండవటంచేత వారిమాటలు మరీ ధారాళమై శ్రుతిమించి రాగానపడుతుంటాయి కాని ఆటలో దెబ్బ అరటిపండని లెక్కలోఉండవు.

రాజేశ్వరి బయటికిరావడం ఆలస్యమయ్యేటప్పటికి రాఘవరావు తానే లేచి లోపలికివెళ్లి "రాజేశ్వరీ, మీఆడవాళ్లదే అదృష్టం. ఏదో పేరంటం పేరు చెప్పి రెన్నాళ్లకూ, మూన్నాళ్లకూ నోరుతియ్యబడేసుకుంటూ ఉంటారు. మామగవాళ్లకే పేరంటాలూ లేవు పాడు. ఎప్పుడైనా నల్గురమూ కలుసుకొని యేదైనా తినాలంటే, తలా ఒకటో రెండో వదలించుకోవాలె."

"అదే మంచిది యీపేరంటాల పేచీకంటె. ఇంటికోఅమ్మ చేరేదీ నోటికోమాట మాట్లాడేదీ." అని రాజేశ్వరి మూతిత్రిప్పి ముఖము ముడుచుకున్నది.

"ఓక్, యీమొఖంముడుపులకేమిలే. పేరంటమంటే యిష్టంలేని ఆడవాళ్లున్నారా? ఈపేరంటాలే లేకపోతే ఈ వన్నెవన్నెచీరెలూ, ఈ రకరకాల జాకెట్లూ, ఈహారాలూ, ఈపదకాలూ, ఈరవ్వల కమ్మలూ ఏమిగాను. ఎన్ని తెచ్చినా యేమీ తేలేదని మీ రుసరుసలూ, తేలేక మా కసకసలూ ఈగ్రంథమంతా ఎట్లా జరగాలి యీపేరంటాలు లేకపోతే. అయితే యెవరియింట్లో యివ్వాళ్ల పేరంటం?"

"ఎవరియింట్లోనో ఒకరియింట్లో. అవమానం పడివచ్చేందుకు యెవరి యిల్లయితేనేమి?"

"అవమానం యెందుకు జరిగిందీ? నీవూ ఓసిగ్గా పెట్టెలోసొమ్ములన్నీ పెట్టుకున్నట్టున్నావు. ఖరీదుగల చీరె కట్టావు. జంకీజాకెట్టే తొడిగావు. వేసవికాలమైనా పిల్లలను యీమూ జామూవేసి తీరిగానే అలంకరించి తీసుకపోయినావు. నీకు అవమానం జరగడానికి యేమీ అవకాశం లేదే?"

"చీరెలూ సొమ్ములూ చూచేనాయేమిటి మర్యాదచేసేది? చీరెలూ సొమ్ములూ సింగారించుకోకపోతేమాత్రము నన్నెరగరా ఈ వీథిలోవాళ్లు?"

"అయితే నీకెందుకు అవమానం జరిగింది? అసలు కథేమిటో చెప్పు."

"ఏమిచెప్పను, నలుగురిలో ఆవిడ ఆమాట అనేటప్పటికి తలవంపులైపోతే?"

"ఎవరావిడ? ఏమన్నది?"

"ఏమంటుంది? మీసంగతి మీకు తెలియదా?"

"ఇదేమిటి యివ్వాళ నీమాటలన్నీ కొత్తగా ఉన్నాయి. నీకేమన్నా పైత్యం ప్రకోపించిందా యేమిటి? వెఱ్ఱిమొఱ్ఱిగా మాట్లాడుతున్నావు? అసలు సంగతేమిటో చెప్పు."

"కావండీ, వెంకటచలంపంతులుగారి యింట్లో వారి అమ్మాయికి నూడివ లిస్తామని కామేశ్వరమ్మగారు పేరంటం పిల్చిపోతే, 'పోనీ యెరిగినవాళ్లు. పోకపోతే బాగుండదు. మళ్లీ యెప్పుడైనా వాళ్లు మాయింటికి రావద్దా' అని వెళ్లాను."

"వెళ్లితే యేమి నష్టంలే. బుట్టెడు శనగలూ, నాల్గు లడ్డువులూ, నాలుగు అరటిపళ్లూ, నాల్గుచిలకలూ, నాల్గు తములపాకుబీడాలూ బోలెడు వసూలుచేసుకొచ్చావు."

"సమయాసమయా లెరుగకుండా యీ హాస్యాలాడితేనే కోపంవస్తుంది."

"ఆఁ. వెళ్లావు. కోపం ఆనిక రానివ్వవచ్చు. కానీ."

"ఈకథలతోనే వచ్చింది మావ్యథ అంతా."

"ఏమి నాకథలంటే యింత కొటకొటలాడు తున్నావు?"

"మీకథలవల్లనేగదా నేను అందరిలో అవమానం జెందింది."

"ఇదేమిటి, ఆఖరుకు మీపేరంటాళ్లదాడి నా కథలమీది కొచ్చిందేమి?"

"ఎల్లకాలము మీకలపు దాడి ఆడవాళ్లమీదనే అయితే వాళ్లుమాత్రం ఎన్నాళ్లు సహిస్తారు?"

"సరే. నీకు జరిగిన అవమాన మేమిటో చెప్పు. దానికి ప్రతీకారం నేను చేస్తాను. అరగంటైంది. సంగతి తేల్చవు."

"నేను వెళ్లేటప్పటికే ముత్తయిదువులంతా హాలు నిండా కూర్చొని ఉన్నారు. నేనూ వెళ్లి ఒకచోట కూర్చున్నాను. కూర్చోగానే ఒకావిడ నన్ను యెగాదిగా జూచి యీామె యెవరని పక్కనున్న ఆవిడను అడిగింది."

"ఔను, దర్జాగా ఉన్నావుగాదూ."

"మనమేమి అంత యింటిపేరూ, వాకిటిపేరూ లేని అనామకులము కాదు గదా. చెప్పవచ్చునా? 'ఆ కథలు వ్రాస్తాడే ఆయన పెళ్లా'మన్నది. 'ఏమిటీ! హాస్యపు పత్రికలలో ఆడవాళ్లమీద కథలు వ్రాస్తూఉంటాడే ఆయన పెండ్లామా?' అని ఆవిడ వికవికా నవ్వింది. ఆవిడ నవ్వగానే యీావిడా నవ్వింది. 'ఈవిడైనా చెప్పదు కాబోలు'నని మొదటావిడన్నది. 'ఈమెకూ యిష్టమేమో' అని రెండోఆవి డని మళ్లీ నవ్వింది. నాకు చచ్చినచావైపోయింది. తల నేలకు వంచు కున్నాను. ఏదైనా ఖ్యాతిపనైతే ఫలానీఆయనభార్య యీామె అంటే సంతోషంగా ఉంటుంది గాని, ఇట్లాంటి సందర్భంలో ఆయనగారిభార్య యీామె గారే అని వ్రేలుపెట్టి చూపిస్తే నలుగురిలో యెంత అవమానంగా ఉంటుందో చూడండి." అని రాజేశ్వరి కళ్లనీళ్లు గోటజిమ్ముతూ తల వంచుకుంది.

"సరిసరి, దీని కిదిగూడానా? నీ వింత తెలివి తక్కువదానివిగా కనపడబట్టే వాళ్లట్లా ప్రేలిపోయి నారు. అయినా మీ ఆడవాళ్లకీ దుర్గుణ మున్నదే. పోవలసినచోటికి సూటిగా బోయి కావలసిన పనేదో అయినతర్వాత నెమ్మదిగా కొంపకు రారు. సమయా సమయాలు గమనించకుండా అనవసరపు జోక్యాలు కల్పించుకొని అప్రస్తుతప్రసంగాలు చేస్తుంటారు."

"అయినా నేను యెన్నిమార్లు మీతో మొఱ బెట్టుకున్నాను, ఇట్లాంటి కథలు వ్రాయవద్దని. మీరు విన్నారుకాదుగదా. పైగా నాకుగూడా యిష్టమని వాళ్లు అనుకుంటున్నారు. నిజం వాళ్ల కేమితెలుస్తుంది."

"వాళ్ల కేమితెలియాలె. మనయిష్టం మనది. మనచేతిలో కలానికి వారి పెత్తనమేమిటి? లోకమంతా ఒకటిగా ఉంటుందా? నాకథలు చాలా బాగా ఉంటాయని యెంతమంది మిత్రులు ప్రశంసిస్తూ ఉత్తరాలు వ్రాశారో నీకు తెల్సుగదా. ఇక పత్రికాధిపతుల పొగడ్తలకు లెక్కలేదు. ప్రతిసంచికలోనూ మీకథఉంటేనేగాని మాపత్రికకు శోభలేదని వ్రాస్తూ ఉంటారు."

"అవునుగాని నీళ్లంతా మగవారేగదా. నెమలి కంటి కన్నీరు వేటగానికి కనుపించుతుందా?"

"మీరంతా నెమిళ్లూ, మేమువేటగాళ్లమూనా!"

రాజేశ్వరి చిఱునవ్వు నవ్వింది.

"అబ్బో ఎంత జాత్యభిమానము!" అన్నాడు రాఘవరావు.

"అవును. నేను మొదట స్త్రీని. తర్వాత మీకుభార్యను. మాస్త్రీలలో ఒకరినంటే ఒకటే, ఒకరినంటే ఒకటేనా. ఇప్పుడు మనతెలుగుపత్రిక లంతటా తమపై విచ్చలవిడిగా వ్రాయబడుచున్న కథానకములు చూచి స్త్రీప్రపంచమంతా యెంత ఆగ్రహమునూ, అసహ్యమునూ, విచారమునూ పొందుతున్నదో మీకేమి తెల్సు. మాసమాజములో యిటువంటి కథ

లేవైనా చదువుతూఉండగా వాళ్లు మాట్లాడే మాటలు వింటే తెలుస్తుంది వాళ్ల పరితాపమూ, రోషమూ. నిజంచెప్తా వినండి. నాకుగూడా యిటువంటి కథలంటే అసహ్యమే సుమా. అయినా మీరు మీకథలు వ్రాసేభారము మీమీదే వేసుకోకుండా నన్నుగూడా కల్పుతుంటారు. దీన్నిబట్టే గాబోలు,వాళ్లు నేనుగూడా మీకు సాయమేనని అన్నారు. ఏమైనాసరే ఈమాటు మీరు 'నేనూ మారాజేశ్వరీ'. అని కథవ్రాస్తే నేను ఊరుకోను."

"డ్యామేజీసూటు తెస్తావా, డైవోర్సు కోరుతావా ?"

రాజేశ్వరి పకాపకా నవ్వింది.

"ఇకలే.వంటైందేమోకనుక్కో.ఆకలవుతున్నది" అని తువ్వాలు రాజేశ్వరిమీద కొట్టి ఆమెచేతిలో అరటిపండు తీసుకొని ఒలిచి నోట్లోవేసుకుంటూ 'త్వరగా భోజనంచేస్తే ఒకకథైనా వ్రాసుకుంటా'నంటూ నవ్వుతూ వాకిట్లోకి వెళ్లాడు రాఘవరావు. "అదిగో మళ్లీ కథ వ్రాయాలనే"అన్నది భయపడేమొఖంతో రాజేశ్వరి.

వంటమనిషి జబ్బుచేసి ఊరికి వెళ్లినప్పటినుంచీ తల్లీ ఉండి వంట చేసిపెట్టుతూన్నా రాజేశ్వరి పనికి చాటుగానే ఉన్నది. వంటకత్తెమీద వదిలిపెట్టినట్టుగా తిండితిన్న వెండికంచాలుగూడా వదిలిపెట్టివచ్చి పెనిమిటితో ముచ్చట్లాడుతూ కూర్చోడానికి వీలుగావటం లేదు. రాజేశ్వరి తమ స్త్రీసమాజంనుంచి యింటికిరాగానే బాగా ప్రొద్దు క్రుంకింది. పిల్లలు అన్నానికీ, పాలకూ గీగా అని గోలపెట్టడం మొదలుపెట్టారు. వెంటనే యెడపిల్లలిద్దటికీ కంచాలు వాల్చి అన్నం తింటూ ఉండండని కూర్చోపెట్టి పసిబిడ్డకు పాలు పట్టింది. పిల్లలుముగ్గుర్నీ స్తిమితపఱచేటప్పటికి రాఘవరావు వచ్చాడు. రాఘవరావుగూడా భోజనంచేసినతరువాత రాజేశ్వరిభోజనంచేస్తూఉంటేతల్లిగూడాఫలహారం అయిందనిపించింది. అంత యిద్దఱూ లేచి చెఱోకపని చేసుకొని వంటయింటి తలుపులన్నీ వేసి బయటబడ్డారు. లక్ష్మీదేవమ్మగారు నెమ్మదిగా వెళ్లి ప్రక్క గదిలో ఉన్న నవారుమంచముపై మేను వాల్చింది. రాజేశ్వరి తాంబూలపు సరంజాం తీసుకొని గదిలోకి వస్తూ పడకకుర్చీలో కూర్చుండి యేదో కులాసాగా భావగీతా లాలాపిస్తూఉన్న పెనిమిటినిచూచి నవ్వుతూ "యివ్వాళ మా సమాజంలో యేం జరిగిం దనుకున్నా" రన్నది. "ఏమి టేమి" టన్నాడు రాఘవరావు.

"ఇవ్వాళ సోమవారం పత్రికలు చదివేరోజు గదా.రోజూ యీ పిల్లలతో చదువుకోడానికి వీలే ఉండదు. అక్కడికి వెళ్లితే అన్ని విషయాలూ విని తెలుసుకోవచ్చునుగదా అని వెళ్లాను."

"వెళ్లితే?"

"అసలు మావాళ్లీతమాషాపత్రిక లేవీ చదువనే చదువరు. ఏ కృష్ణాపత్రికో, యే ఆంధ్రపత్రికో, ఏ భారతో, ఏగృహలక్ష్మో తీసి అందులో ముఖ్యమైన దేశవిషయాలు, సంఘవిషయాలు, ఆర్థికవిషయాలు, విదేశ వృత్తాంతాలు, గాంధీమహాత్ముని వ్యాసాలూ యిట్లాంటివి చదువుతారు. తెలియని విషయాలు చెప్తారు. అట్లాగే సభ ఆరంభమైంది. కృష్ణాపత్రికలోని జాయింటుకమిటి రిపోర్టుమీద'బయటపడిన'దనే ప్రధాన వ్యాసం చదివి వాటిమీద చర్చలుచేశాము. దానితోనే చాలాకాలం గడిచిపోయింది. తర్వాత ఆంధ్రపత్రికల్లో అక్కడక్కడ ముఖ్యమైనవి చదివి భారతిలోగూడా ఒకటి రెండు చదివాము."

"ఒకపత్రికను ఒకరమే చదువుతాము. మీ ఆడవాళ్లు ఒక్కదానినే అందఱూ చదువుతారా? ఒకరు చదివి వినిపిస్తూఉంటే బడిపిల్లల్లాగా అందఱూ తలా తలా ఒకసంచిక చేతిలోబట్టుకొని చూస్తూఉంటారా ఏమిటి ?"

"ఏమిచిత్రమండీ! పత్రికలంటే ఏదో ఒక్కటే ఉంటుంది గాని వచ్చినవాళ్లందటికీ తలాఒకటే యెక్కడ దొరుకుతాయి. అంటే అన్నీ ఒకరే చదువరు. తలా కాసేపు చదువుతారు గనుక అందఱూ చదివినట్లే అనుకుంటాము."

"ఓహో! అదా సంగతి. తర్వాత."

"తీరా చదవడం అంతా అయి లేవాలను కుంటూ ఉండగా అక్కడ పడిఉన్న హాస్యపు పత్రిక నొకదానిని చూచి 'దీనిలోగూడా ఒక్క కథ చదవం' డన్నది కమలమ్మగారు. "ఎబ్బే, వద్దు. అవి సరసంగా ఉండవండీ" అన్నది మహాలక్ష్మమ్మగారు. 'మఱీ అంత మోటగా పోకుండా మృదువుగా వ్రాసేవారున్నారు. వారి కథ్లైనా చదవండి. పాపం, 'కమలమ్మగా రడుగుతున్నా' రన్నది వెంకటలక్ష్మమ్మగారు. 'అయితే చదువుతా ఉండండి' అని మహాలక్ష్మమ్మగారు పత్రిక చేతికి తీసుకుని ఒకకథ చదవడం ఆరంభించింది. ఏదో ఒకటిరెండుపేజీలు బాగానే నడిచింది. ఏమో యిట్లాగే తక్కిన రెండుపేజీలు గడిస్తే బ్రతికిపోతా మనుకున్నాము. ఇక నేమున్నది, రంగు మాఱింది. క్రమంగా చిత్రాంగీసారంగధరులు నేపథ్యంలోనుంచి తొంగిచూడటం మొదలుపెట్టారు. అదైనా మృదువుగా పోతుందేమో అనుకున్నాము. దానిలుబంగారం గాను, ఆకథానాయకి చిత్రాంగికంటే నాలుగాకు లెక్కువ చదువుకున్నది. చెప్పలేను దానిమాటలు. ఆసవతి మేనల్లుణ్ణి పట్టుకొని అది వేధించిన వేధింపు, ఆడినమాటలు, రామ! రామ! అందఱము చెవులు మూసుకున్నాము. అమాయకురాలు కమలమ్మగారు దాని వికృతపుమాటలకు నవ్వుతూ ఉంటే 'నాకు నవ్వు రావడంలేదు. ఒళ్లు మండిపోతూ ఉన్న' దన్నది లక్ష్మీనరసమ్మగారు. 'ఇక ఆపివేయండీ! దాని దుంపతెగ, పూర్తికాకపోతే మానె' అన్నది కటకటపడుతూ వెంకటలక్ష్మమ్మగారు. మహాలక్ష్మమ్మగారికి గూడా చదవడం దుస్సహం అనిపించిందిగాబోలు కథ పూర్తికాకుండానే ఆపివేసింది. 'ఇందుకేనండీ, నే నిటువంటి కథలు మొదలుపెట్టను. నాకు భయమే. నల్గురూ కూర్చొని ముచ్చటగా చదువుకోవగ్గని కావివి' అన్నది మహాలక్ష్మమ్మగారు.

"నిజంగా యిటువంటి ఆడది యెక్కడైనా ఉంటుందా? ఎటువంటి అనుచితపు కల్పన అండీ అన్నది లక్ష్మీనరసమ్మగారు.

"కథకుల కలములలో కాంతలు యెంత యెల్లిదమై పోయినారండీ. నిజంగా సహింపదగ్గ విషయం కాదన్నది వెంకటలక్ష్మమ్మగారు."

"అయ్యో! అంతా పూర్తిగా చదువకపోయినారా! మీకోపం కొంత చల్లారునే" అన్నాడు రాఘవరావు.

"ఏమీ చివర యేమైందీ?" అన్నది రాజేశ్వరి. "అది అంతా వట్టిఅబద్ధమని కథకుడే వ్రాశాడు" అన్నాడు రాఘవరావు.

"అయితే మీరుగూడా చదివారా ఆకథ?"

"ఆఁ. చదివాను."

"చదివేవాళ్లకు నోరు రాదాయె. వినేవాళ్లకు చెవులో సూదులు గ్రుచ్చుకుంటున్నట్టుంటే ఏమిటి చదివేది. అయినా వట్టిదని ఆకథకుడు చెప్తేనేగాని మాకు తెలియదా. అట్లాంటి ఆడది ఉంటుందా? ఎక్కడైనా వట్టిది కాకపోతే మేమెవరమూ నిజమనుకోలేదు."

"అయితే చివరకేమి చేశా" రన్నాడు రాఘవరావు.

"లక్ష్మీకాంతమ్మగారు చివాలున లేచి ఈరచనలమీద మన అసమ్మతి తెలియజేస్తూ ఒకతీర్మానం చేద్దాము. నిజంగా యీకథలు స్త్రీలను అవమానపఱిచేవిగానూ, దూషించేవిగానూ ఉంటున్నవి. వీటిని ఉపేక్షించడం స్త్రీల ఆత్మగౌరవానికి భంగకరమున్నది. నిజమేనంటె నిజమే నన్నారు, అందఱూ. వేరే యింకోసభ యెందుకు, యీ సభలోనే చేద్దామని లక్ష్మీనరసమ్మగా రన్నారు. వారసభను బహిరంగసభగా మార్చారు. ప్రెసిడెంటు నెన్నుకున్నారు. అందఱి ఉపన్యాసాలూ అయినతర్వాత మూడుతీర్మానాలు చేశారు.

"మొదటి తీర్మానం: ప్రస్తుతకాలంలో కొందరు పురుషులు వ్రాస్తూఉన్న కథలు స్త్రీలకుఅవమానకరముగా ఉంటూఉన్నవి కావున యిటువంటి కథలు వ్రాయడము అనుచితమని యీసభవారువారిని హెచ్చరిస్తూఉన్నారు.

"రెండోతీర్మానం: ఇటువంటికథలను ప్రచురించే పత్రికలు స్త్రీసంఘానికి ద్రోహం చేస్తున్నవి గనుక యిటువంటిపత్రికలను నిరసిస్తూ ఆంధ్రదేశమునందలి మహిళాసంస్థలన్నియు తీర్మానములు చేసి సదరు పత్రికాధిపతుల కందజేయవలయునని యీసభవారు ఆంధ్ర మహిళామణులను ప్రార్థిస్తూ ఉన్నారు.

"మూడోతీర్మానం: ఏపత్రికలైతే స్త్రీలనవమానించు ఇట్టికథలను విరివిగా చిత్రపటములతోసహా ప్రచురించుచున్నవో ఆపత్రికలను స్త్రీలు తమయింటికి రానీయరాదనియూ, ఒకవేళ వచ్చినట్లయితే చదువకుండానే వాటిని పట్టున చింపి వంటపాత్రలు వగైరాలు దించుకునే నిమిత్తమూ, యింకా పసిపిల్లల అశౌచములు వగైరాలు తుడిచేనిమిత్తమున్నూ వినియోగించవలయుననియు ఈసభవారు స్త్రీల నందరినీ హెచ్చరిస్తున్నారు.

"అని. అంతటితో ప్రొద్దుక్రుంకుంది. ఓయి బాబో, వంటవేళయిందంటూ అందఱమూ బిలబిలా యింటికి వచ్చా" మన్నది రాజేశ్వరి.

రాఘవరావు రాజేశ్వరి చెప్పినవృత్తాంత మంతా విని ఆశ్చర్యబోయి

"ఆఆడవాళ్లంతా అట్లాపెచ్చరిల్లి యిష్టమువచ్చినట్లు తీర్మానాలు చేస్తుంటే నీవేమి చేస్తున్నా" వన్నాడు రాజేశ్వరిని కోపంతో.

"నే నాసభకు అధ్యక్షత వహించా" నన్నది రాజేశ్వరి.

---

# మూడవ వజ్రహస్తుని గంజాంశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఈ శాసనము గంజాంజిల్లాలో దొరకిన దన్న దితక్క దీనినిగురించిన యితర విశేషములేవియు తెలియవు. దొరకునప్పటికి శాసనపు రేకులు చాలతుప్పుపట్టి అక్షరములు సరిగా కానరాకపోవుటచేత నావద్దకు రాక పూర్వమే రేకులకు సుత్తిదెబ్బలు తగిలినవి. అప్పటికిని తుప్పు వదలలేదుకాని వాటివల్ల ఒక్కనష్టము కలిగినది. నాలుగవ రేకు అక్కడక్కడ పేడులేచిపోయి అక్షరములు చెరగిపోయినవి. అయినను అవి లోతుగ చెక్కిన కారణమున వాటిని చక్కగ గుర్తింపనైనది. శాసనము నావద్దకు వచ్చినతరువాత మిగిలిన తుప్పును ద్రావకములద్వారమున వదలగొట్టి రేకులు శుభ్రపఱిచినాను.

లిపికాని, రేకులుకాని యేవిధమునను చెడక సురక్షితమయి, చక్కనిస్థితియందు దొరకిన కళింగదేశతామ్రశాసనములలో నిది యొకటి. ఈశాసనమున ఒక్కొకటి ౮.౧" అంగుళములపొడువును, 3.2" అంగుళముల వెడల్పునుగల అయిదు రేకులు కలవు. మొదటి రేకు మొదటిపెడను వ్రాతయేదియు లేదు. నాలుగవ రేకు రెండవపెడను మూడుపంక్తుల వ్రాత యుండుటచేత, రక్షణకొఱకు ఎడాపెడా వ్రాతలేనిది మఱియొక రేకు చేర్పబడినది. వ్రాతకాపుదలకొఱకే ఈ రేకుల కన్నిటికి అంచులు తీర్చినారు. వీటియెడమవైపున అంచునకు ౧.౨" అంగుళముదూరమున వాటి నన్నిటిని దూర్చియుంచుటకు రాగికడియము నకై రంధ్రములు చేసినారు. ఈకడియము వ్యాసము ౪.3" అంగుళములు. కడియపుకొనలు ౨.౧" అంగుళములవ్యాసముగల రాజముద్రిక యధోభాగమున తాపటము చేసియున్నవి. ముద్రికమీద నట్టనడిమిభాగమున ముఖము కుడివైపునకు త్రిప్పి ఎడమవైపు ముందఱికాలు వెనుకకుముడిచికొని, కుడివైపు ముందఱికాలు ముందుకువంచి పరుండియున్న చక్కనివృషభము కలదు. దానిమెడకు మువ్వలపటకా కలదు. నందిముఖమునకెదురుగ ముద్రికమీది కుడిభాగమున చంద్ర, సూర్యచిహ్నములు కలవు. చేసినదానమాచంద్రార్కసమకాలమై వెలయవలయుట కవిసంకేతములు. ఈ చిహ్నముల కుభయపార్శ్వములయందును (హేమ) చామరములు కలవు. వృషభమునకు కుడి ప్రక్కను పింఛాంచితములయిన రెండుకుంతములు(బల్లెములు) కలవు. ఎడమప్రక్కను శంఖమును, (ధవళ) ఛత్రమును, మకరతోరణమును, శంఖమునకుదిగువ భేరి(కాహళము)యును గలవు. ఈరీతిని ముద్రికమీద గనబడు చిహ్నవిశేషములన్నియు కళింగజనపతులు భగవంతుడయిన గోకర్ణస్వామి నారా

ధించి యాస్వామి యనుగ్రహమున పొందిన రాజలాంఛనములే[1]. చూడుడు, అనంతవర్మ చోడగంగదేవుని శాసన మేమి తెలుపుచున్నదో:"...ఆరాధ్య గోకర్ణస్వామిన మనుప్రసాదాసాదితధవలచ్ఛత్రచామరసామజ ధ్వజ వృషభలాంఛనపింఛాంచితకుంతఓకరమకరతోరణహుడుక్కాశాహలైకశంఖాది రాజ్యోచితైరుపశోభమా"నులట గాంగనరనాథులు. ఇంత స్ఫుటముగ కాన్పించుచిహ్నములతో దొరకిన కళింగగాంగరాజముద్రికలు చాలకొద్ది.

శాసనలిపి: భాష :

మన శాసనలిపి పరగాంగతామ్రశాసనములయందు వాడుక చేయబడుచు వచ్చిన నాగరియే. శాసనము చక్కగ భద్రపఱుపబడియుండినదగుటచేత పొంకముగ, మిక్కిలి ముచ్చటగ చెక్కినయక్షరములు చెక్కుచెదరక యున్నవి. వర్ణక్రమాద్యక్షరవిశేషములు ఇదివఱకు ప్రకటితమయిన వజ్రహస్తశాసనములయందు[2] కనబడువానివంటివే కాని క్రొత్త వేవియు లేవు. 'ఏ'ను ౧౮-వ పంక్తిలో చూడనగును. 'ద', 'డ' లకు వ్యత్యాసమంతగ కానరాదు. 'బ' కు తఱచుగ 'వ' యును, 'శ' కుబదులుగ 'స' యును వ్రాయబడినవి. ఒక్క 'ష' తక్క వెలుపలిగిలకతో నున్న హల్వర్ణములు ద్విత్వమును పొందినవి. వెలుపలిగిలకతోగూడినను 'జ', 'భ' వర్ణములు ద్విత్వములేకుండ వ్రాసినచోట్లును గలవు. 'త్రింశతమ్', 'వింశతమ్' అన్నపదములలో అనుస్వారమునకు బదులుగ మకారపుపొల్లే వ్రాయబడినది. ఈపొల్లు సున్నచుట్టి, దానిదిగువ నోకగీటు గీయుటవలన జూపబడినది. నకారపుపొల్లుండవలసినకొన్నిచోట్ల 'న' వ్రాయబడినది.

భాషయంతయు సంస్కృతము. వజ్రహస్తుని యితరశాసనములయందు కానవచ్చు సంధి, భాషావిషయకప్రమాదములే యిందును గానబడునుగాన వాటినిగుఱించి యిట విస్తరింపవలసినపనిలేదు. శాసనము కడకువెళ్లుకొలది తప్పులు హెచ్చగును. లేఖకుడు శాసనమును చాలఅశ్రద్ధగ వ్రాసినాడు. వజ్రహస్తుని యితరశాసనములలోవలెనే యిందును శార్దూలవిక్రీడిత, మాలినీ, వంశస్థాదులు కలవు. తామ్రశాసనములలో సాధారణముగ చివరచేర్పబడు వ్యాసగీతాశ్లోకము లిందు లేవు. బొడ్డపాడు తామ్రశాసనమునందువలె ఇందు శాసనము చెక్కినవానిపేరుకాని, వ్రాసిన వానిపేరు కాని తెలుపబడియుండలేదు.

శాసనవిషయము:

ఈశాసనము కళింగదేశమును బరిపాలించిన అనంతవర్మాభిధానుడగు మూడవవజ్ర

1. దీనినిబట్టిచూడగా వజ్రహస్త, రాజరాజాదిపరగాంగధరణీపుల తామ్రశాసనముద్రికలను మఱియొకమాఱు పరిశీలనగా పరీక్షింపవలసినయవసరము కలదు. నాగలియని భావింపబడుచువచ్చినచిహ్నము ధవళచ్ఛత్రమనుటకు సందియము లేదు. ఈముద్రికోపరిచిహ్నములనుగూర్చి వేఱొకమాఱు వ్రాసెదను.

2. నర్సీపట్నము, మందసా, నదగాం, శ్రీకాకుళం, చికాకోలవలస, బొడ్డపాడు, మద్రాసుమ్యూజియము శాసనములు.





K.P.S.

నటరాజదేవాలయము-ఉత్తరద్వారము  చిదంబరము  నటరాజాలయము-ఉత్తరగోపురము, తటాకతీరము

హస్తదేవునిది. ఈపత్రికయందే వెనుక నితని చిక్కాలవలస[3], బొడ్డపాడు[4] శాసనములు ప్రకటితమయినవి. ఈక్రొత్తశాసన మవి తెలుపని క్రొత్తచరిత్రాంశములు వేటిని తెలుపదు. ఒక్క దానమియ్యబడినగ్రామము, ప్రతిగ్రహీతలవిషయమున దక్క మిగిలినశాసనమంతయు ఇదివఱకు ప్రకటితమయినశాసనములకు సరియయిననకలు.

ఈశాసనము గంగవంశజులప్రశస్తితో నారంభమయి, గుణమహార్ణవ మహారాజు కొడుకయిన మొదటివజ్రహస్తునినుండి రెండవ వజ్రహస్తుని అగ్రసుతుడగు రెండవకామార్ణవభూపతికిని, వైదుంబవంశమను పాలసంద్రమునం దుద్భవించిన వినయమహాదేవికిని జనియించిన మూడవవజ్రహస్తునివఱకు గల రాజన్యులను వర్ణించును (పం. ౧ - 33 లు). ఈ మూడవవజ్రహస్తదేవుడే మన శాసనదాత. ఇతని యితరశాసనములలోవలెనే ఇందును ఇతడు శకాబ్దములు ౯౬౦ (వియత్తు ౦, ఋతువులు ౬, నిధులు ౯)లో సూర్యుడు వృషభరాశియందుండగా, శుక్లపక్షతృతీయా ఆదివారమునాడు రోహిణీనక్షత్రయుక్తధనుర్లగ్నమునందు పట్టాభిషిక్తు డయినట్లు తెలుపబడినది (పం. 33 - 3౯ లు). పిదప నతనిపరిపాలనమునుగూర్చినవర్ణనము (పం. 3౯ - ౪3 లు). వేస్యావంశోద్భవుడగు మల్లప్పనాయకుని మనుమడును, భీమననాయకునకును ప్రోలకవ్వకును పుత్రుడును అయిన గోకననాయకుడు వజ్రహస్తమహారాజుగారిని చిరకాలమారాధించి, తనపౌరుషముచూపి సంతోషపెట్టుటచేత వారు సంప్రీతులై అతనికి కళింగనగరమునుండి ఆయన తలిదండ్రులయొక్కయు, ఆయనయొక్కయు పుణ్యయశోభివృద్ధికొఱకు సమస్తామాత్యజనపదులను పిలిపించి వారిసమక్షమున శశి (౧), నంద (౯), నిధి (౯) శతాబ్దమున, అనగా ౯౯౧-వ శకవర్షమున ఆషాఢమాసప్రథమపక్షమునందు సప్తమీసోమవారమునాడు పన్ను పర్యాయము లేవియు లేకుండజేసి వరాహవర్తని(విషయము)యందలి నవగ్రామ మనెడియూరును దాన మొసంగిరి. ఈదానమును దెలుపుటకే యీశాసనము పుట్టినది.

**స్థలనిర్దేశము :**

దానముచేయబడిననవగ్రామము వరాహవర్తనీవిషయములోనిది. గంజాంజిల్లాయందలి యిప్పటి శ్రీకాకుళం, టెక్కలి తాలూకాలకు పూర్వము వరాహవర్తని యనుపేరు చెల్లుచుండినకారణమున[5] నవగ్రామ మాతాలూకాలలోనిది కావలెను. విచారించి చూడగా, టెక్కలి తాలూకాయందలి యిప్పటి నౌగాం అనెడియూరే మనశాసనపు నవగ్రామము కాదగు నని నానమ్మకము.

---

3. భారతి, రక్తాక్షి, మాఘమాససంచిక, పుటలు ౧3౭ - ౧౫౫.
4. భారతి, అక్షయ, వైశాఖమాససంచిక, పుటలు ౭3 - ౯౪.
5. భారతి, భావ, భాద్రపదమాససంచిక, పుట ౪౬౪.

ప్రతిగ్రహీత: గలదు. వైశ్యవంశోద్భవుడనుట కట్లు పొర
ప్రతిగ్రహీత యగు గోకననాయకుడు పాటున వ్రాయబడినదని నాయుద్దేశము. మధు
వేస్యాంవంశోద్భవు డని మన శాసనమున కామార్ణవుని నాటనుండియు కళింగమహీ

---

6. అయితే యిది 'వేశ్యావంశోద్భవ' అని కావలెను. నేను చూచినంతవఱకు ప్రాచీనశాసనములందు తాము వేశ్యావంశోద్భవులమని చెప్పుకొనిననాయకు లెవ్వరును గానరాలేదు. 'వైశ్యవంశోద్భవ' యనుటకు 'వేస్యావంశోద్భవ' యని పొరపాటున వ్రాయబడినదని నాయుద్దేశము. చికాకులవలసశాసనమున 'వైస్య' అనియే వ్రాయబడినది. బొడ్డపాడుశాసనమున 'విస్యాగోత్రోత్పన్నః ఏరయమః' అనికలదు. 'విస్య' పద మేదియైనది ఇదమిత్థమని నిర్ణయింపలేక 'వేస్య' ?వేశ్య అయియుండునాయని (పుట ౯౬), ?విశ్వ అయియుండునాయని (పుట ౯౨) సంశయించితిని. కాని వజ్రహస్తశాసనముల నన్నిటిని పరిశీలించిచూడగా చికాకులవలస, బొడ్డపాడుశాసనములందును, ఈశాసనమునను వచ్చిన 'వైస్య', 'విస్య', 'వేస్య' పదములు వైశ్య పదముయొక్క తప్పువ్రాతలే కావచ్చునని తోచుచున్నది.

బొడ్డపాడుశాసనమునవచ్చిన 'మాదరమనవర్తిక' పదము అనంతవర్మచోడగంగదేవు శ్రీకాకుళముశాసనమున రాగా ఆశాసనమును ప్రకటించుసందర్భమున శ్రీరాళ్లభండి సుబ్బారావుగా రిట్లు వ్రాసినారు:

"The meaning of this term" Madara maintenance" is not clear. Such a term occurs also in the Boddapadn plates of Vajrahasta III. The editor Mr. M. S. Sarma opined that the term is the same as Medari, a low caste man, engaged in making bamboo baskets. We cannot agree however with this opinion. We wonder whether an emperor should endow a whole village for such low services such as supplying baskets and get plates inscribed to commemorate the great event!! (Vide, Jour. Andhr. Hist. Res. Soc. Vol. VIII. P, 192, foot note).

నేనువ్రాసిన దిది: "వజ్రహస్తదేవుడు...కోలువర్తనివిషయములోని అవరెంగ అనుపేరుగల గ్రామమును ...వివిధమయిన పన్నుపర్యాయములబాధలు లేకుండ జేసి ఆగ్రామమున విజయంచేసియున్న జలేశ్వరస్వామి అనుపేరుగల దేవునికి భోగము చేసి, అనగా దేవునికి చెల్లెగ్రామముగ ఏర్పాటుచేసి దాన మొసంగబడినది. జలేశ్వరదేవునికి చేసినయీదానమును తెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఈగ్రామమును జలేశ్వరస్వామికి దాన మొసంగుసందర్భముననే మరియిరువురు గ్రామస్థులకు (౧) ఎరయముడు అనువానికిని, (౨) మహాక్షశాలియు, స్వర్ణలోహకారకుడు అయిన వల్లెమోజుకును వృత్తు లొసంగబడినవి." — (భారతి, అక్షయ, వైశాఖసంచిక, పుట, ౮౫). ఈవిధమున అవరెంగగ్రామమును దానముచేసినది జలేశ్వరదేవునికే అనియు, ఆగ్రామమున 'మాదర మనవర్తిక' మనుపేర నొకవృత్తిమాత్రమే ఎరయమునికీయబడెననియు నేనంతస్పష్టముగ వ్రాసినప్పుడు నాతెలుగు శ్రీసుబ్బారావుగారికి అర్థముకాలేదనవలెనా? అర్థమయినాడ వా రిట్లువ్రాయవలెనని వ్రాసినారనవలెనా? నారివ్రాత కింతకన్న వ్యాఖ్యాన మనవసరము.

శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారిపేర ప్రకటించిన 'వ్యాససంగ్రహ' సంపుటమున "కోమరచన్ద్రాయ మాదరంమనవర్తికా" మని శ్రీసుబ్బారావుగారు పాఠ మిచ్చి, ఫుట్టునోటులో ఏకారణముననో "మాదరం"ను "సాదరం" చేసినారు. ఈశాసనమునే ఆంధ్రదేశీయేతిహాసమండలి సంచికలో (సంపుటము ౮, పుట, ౧౮౫)

పతులు వైశ్యులకు గ్రామదానము చేయుచుండిరనుటకు శాసనప్రమాణము కలదు. గోకననాయకునిపౌరుషప్రతాపములకుమెచ్చి యిచ్చినగ్రామమగుటచేత నిది యొకవిధముగ జాగీరువంటి దనవచ్చును. కళింగనరపాలురిట్టిగ్రామదానములనుగూడ 'పుణ్యయశోభివృద్ధి'కొఱకే చేయుటనుజూడగా వారిదృష్టిలో గలిగినమార్పు అభివ్యక్త మగుచున్నది. బ్రాహ్మణులకొసగిననే 'పుణ్యయశోఽభివృద్ధి' యనుభావము సీరసిల్లినది.

**కాలనిర్ణయము :**

ఈశాసనము శాసనదాత యగు వజ్రహస్తుడు పట్టాభిషిక్తుడయినకాలమును, దానముచేసిన కాలమును దెలుపును. ఈవజ్రహ

ప్రకటించుసందర్భమున వారిచ్చినశాసనపాఠము 'కోమరచన్ద్రా)యమాదరమనవర్తిక'కముకాని'మాదరంమనవర్తిక'కము కాదు. ఇచ్చట 'మాదర' 'సాదర' చేయవలసినయగత్యముకూడ కనిపింపలేదు వారి కేకారణమువనో. ఇంగ్లీషున దానిని వారు "Madara maintenance"గనే గ్రహించినారు. ఒక్కవ్యాసముననే ఇట్టివేలువేలుపాఠములు, వేలువేలుసవరణలు అనేకములు. మచ్చున కొకటి: పూర్వోదాహృత 'వ్యాససంపుటము'ననే (పుట ౨౦౨) 'నాలుగవనెంబరుశాసనమునుబట్టి' "రాజరాజు శకవర్షము ౯౯౨న జ్యేష్ఠశుద్ధఅష్టమిగురువారమునాడు ఉత్తరఫల్గునీనక్షత్రసింహలగ్నమున పట్టాభిషిక్తుడైనట్లు" వ్రాసి వారీవిషయమును తెలుపుశాసనపాఠము నిట్లిచ్చినారు: "శాకాబ్దే నయనాబ్జగర్భనిధిగే జేష్ఠేష్టమీ సేజ్ఞకే లగ్నే చోత్తరఫల్గుణీ గురుదినే...". ఈపాఠమునగలతప్పులను ఫుట్టునోట్లలో ఇట్లు దిద్దినారు: "జ్యేష్ఠే"; "సంజ్ఞకే". "సేజ్ఞకే" అన్నది "సంజ్ఞకే"గా నుండవలెనని వీరి యభిప్రాయమైతే వీరికి సింహలగ్న మెచ్చటనుండి వచ్చినది? ఇక – ఈశాసనమునే ఇంగ్లీషున ఆంధ్రదేశీయేతిహాసమండలి సంచికలో ప్రకటించుసందర్భమున పూర్వోదాహృతశాసనపంక్తులకు వారు వ్రాసినఇంగ్లీషువ్యాఖ్యానమిది: "He (Raja Raja) came to the throne in S. 992, on Thursday, the eight day in the bright fortnight of Jyeshta month, during Uttaraphalguni lagnam." "అతడు (రాజరాజు) శకము ౯౯౨లో జ్యేష్ఠ శు. ౮ గురువారము ఉత్తరఫల్గునీలగ్నమునందు సింహాసనమెక్కె" నని దానియర్థము. ఎక్కుగీట్లు నావి. ఉత్తరఫల్గునీలగ్న మేమిటి? ఉత్తరఫల్గుని నక్షత్రముకాని లగ్నమగుటకు ద్వాదశరాశులలో నొకరాశికాదు. శాసనమందలి 'సేజ్ఞకే' పాఠ మిక్కడను వచ్చినది; దానిని 'సంజ్ఞకే'గా దిద్దినారు. చూడగా, శ్రీ సుబ్బారావుగారు ఆయాశాసనములనుగూర్చి వ్రాసినశాసనపాఠములను అట్లే యుండనిచ్చి వచనభాగము నెవరో దిద్దుటయో, వేఱే వ్రాయుటయో జరగియుండవచ్చు, కళింగసంచిక సుబ్బారావుగారిచేయి ఆవచనభాగమున కనబడుట లేదు. ఇంతకు అసలుశాసనపాఠము "సేజ్ఞకే" కాదు, శాసనలేఖకుడు 'సిఙ్గకేలగ్నే' అనుటకేమో 'సేఙ్గకేలగ్నే' యని తప్పుగా వ్రాసినాడు. ఇట్లయినను సంస్కృతపదమధ్యమున సింగపదము ప్రయుక్త మగుట చిత్రము. రాజరాజుపట్టాభిషేకకాలము "S. 992 (A. D. 1069)" అనియొకచోటను (Jour. Andhr. Hist. Res. Soc, Vol. VI, p. 210), ఇంగ్లీషున క్రీ. శ. ౧౦౭౦, జూను కు సరిపోవునని వేఱొకచోటను (Ibid, Vol. VIII, p. 168), మఱియొకచోట "దీనినిబట్టిరాజు (రాజరాజు) క్రీస్తు సం॥ ౧౦౭౧లో పట్టాభిషిక్తుడయినట్లు తేలుచున్నది" (వ్యాసపంపుటము, పుట. ౨౧౨) అని తేల్చినారు!

శాసనములం దిచ్చినరాజరాజుపట్టాభిషేకకాలమునకు సరియైన ఇంగ్లీషుతేదీ క్రీ. శ. ౧౦౭౦, మేనెల ౨౧-న తేది, గురువారము.

స్తుని నడగాంశాసనవ్యాసమున పట్టాభిషేక కాలమునకు సరియైన ఇంగ్లీషు తేది క్రీ. శ. ౧౦౩౮ మే, ౧౩-వతేది (గం. ౮, ని. ౨౭ లు)అని తెలుపబడినది[7]. వృషభమునకు మేష మని యున్ననే కాని తిథివారనక్షత్రములు సరి పడవని కీల్‌హార్న్‌దొరగారు, తదనుకూల ముగ ఆ తేదిని క్రీ. శ. ౧౦౩౮, ఏప్రిల్, ౯ (ఆదివారము) కి సవరించినారు[8].

దానకాలము: శకము ౯౯౧ ఆషాఢ మాస ప్రథమపక్షమున సప్తమీసోమవారము. పూర్ణిమాంతకృష్ణపక్షమునకుకూడ ప్రథమ పక్షమని వాడుట కలదు. పూర్ణిమాంత మన నేమి? చాంద్రమాసమును పరిగణించుపద్ధతి రెండువిధములు: అమాంతమని, పూర్ణి మాంతమని. అమావాస్యతో నంతమగునది అమాంతము; పూర్ణిమతో ఆఖరగునది పూర్ణిమాంతము. ఇప్పటికిని అమాంతపద్ధతి దక్షిణాదిని, పూర్ణిమాంతపద్ధతి ఉత్తరాదిని వాడుక. మననెల అమావాస్యతో అంతము కాగా, ఉత్తరాదివారినెల పౌర్ణమితో ఆఖ రగును. ఈ రెండుపద్ధతులకు బహుళపక్షము లందే వ్యత్యాసము. అమాంతపద్ధతిలోని రెండవదయిన కృష్ణపక్షము పూర్ణిమాంతపద్ధ తిని ప్రథమపక్షమగును; ఎట్లన, పూర్ణి మాంతమాఘమాసము అమాంతపుష్య బ. పాడ్యమినుండి యారంభమగును. ఇట్లే ఇతర మాసములును చూచుకొనునది. పూర్ణి

7. నేను వజ్రహస్తునిచికాకోలవలసశాసనమును ప్రకటించునప్పుడు దీనినే గ్రహించితిని కాని ఆవ్యాసమున ౧౦౩౮అని పడుటకు పొరపాటున ౧౦౩౭అని పడినది (చూడుడు: భారతి, రక్తాక్షి, మాఘమాసము, పుట, ౧౮౭). నేను స్వామికన్నుపిళ్లగారి జంత్రి (Ephemeris)తో సరిచూచిన దొకచికాకోలవలసశాసనదానకాల మునే. దీనిని నేను మరల సరిచూచుకొనకపోవుటవలన ఈపొరపాటే వజ్రహస్తునిబోడ్డపాడుతామ్రశాసనవ్యాస మునను పడినది. బోడ్డపాడుశాసనపాఠమున 'వ్వియద్వృతునిధిసంఖ్యాం' అనియున్నను పొరపాటున 'వ్వియ దృతుసంఖ్యాం' అనిపడినది. పాఠకులు సవరించుకొనప్రార్థన. శ్రీరాళ్లభండి సుబ్బారావుగారు పొరపాటున నే నిచ్చిన ౧౦౩౭, మే ౩-వ తేది ఆదివారమే సరియైనదనుకొనికావచ్చు, ఈతేదీనే వారికళింగసంచికయందును (చూడుడు: కళింగసంచిక: పుట, ౫౨౯), ఇంగ్లీషున ఆంగ్లపత్రికయందు వ్రాయుగాంగచరిత్రమునను (సంపు టము ౬, పుటలు ౨౦౪, ౨౦౮), తూర్పుగాంగుల ఆఱునూతనశాసనములను పేరుతో ఇంగ్లీషున ప్రకటించినవ్యాస మునను (సంపుటము ౮, పు., ౨౬౫) ఇచ్చినారు. దీనికిప్రమాణము "Vide L. D. Swamykannu pillai's Ephemeris" అట! ఇట్లే తెలుగుచరిత్రవ్యాసములందు పడినతప్పులుక్కు,తప్పులకంటె ఎక్కువగ ఒప్పులును ఒరు లెఱుగకుండ పరాధీనములయిపోవుచుంటివి, ప్రమాణములతో సహా. ఈతేది సరియైనది కాదు.

8. Ep. Ind., Vol. V, Appendix, pp. 50 - 51, No. 355.

ఈరోజున శుక్లపక్షతృతీయ గం. ౧౮, ని. ౪౦ లకు ఆరంభము; నక్షత్రము రోహిణి గం. ౧౮ల నుండి; ~~మధ్యాహ్నమునుండి ...~~ సమార గ్గము. కే. శే. ఆర్. డి. బెనర్జీగారు తమ 'ఒరిస్సా' మొదటిసంపుటమున వజ్రహస్తునిపట్టాభిషేకకాలమునకు మొదట ఈ ఇంగ్లీషు తేదీనే యిచ్చి (పుట, ౨౪౫) మరల వేఱొకచోట (పుట, ౨౪౪) ౧౦౩౮, మే, ౩-వ తేది నొసంగినారు.

మాంత, అమాంతపద్ధతులు రెండిటికి సరి సామాన్యమయిన దొక్క- శుక్లపక్షమే.

మనశాసనమున ప్రథమపక్షమని యుండుటవలన ఆషాఢము పూర్ణిమాంతమా యన్న యనుమానము కలిగినది. ఈవిషయము తేలుటకు వజ్రహస్తుని యితరతామ్రశాసనకాలములను పరిశీలింపవలెను. ఈ శాసనముకాక, ఇతని వింతవఱకు ఏడుతామ్రశాసనములు దొరకినవి. అవి యేవన:

(౧) నర్సిపట్నముశాసనము[9]:

శ. ౯౬౭, 'మీనమాస నవమే, సోమవారే '[10]

(౨) మందసాశాసనము[11]:

'నవశతకసప్తరస' (శ. ౯౭౬)[12]

(3) నడగాంశాసనము[13]:

'అజగిరినిధి'[14] (శ. ౯౭౯), ఫాల్గున అమలపక్ష ౧౨ ఆదిత్యవారము

---

9. Ep. Ind., Vol. XI, p. 147.

10. కృష్ణ, శుక్లపక్షముల నుదాహరింపకపోవుటవలన, సోమవారము సౌరమీనమాసమునందలి నవమదినమనుట నిశ్చయము (Ep.Ind ,Vol,XI,p.149 ). అక్షరములతోకాక, సంవత్సర మిందు కేవలమంకములలోనే తెలుపబడినది. ఈశాసనమును ప్రకటించిన స్టెన్కోనో దొరగారు సంవత్సరమును ౯౮౭ గ చదివిరి. ఇప్పటివఱకు ఈశాసనము ౯౮౭ నాటిదని, ఇదియే వజ్రహస్తునిమొదటిశాసనమని పరిశోధకుల యభిప్రాయము. ౯౮౭ ను గతాబ్దముగ తీసికొన్నను, వర్తమానాబ్దముగ తీసికొన్నను మీనమాసపునవమదినము గురు, శుక్రవారములగునుకాని సోమవారము కాదు. ఈవ్యత్యాసము వచ్చినపిదప శేసంకెలను బరిశీలింపగా ౮ అని చదువబడినది ౬ అయియుండునని తోచినది. శకము ౯౬౭కు చూడగా క్రీ. శ. ౧౦౪౪-వ సంవత్సరమున మీనమాసపు తొమ్మిదవరోజు సోమవారమయినది. అందువలన ౯౮౭ తప్పని, అది ౯౬౭ అగునని, వర్తమానాబ్దమని నానిశ్చయము. ౧౦౪౫ (శ. ౯౬౭ వర్తమానాబ్దము) మీనమాసపునవమి మార్చినెల ౧-వ తేది సోమవారమయినది (నాడుతిథి ఫాల్గున శు. ౧౦).

11. Cp. No- 12 of 1917 - 18 ; Jour. Bi & Or. Res. Soc , Vol. XVII, pp. 175-88.

12. గౌనర్మెంటుశాసనశాఖవారిచ్చినసంవత్సర మిది (శ. ౯౭౬).

13. Ep. Ind , Vol. IV, p. 183

14. దీనికి సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౫౮, మార్చి, ౪ అని తెలుపబడినది. కాని యిదితప్పు. ౧౦౫౮, మార్చి, ౪-వ తేది స్వామికన్నుపిళ్లెగారి జంత్రి (' Ephemeris ') ప్రకారము చైత్ర శుద్ధ సప్తమీ బుధవారమయినది కాని శాసనమున చెప్పబడినట్లు ఫాల్గున శు. ౧౨ ఆదివారము కాలేదు. శాసనమున చెప్పిన తిథివారాదులు సరిగా క్రీ. శ. ౧౦౫౮, ఫిబ్రవరి, ౯-వ తేది ఆదివారమునకు సరిపోవును. ఆనాడు శుద్ధ ౧౨ (మధ్యమతిథి)(మధ్యమ) సూర్యోదయకాలానంతరము గ. ౧౫, వి. ౩౬ల వఱకు గలదు. 'అజ' పదము ఏకసంఖ్యనే తెలుపునన్నయెడల సంవత్సరము శ. ౯౭౧ అగును. అపుడు దానికి సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౪౯, ఫిబ్రవరి, ౨౮-వ తేది ఆదివార మగును.

(౪) శ్రీకాకుళంశాసనము[15]:
'అజగిరినిధి'[16] (శ. ౯౭౯), కర్కాటక, బ. ౧౩ ఆదివారము

(౫) చిక్కాలవలసశాసనము[17]:
'కరవసునిధి' (శ. ౯౮౨), కార్తీకమాస ప్రథమపక్ష 3 సోమవారము

(౬) బొడ్డపాడుశాసనము[18]:
'కరవసునిధి' (శ. ౯౮౨), ఉత్తరాయణ సంక్రాంతికాలము

(౭) మద్రాసుమ్యూజియముశాసనము[19]
'కృతవసునిధి' (శ. ౯౮౪) సూర్యగ్రహణ సమయము

---

15. Cp. no. 3 of 1918-19., Jour. Andh. Hist. Res. Soc., Vol. VIII p. 163.

16. నడగాంశాసనమున అజాపదమ బ్రహ్మయని యర్థముచేసి, నవబ్రహ్మలు గనుక 'అజగిరినిధి' యన్నది శ. ౯౭౯ అని శ్రీరామమూర్తి పంతులుగారు తెలిపినారు. శ్రీకాకుళంశాసనమునగూడ శకాబ్దము 'అజగిరినిధి'యే యైనను శాసనశాఖవారు 'అజ' పదమునకు సంఖ్య యొకటే యిచ్చి మొత్తము సంవత్సరమును శ. ౯౭౧ చేసినారు. నేను గమనించినంతవఱకు బ్రహ్మపదముకాని, దానిపర్యాయపదముకాని కాలపరిగణనసందర్భమున శాసనములందు వచ్చినపుడు వాని కియ్యబడుసంఖ్య ౯ కాని ఒకటికాదు. చూడుడు: ఒక్కయుదాహరణము: ఒకశిలాశాసనమున "శాకాబ్దేషు విరించినిధిభిః..." (S I. I., Vol. V. no,1120) అనికలదు. ఈశాసనము మనవజ్రహస్తునిది. అట్లగుట, 'విరించి' (బ్రహ్మ)కి ౯ సంఖ్య యిచ్చిననేకాని వీలులేదు. శాసనశాఖవారిని చూచి శ్రీసుబ్బారావుగారుకూడ ఈశాసనకాలమును శ. ౯౩౧గనే గ్రహించినారు (చూడుడు: Jour Andh. Hist. Res. Soc., Vol. VI, p. 205); కాని వారు నడగాంశాసనకాలము శ. ౯౭౯ అనియే యంగీకరించినారు (Ibid, page, 204; కళింగసంచిక, పుట, ౫౨౪).

శాసనశాఖవారు శ. ౯౭౧ని తీసికొని, ఈశాసనకాలమునకు ఇంగ్లీషుతేది నిర్ణయించుసందర్భమున శ్రీస్వామికన్నుపిళ్లెగా రిట్లువ్రాసినారు:

"In 1048-49 (=S. 971 current Karkataka ba. 13 began on Sunday 10th July A. D 1048 at .60, ending next day at .68; while in A D 1049-50 (=S. 971 expired) the same tithi ended on Sunday 30, July, A. D 1049 at .34. In both cases paksha was bahula but not sukla."

౧౦౪౮ తీసికొన్నను, ౧౦౪౯ తీసికొన్నను పక్షము బహుళమేకాని శుక్లము కాదని వ్రాసినారు కాని వారిచట పొరపాటుపడినారని నానమ్మకము. వారి 'ఎఫిమెరిస్' ప్రకారమే చూచినచో వారిచ్చిన ౧౦౪౯-వ సంవత్సరపుతేది సరియైనది కాదు. ౧౦౪౯ జూలై ౩౦-వ తేది సింహమాసములో పడినది. శాసనమున నిచ్చినది కర్కాటకము. ౧౦౪౮ జూలై ౨౬-వ తేది కర్కాటకమాసమున పడుటయేకాక నాడాదివారమును, తిథి శుద్ధత్రయోదశికూడ నయినది. అందువలన సంవత్సరమును శ. ౯౭౧గనే గ్రహించునెడల, శాసనకాలమునకు సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౪౮ (=శ. ౯౭౧ వర్తమానాబ్దము) జూలై ౨౬ ఆదివారమగును. నాడు త్రయోదశి (మధ్యమతిథి) (మధ్యమ)సూర్యోదయకాలానంతరము గ. ౪౨ వి. ౩౦ వఱకు నున్నది.

17. భారతి, రక్తాక్షి, మాఘమాససంచిక. పుటలు ౧౩౪-౧౫౫.

18. భారతి. అక్షయ, వైశాఖమాససంచిక, పుటలు ౮౩-౯౪.

19. Ep. Ind., Vol. IX, p. 94.

వీటిలో చిక్కాలవలసశాసన మొక్కటే 'ప్రథమపక్షము' నిచ్చునది. మిగిలినవన్నియు స్పష్టముగ శుక్లపక్షమును దెలుపునవే. చిక్కాలవలసశాసనకాలము అమాంతకార్తికమే యనునుద్దేశముతో ప్రథమపక్షమును శుక్లపక్షముగ భావించి, దానికి సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౫౯ అక్టోబరు, ౧౧-వ తేది[20] యని వ్రాసినాను. ఆకార్తికము పూర్ణిమాంత మనుకొన్నచో అది అమాంతఆశ్వయుజ బ. 3 కావలెను. ఇట్లయినచో దీనికి సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౫౯ సెప్టెంబరు, ౨౭ సోమవార మగును. సోమవారమునాడు (మధ్యమతిథి) తదియ (మధ్యమ) సూర్యోదయకాలానంతరము 3౬ విగడియలవఱకు నున్నది. పిదప చవితి. అయినను సూర్యోదయకాలమునకు తదియయే గనుక నాటివ్యవహారమునకు తిథి తదియయే. తిథి, వారములు పూర్ణిమామాంత కార్తికములు రెంటికి సరిగా సరిపోవుచుండుట చేత చిక్కాలవలసశాసనమువలన మన కీ విషయము తేలుటలేదు.

ఇక మనశాసనకాలమునుబట్టియే చూతము. అమాంతమయినచో శకము ౯౯౧, ఆషాఢ శుద్ధసప్తమీ సోమవారమునకు సరియైనఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౦౬౮, జూన్, ౯-వ తేది సోమవారము — నాడు సప్తమి తిథి పూర్తిగా నున్నది. పూర్ణిమాంతమయినచో (జ్యేష్ఠ బ. 7) క్రీ. శ. ౧౦౬౮, మే. ౨౬-వ తేది సోమవార మగును. ఆరోజున సప్తమి (మధ్యమతిథి) (మధ్యమ) సూర్యోదయకాలానంతరమున గ. ౧౬, వి. ౧౨ లవఱకు నున్నది. ఈశాసనమునందలి తిథివారములుకూడ పూర్ణిమాంత, అమాంత ఆషాఢములు రెండిటికిని సరిపోవుచుండుటచేత కళింగదేశమున వజ్రహస్తునికాలమునం దేపద్ధతి వ్యవహారమునం దుండెనో నిర్ణయింప వీలు కాకయున్నది. ఇది భావిపరిశోధనవలన దేలవలసినవిషయము. అమాంతపద్ధతియే వాడుకయందుండెనని తలచి, ఇప్పటిమట్టుకు మన శాసనదానకాలమునకు సరియైనఇంగ్లీషు తేది ౧౦౬౮ జూన్, ౯ గనే గ్రహింతము. మాసమమాంతమయినను, పూర్ణిమాంతమయినను శకవర్షము వర్తమానాబ్దమేకాని గతాబ్దము కాదు.

20. చూడుము: భారతి, రక్తాక్షి, మాఘమాససంచిక, పుటలు ౧౮౬-౧౮౭. అచ్చుట శకవర్షము వర్తమానాబ్ద మనుటకు గతాబ్దమని పడినది పొరపాటు. శాసనశాఖవారితేది క్రీ. శ. ౧౦౬౦, అక్టోబరు, 3౦, సోమవారము. ఇది సరియయినది కాదు. ఏలయన, ఈనాడు (శ్రీస్వామికన్నుపిళ్లెగారి ఎఫిమెరిస్ ప్రకారము) మార్గశిరశుద్ధతదియకాని కార్తికశుద్ధతదియ కాదు.

# మూలము[1]

## మొదటిరేకు : రెండవ పెడ



౧. ఓం[2] [*] స్వస్తి శ్రీమతా మఖిలభువనవినుతనయవినయదయాదానదాక్షి

౨. ణ్య సత్యశౌచశౌర్య్యధైర్య్యాది[3]గుణరత్నపవిత్రకాణా మాత్రే

౩. యగోత్రాణామ్ విమలవిచారాచ్చారపుణ్యశలిలప్రక్షాలిత[4]క

౪. లికాలకల్మషమషీణామ్ మహామహేన్ద్రాచలశిఖరప్ర[5]

౫. తిష్ఠతస్య[6] సచరాచరగురోః సకలభువననిమ్మా౯

౬. ణైక[7]సూత్రధారస్య శశాఙ్కచూడామణే భగవతో గోకర్ణ్ణ[8]స్వామినః [ప్ర]

౭. సాదా త్సమాసాదితైకశఙ్ఖభేరీపఞ్చమహాశబ్దధవలచ్ఛత్ర

౮. హేమచామరవరవృషభలాఞ్ఛనసముజ్వలసమస్తసామ్రాజ్యమ

---

1. నాదగ్గఱనున్న రేకుల ననుసరించి. 2. ఇది యొకగుర్తువలన జూపబడినది. 3. °శౌర్యధైర్యాది° అని చదువవలెను. 4. °పుణ్యసలిలప్రక్షాలిత° అని చదువవలెను. 5. లేఖకుడీయక్షరమును 'ప్ర'గనే కాకుండ ఇంకను ఏదో చేయబోయి మరల దినువ తుడుపుపెట్టినాడు. 6. °ప్రతిష్ఠితస్య' అని చదువవలెను. 7. °భువననిర్మాణైక° అని. 8. వెలుపలిగిలకతో కూడి యుండవలసిన 'ః' వచ్చినపుడెల్ల దానికి లేఖకుడు స్వత్వము మాత్ర మిచ్చి వెలుపలిగిలక వ్రాయుట మరచుచువచ్చెను. శాసనమునం దంతట నిదేపద్ధతి.

రెండవరేకు : మొదటిపేజ



౯. హిమ్నా మనేకసమరసఙ్ఘట్టసముపలబ్ధవిజయలక్ష్మీసమాలి

౧౦. ఙ్గితో[9]త్తుఙ్గ[9]భుజదణ్డమణ్డితానామ్ త్రికలిఙ్గమహీభుజాం గ

౧౧. ఙ్గానా మన్వయ మలఙ్కరిష్ణో ర్విజిష్ణో[10]రివ విక్రమాక్రాన్తధరామ

౧౨. ణ్డలస్య గుణమహార్ణవక్షహారాజస్యపుత్రః[11] ॥౧॥ పూర్వం[12] భూ

౧౩. పతిభి ర్విభజ్య వసుధా యా పఞ్చభిః పఞ్చధా [।*] భుక్త్వా భూరి

౧౪. పరాక్రమో భుజబలా త్తామేక ఏవ స్వయమ్ [।*] ఏకీకృత్య విజిత్య

౧౫. శత్రునివహాన్[13] శ్రీవజ్రహస్త శ్చతు [।*] శ్చత్వారింశత[14]మత్యుదారచరితః

౧౬. సన్పాతి పరక్షిత్సమాః ॥ తస్య తనయో గుణ్డమరాజా[15] వర్షత్రయమపాలయ

9. ౦సమాలిఙ్గితోత్తుఙ్గ అని. 10. ౦విజిష్ణో౦ అని. 11. 'గుణమహార్ణవమహారాజస్యపుత్రః' అని. లేఖకుడు 'మహారాజస్య'లోని 'మ' వ్రాయుటకు బదులు 'క్ష' వ్రాయుటయేకాక 'హా' చిత్రముగా వ్రాసినాడు. ఉన్నరీతి నాయక్షరమును 'హ్య'గనూడ చదువవచ్చును. దిగువ అర్ధగీటుతో కలుపవలసిన వక్రరేఖను నిలువు గీటుతో కలిపినాడు. అది పొరపాటుకాక వ్రాతచమత్కారమే కావచ్చునని నేను దానిని 'హా'గనే చదివితిని. 12. 'పూర్వం' అని. వృత్తము : శార్దూలవిక్రీడితము. 13. 'శత్రునివహాంశ్చ' అని చదువవలెను. 14. ౦రింశతం అని. 15. ౦రాజో అని.

రెండవ శాసనము : రెండవ పెడ



౧౭. ద్మహీమ్[16]॥ తదనుజః కామార్ణవ[17]దేవః షట్త్రింశత[18]మబ్దకాన్ । త

౧౮. స్యానుజో విజయాదిత్య స్సమాస్తిస్రః । తతః కామార్ణవా[19]జ్జాతో జగతి

౧౯. కల్పభూరుహః (।)। యో రాజ ద్రాజే(జ)త చ్ఛత్రయో నృజహస్తోవనీం తీః ॥ [20]ప్రోచ్చైర్మద

౨౦. న్మదగన్ధలుబ్ధమధుపవ్యాలీఢగణ్డా గ్గజా న్నర్థిభ్య[21]స్సముదా త్తస

౨౧. హస్ర మతులో యస్త్యాగ(గి)నా మగ్రణీ [।*] స(ః) శ్రీమా న్విజయాదిత్యమన్ప

౨౨. తి గ్గణాంగాన్వయోత్తంసకః[22] [।*] షట్త్రింశత[23] మబ్దకా న్సముభార

౨౩. క్షిత్యేకక్ష్వన్[24]స్తుతః పార్థివైః[25] ॥ తదగ్రసూనుః[26] సురరాజసూనునా సమ స్సమస్తా

౨౪. ం సమితాని[27]మణ్డలః [।*] స్మ పాతి కామార్ణవ[28]భూపతి ర్భువనమ్[29]సమృద్ధమానర్థ

౨౫. సమానం సముజ్వలః[31] ॥ తదను తదనుజన్మా[32] చిత్రజన్మోపమానో [।*] గుణ

---

16. ౦న్మహీమ్' అని. 17. 'కామార్ణవం అని. 18. ౦త్రింశతం' అని. 19. 'కామార్ణవాం అని. శ్లోకం. 20. శార్దూలవిక్రీడితము. 21. ౦నర్థిభ్యః౦ అని. 22. ౦గణాంగాన్వయోత్తంసకః' అని. 23. ౦త్రింశతం అని. 24. ౦క్ష్మైకక్ష్వమ్' అని. 25. 'పార్థివైః' అని. 26. వంశస్థము. 27. 'శమితారి౦ అని. 28. 'కామార్ణవం అని. 29. ౦భువనమ్' అని. 30. ౦నర్ఘం౦ అని. 31. 'సముజ్జ్వలః' అని. 32. 'తదనుజన్మా' అని. మాలిని.

## నాలుగవ రేకు : మొదటి పేడ

౫౩. కూలేవిరాజతః (।) కలిఙ్గనగరాత్పరమమాహేశ్వర [ః*] పరమ

౫౪. భట్టారక[ః*] [మహారాజాధిరాజ] [ః*] త్రికలిఙ్గాధిపతి[ః*] (శ్రీ)మదనన్తవ

౫౫. ర్మ్మణః వ[జ్రహస్తదే]వః కు[శలీ స]మస్తామాత్యప్రముఖజనపదాన్

౫౬. సమాహూయ [సమాజ్ఞా]పయతి వి[దిత]మస్తు భవ[తామ్]॥ ......[59]

౫౭. ......[60]రాహార[స్త్రీ]ణాన్యామ్[61] సనగ్రామ [శ్చ] తుస్సీమాప

౫౮. ర్యన్త [సజ] లస్థలస[ర్వ్వ[62]] పీడావివర్జ్జిత[63]మాచన్ద్రార్క్క[64]

౫౯. ప్రతిసమకాలం [సహ మాతా]పిత్రో రాత్మనశ్చ పుణ్యాయశోభివృద్ధ

౬౦. యే శక[65]స్త్రనిధి [శ]కాబ్దే (।) ఆసాఢ[66]మాసప్రథమపక్షస

---

59. లేఖకుడు 'విషయస్య' అని వ్రాసి కొట్టివేసినాడు. 60. లేఖకుడు 'స్తుభవతామ్' అని వ్రాసి కొట్టివేసినాడు. 61. 'వర్తిణాన్యామ్' అని. 62. 'స్సర్వ్వం' అని. 63. 'వివర్జితం' అని. 64. 'చన్ద్రార్కకం' అని. 65. 'శక' అని. 66. 'ఆషాఢం' అని.

నాలుగవ రేకు: రెండవ పెడ



పం. ౧. స్తస్యామ్ సోమవారే వేస్య(? వైశ్య)వంశోద్భవః మల్లనాయక స్తస్యపుత్రః

పం. ౨. భీమననాయక స్తస్యభార్యా ప్రోలకనా తయోః పుత్రాయ గోకన

పం. ౩. నాయకాయ చిరకాల మూరాధ్య స్వపోర్ష (యవ)పరితోషితాయ దత్త ఇతి॥



రాజముద్రిక

# తెలుగుచెరకులు

పూడిపెద్ది వెంకటరమణయ్య

సామాన్యముగ చెరకు ఎట్టినేలనయిన పెరుగును గాని ఉష్ణప్రదేశములును, సమశీతోష్ణ ప్రదేశములును వానిపెంపునకు పెట్టినదిపేరు. నీటివసతి మాత్ర ముండవలయును. చెఱకుపెంచునేలను సున్నము, నత్రజని(Nitrogen), తగుమాత్రముపటాసు(Potash), కొలదిగ భాస్వరద్రావకము(Phosphoric acid)నుండ వలయును. చెరకుపంటలు శీతోష్ణస్థితులను, వానరాకడలను బట్టి వికసించును. దానికి చక్కనికృషియు, నత్రజనితోడి యెరవు నుండినచాలును. నత్రజని యెకరమునకు ౨౦౦పౌనులుకూడ కావలయును. వరిపండునేలలన్నిటను చెరకు పండును. వరిపండించుపొలములలో రెండేండ్లకొకతూరి చెరకు పండించునాచారము సర్వత్రగలదు.

చెరకునేలలు చక్కగా దున్నవలెను. వానికి మంచి జలాధారము లుండవలెను. చెరకును నాలుగయిదు కణుపులుగల ముక్కలుగ కోసి పొడుగాటివరసలలో నాగేటిచాలున నాటుదురు. ఈవరుసలు మూడుమొదలు అయిదడుగులదూరమున నుంతురు. ఇట్టిముక్కలు ఎకరమునకు ౧౫౦౦౦ మొ. ౨౦౦౦౦ వరకును నాటుదురు. చెరకుతుండ్లను నాటుటకుపూర్వము వానిని సున్నములోను, మైలతుత్తములోను ముంచునాచారము మద్రాసు వ్యావసాయికశాఖవారికి గలదు. దీనివలన చెరకు శుభ్రపడి, చాలరోగములకు దూరమయి చక్కగ పెరుగగలదు. నెల్ల, నెల పదునేనురోజులలో ఈచెరకు మొలకెత్తును. క్రమముగా నివి మొక్కలయి పెరుగును. ఈమొక్కలు నాలుగడుగులయెత్తునకు ఎదుగగానే దానికి వెదురుకఱ్ఱల దాపు నిలుపుదురు. విశేషము గాలివీచుతీర భూములలో నిది యత్యవసరము. ఈభూములలో చెరకతిత్వరితముగ నెదిగి పడి, లేక పదునేను నెలలలో ఫలోన్ముఖమునకు వచ్చును. ఈపరిమాణము చెరకురకమునుబట్టి, నేలయెరవునుబట్టి, వ్యవసాయవిధానమునుబట్టి మారుచుండును. చెరకు పంటకురాగానే కఱ్ఱలలో రసము పూర్ణించియుండును. అంజలి మాలిన్యముకూడ తగ్గియుండును. అందు పరిస్ఫుటముకాజాలని చక్కెర (non-cristallisable sugar) కొలదిగ నుండును. అందువలన చెరకు రామీగా గానుగాటకు పనికివచ్చును. అది ఫలోన్ముఖమునకు వచ్చినవెంటనే దానిని కోసి ఆడవలెను. లేనియెడల నిందలిచక్కెర పరిస్ఫుటము కాజాలనిచక్కెరగ మారిపోవును. దానిని Gluecose అందురు. ఈస్థితి చెరకునకు తలక్రిందుస్థితి. ఆంధ్రదేశములో తగినపరిస్థితులలో చెరకుపంట ఎకరమునకు ౨౫ మొ. ౪౦ టన్నులవరకు నుండును. చెరకునాటినదిమొదలు ఫలోన్ముఖమునకు వచ్చినదాక దానికి నీటిపారుదల విశేషముకావలయును. చెరకునకు తెగుళ్లు మెండు. చీడపురుగులు, చిన్నపురుగులు, చెద మొదలగు వాని కిది లోనగుచుండును. అనువయినచోట నిది నక్కలవాతకూడ పడిపోవుచుండును (చర్మదార్ఢ్యము చాలనియెడ). కాబట్టి చెరకుతోట నతిశ్రద్ధతో కాచికొని జాగ్రతగ చూచుకొనుచుండవలెను.

చెరకుకఱ్ఱలో చక్కెర యెట్లగుచున్నదో అనునది మిక్కిలి వింతయైన సంగతి. అది, గాలిలోని బొగ్గపులుసువాయువువలనను, నేల నీటివలనను అగుచున్నది. ఆకులోని పసరు, గాలిలోని బొగ్గపులుసువాయువును గ్రహించి అందులోని బొగ్గను లోగొని ప్రాణవాయువును విడచివేయునుగదా. ఈబొగ్గ మొక్కలోని జీవరసముతో గలసి తొలిపానక మగును. ఇది క్రమముగ బలపడి పరిస్ఫుటముకాజాలని చక్కెర(Gluecose)గ మారును. అది పిమ్మట మనము తిను చక్కెరగమారును. చెర. కెదిగినకొలది చక్కెరపాలెక్కువగుచుండును. ఈపాలు పూర్తియయినసమయము పంటవేళ. ఈసందర్భమున కోయంబత్తూరులోని వ్యావసాయిక రసాయన శాస్త్రజ్ఞుడగు రా. బ. బి., విశ్వనాథంగారు పంట కాలనిర్ణయమున కొకవిధానము కనిపెట్టియున్నారు. ఆవిధానము — చెరకును రెండుభాగములుగ విభజించి ఊర్ధ్వభాగము, అధోభాగమును చేసి, ఊర్ధ్వ

భాగమునగల రసములోని ఘనపదార్థములనుగుర్తించుట. (రసము బరువునుండి నీటిబరువును తీసివేసినయెడల అందలి ఘనపదార్థముల బరువు వచ్చునుగదా) చెరకు ఫలోన్ముఖమునకు వచ్చినయెడల ఊర్ధ్వభాగఘనపదార్థముల బరువును అధోభాగఘనపదార్థముల భారముతో విభజించినయెడల ఫలిత మొకటి కావలయును. అనగా చెరకు పంటకు వచ్చినప్పుడు దాని రెండుభాగములనూ చక్కెర సమానముగ వ్యాప్తమయియుండును. ఈఫలితము తక్కువయయిన చెరకు పంటకురాలేదనుట; ఎక్కువయయిన చెరకుపంట మీరి తల్లక్రిందగుచున్నదనుట.

## ఆంధ్ర దేశమున చెరకురకములు

సామాన్యముగ మన దేశమున నక్కడక్కడ పెరిగే చెరకులుగాక జావాచెరకు (జె. ౨౪౭) మన దేశమున విశేషముగ వేయుచున్నారు. దీనియందలి విశేషములు; దీనిరంగు చాలలేతగ నుండును. అందువలన చక్కెరరంగుకూడ చాలతక్కువగ నుండును. దీని చర్మము చాలగట్టిగ నుండును (నక్కలకందదు). ఇది ౬ మొ. ౮ అడుగులయెత్తున కెదుగును. దీనికి రోగము లేవియు సాధారణముగ నంటవు. అందువలన రైతు అనవసరశ్రద్ధ వహించి కూర్చుండనక్కరలేదు. ఇందు చక్కెరయు, పీచునుకూడ చాలవరకు నుండును. ఇది లాభకరముగదా! ఇది ఎకరమునకు ౨౫ మొ. ౩౦ టన్నులవరకు పండును.

బి. ౨౦౮ (బంగారుతీగె) అనునదికూడ మన దేశమున విశేషముగ పండింతురు. ఇది లేతపసుపు రంగుగలిగి పుష్టిగ, పొడవుగ నెదుగును. కాని దీని చర్మము చాల మెత్తనగుటవలన, ఇది యనేకరోగముల పాల్పడును. ఇందు చక్కెర విశేషముగనుండి పీచు తక్కువుండును. పంట సులభముగాని దీనిని చాల శ్రద్ధగ పెనుపవలెను. ఇది ఎకరమునకు ౨౦ మొ. ౨౫ టన్నులే పండును. కాని యిది కర్మాగారములలో పని చేయుట కనువయినది.

## నల్లముఖరి (Purple Mauritius)

ఇది మారిషసుదేశపు విత్తనము. కాని మనదేశమున దీనిపంట చాలతరచయినది. ఇది చాలపుష్టియయిన చెరకు; చక్కగా నెదుగును. ఇది గాలికిగాని, రోగములకుగాని సులభముగ లొంగని రకము. ఇది యెకరమునకు ౩౦ టన్నులు పండును. దానిచర్మము గాఢముగ నెర్రగ నుండును.

ఇందు జావాచెరకునకంటె నెక్కుడుబెల్లము దిగుబడియగును. చక్కబరచిన కోయంబత్తూరుచెరకు-లిప్పుడిచట తలయెత్తుచున్నవి. ఇవి Co. ౨౧౩, ౨౮౧, ౨౯౦. Co. ౨౧౩ మెట్టనేలలను, జలాధారయునభూమి పెరుగును. దీనిచర్మము గట్టిగ నుండును. రంగు చాల తక్కువ. Co. ౨౮౧ పరిశుభ్రమయిన రసముతో నిండియుండును. ఆరసమున చక్కెరపాలెక్కువగ నుండును. Co. ౨౯౦ పై రెండురకములకంటె నెక్కువగ పండును. ఇవి చెరకులన్నియు నొక్కమాటు పండక క్రమక్రమముగ పండుటవలన దీనియుపయోగమున కర్మాగారములపని విరివియై సులభసాధ్యమగును.

Poj. ౨౮౭౮-ఇది వింతరకముచెరకు. దీని నిప్పుడిప్పుడు మనదేశమున పెనుపుచున్నారు. రంగు తక్కువ. గట్టిచర్మము. రోగములు చేరవు. ౧౦ అడుగులవరకు పెరగును. రసము మిక్కిలి నిర్మలము. ఇప్పటివరకు గలచెరకులలో నిదియే చక్కెరపాలెక్కువగలది.

అందువలన నిది జావాలో తక్కినరకములను త్రోసిరాజనినది. ఆద్వీపమున నీచెరకే యెక్కడనూచినను మొలకెత్తుచుండును. అది హిందూదేశమున తలయెత్తి పెరుగునేని చక్కెరవంటకు తగిన చెరకిదియే యని చెప్పవచ్చును.

ఇంకను మన యాంధ్రదేశమున జొన్నకును చెరకునకును చెందిన చెరకురకములు మొలపించలేదు. ఇది శీఘ్రకాలమున ఫలోన్ముఖమునకు వచ్చును.

చక్కెర మెండుగాగలవి ఆంధ్రదేశపు చెరకులు. ఇచటి చెరకురసము నైర్మల్యమునకు పెట్టినదిపేరు. ఉత్తరహిందూస్థానమున పండు చెరకు లింతకంటె నన్నివిధముల నీరసములే. ఇందువలన నాంధ్రదేశమున చక్కెరవంట మంచిపాకమున బడగలదని నిర్ధారణచేయవచ్చును. ఇప్పుడు హిందూదేశము మొత్తమున తలకు ౧౦ పౌనులవంతున చక్కెర వాడుకగుచున్నది. సంవత్సరమున కొక్కొక్కవ్యక్తి ఒక్కొక్కపౌనుచక్కెర నెక్కువవాడుకచేసినయెడల ఇప్పుడున్న ౧౫౦ చక్కెర కర్మాగారములకుతో డింకను ౧౫, లేక ౨౦ కర్మాగారములను నిర్మింపవలసియుండును.




## మన వేడుకలు

మనదేశములోని ఉత్సవములను జూచిన కడుపు తరుగుకొనిపోవును. ఎక్కడను ఉత్సాహము గాని, జీవకళగాని కనబడదు. సమష్టిజీవనమే మృగ్యము. ఉపవాసములు చేయు రోగికి ఉత్సవము లెక్కడ? అవయవములలో పటుత్వములేదు. రక్తము క్షీణించుటచే, దేహము పాండించినది. ముఖము తేజోవిహీనము. హిందూదేశము ఒక మహారోగి — అస్థిగతమైన వ్యాధిచే జీవచ్ఛవమైన దేశ మిది. మలేరియా, కలరా, ప్లేగు, స్ఫోటకము, క్షయ మొదలగు సాంక్రామికవ్యాధు లిచ్చట నిత్యనివాస మేర్పరచుకొనినవి. స్త్రీ పురుషుల విగ్రహపరిమాణము నానాటికి తగ్గుచున్నది. పూర్వకాలపు ఆజానుబాహువు లిప్పు డెచ్చటను గనబడరు. ఆయుర్దాయముకూడ క్షీణించినది. యౌవనము రాకపూర్వమే వార్ధక్యము సిద్ధించుచున్నది. పదమూడు పదునాలుగుఏండ్లు నిండీనిండక పూర్వమే బాలికలు గర్భవతు లగుచున్నప్పుడు, వారిసంతానము ఎలుకపిల్లలవలె నుండక మరియొకవిధమున నుండుట యసాధ్యము. ఎచ్చటను యువతీ యువకులలో ఉత్సాహము లేదు. కండ్లు తెరవకపూర్వమే సంసారతాపత్రయములు చుట్టుకొనును. హిందూగృహము మూర్ఖాచారములకును, మూఢవిశ్వాసములకును నిలయము. ఏయువకుడు ఒక దురాచారము నుల్లంఘించలేడు, క్రొత్తబాటను తీయలేడు, క్రొత్తవృత్తి నవలంబించలేడు. సర్వము గతానుగతికమై యుండినదే కాని, దానికి ఉనికి లేదు. వాని దుస్తులలో గూడ నొక సౌందర్యము లేదు. దిండు గలీబులవలె దేహమునకు తొడుగులను దూర్చుటయే కాని అవి వాని రసజ్ఞతను దెలుపగలవి కావు. నడకలో స్థిరత్వము లేదు. కాళ్లీడుచుకొనుచు బ్రాకుంగాను వృద్ధునివలె నడచును. గృహములలో శుచిలేదు. చక్కదనము లేదు. అలంకారసౌష్ఠవ మంతకుమున్నె మృగ్యము. ఆతడు కూర్చుండు గది పడకటిల్లో, చదువులగదో, రబ్బిషుకొట్టో, కార్ఖానో తెలియదు. కుటుంబపు టేర్పాట్లుకూడ జెడినవి. ఎవరి త్రోవ వారిది. స్త్రీలపద్ధతులు పురుషులకు బనికిరావు. చిన్నల బుద్ధులు పెద్దలకు రుచించవు. ప్రతి హిందూగృహము నేడు అరాజకకూటమనిన అతిశయోక్తి కాదు. ఒక ప్రక్కన రోగిమంచము, ఇంకొకప్రక్కను ధాన్యపుబస్తాలు, మరియొకచెంత బట్టలమూటలు, ఇంకొకచోట చిలికనుప్పలు వ్రేలాడుదండెములు, గోడలమీద సాలిగూళ్లు, దూలాలనుండి బూజుత్రాళ్లు, నడవామధ్యను చింపిరి గంపలు, ప్రతిమూల ఊడ్చివేసిన చెత్తకుప్పలు, వీని మధ్య పిల్లల తొట్టెలు, వీనిపైన అత్తకోడం[illegible]టికము, తోడికోడండ్ర కలహాలు, పొరుగింటి పోరుపులు, పైన ఋణబాధ, దీనికి తోడు యువకుల నిర్వ్యాపారత — నేటి హిందూగృహముయొక్క సౌభాగ్య మేమని వర్ణింతుము? ఇట్టి గృహములనుండి లక్ష్మీ సరస్వతు లుద్వాసమగుటలో నాశ్చర్య మేమి?

గృహములలో జంతుధర్మమైనను సరిగనిర్వర్తింపబడుటలేదు. ఒంటిలో సత్తువయుండిన గదా, ప్రాణధర్మమైనను సరిగ బోషింపబడుట? దేశములో ఖర్చగు అన్ని మందులలో గంజే, వీర్యస్ఖలనమునకు శగరోగమునకు ఔషధము లెక్కువగ ఖర్చగుటకు కారణ మేమి? మిస్ మేయో మన ప్రస్తుతస్థితిని తూలనాడినందు కెంతయో గినిసితిమి. కాని ఆమె వ్రాతలలో జాల యథార్థమున్నదని మనము అంగీకరించక తప్పదు.

సాంఘికనీతి నానాటికి బొత్తిగ జెడుచున్నది. కులటల కూటము లంతకంతకు ఎక్కువగుచున్నవి. మనదేశము కర్మభూమి యని గర్వించుకొనుటయేకాని, ప్రతిపట్టణములోను ఇప్పుడు వృద్ధినొందుచున్న కులటల సంఖ్య చూచిన విచారము వేయును. దారిద్ర్య మొకకారణ మనుటకు సందియములేదు. కాని అదియొకటే కారణము గాదు. అనారోగ్యమే ముఖ్యకారణము. శరీర దార్ఢ్యము గలవారిలో తృష్ణలు సర్వసాధారణముగ సక్రమమార్గమున నడచును. ఆరోగ్యము తప్పినవారి యందే బుద్ధులుకూడ వక్రగతి నొందును. వేశ్యాసంఘ మొకటే దేశమునకు మహాకళంకముగ నున్నదని విలపించుచుండ, అన్నికులములనుండియు వచ్చిపడుచున్న కులటలసంఖ్య నానాటికి పెరిగి, దేశము నెక్కడకీడ్చుకొనిపోవునో యని భీతి గలుగుచున్నది. ఆచారములు బయటకు బిరుసెక్కుచున్నట్లు కన్పట్టుచున్నవే కాని లోలోన వ్యభిచారము మరింత వృద్ధియగుచున్నది. ఈ కులటలకు గలుగు సంతానమున కెక్కడను శరణ్యము లేదు. వారి దొకకులము గాదు, ఒకసంఘము కాదు. వారెంతకాలము సంఘమునబయట నిశ్చింతగ నుండగలరు? పట్టణములకు వీరి మూలమున గలుగు ఆపద ముందు ముందు భయంకరరూపము దాల్చగలదు. పట్టణములు బయటకు శోభతో నున్నట్లు కన్పట్టుచున్నవే కాని, ఆ శోభ రోగపు వాపేకాని, బలుపు మెరుపు కాదు

పట్టణములు గ్రామములపైబడి దోచుకొనుచున్నంతకాలము, పట్టణములకు నిజశోభ యుండనేరదు. గ్రామములు శిథిలములైపోవుచున్నవి. ఇక పట్టణములను బోషించగలస్థితి వానికి తప్పిపోవుచున్నది. రయితు ఎత్తువడినాడు. గ్రామములు ఋణగ్రస్తము లైనవి. దీనికిదోడు పార్టీలు, కక్షలు. ఐకమత్యము పూర్తిగ జెడినది. కక్షలను తొలగించుటకుజేయు ఉపాయము లన్నియు తిరిగి కలహబీజములగుచున్నవి. పరపతిసంఘములు, స్కూళ్లు, లైబ్రరీలు, పంచాయతులు, యూనియనులు—వీనిచుట్టు నేడు పార్టీలు పెచ్చుపెరుగుచున్నవి. గ్రామములు నేడు విషవాయువులతో నిండియున్నవనిన అతిశయోక్తికాదు. నిర్మలహృదయులైన యువకులు కూడ వీనికి లోనుగావలసివచ్చుచున్నది. గ్రామములలోని కృషీవలుల అవస్థకంటెగూడ కర్మకారుల దుస్థితి మరింత భయంకరముగ నున్నది. వారి వృత్తులు పూర్తిగ నంతరించినవి. వారి కులమర్యాదలు కూడ నడుగంటినవి. కులవృత్తులను విడనాడి కూలినాలి చేసికొని ఎటులనో పొట్టపోసికొనవలసిన స్థితి పట్టినది. ఆసేతు హిమాచలపర్యంతము గ్రామముల కథ యొకటే విధముగ నున్నది. కులభేదములతో బాటు పార్టీకక్షలు కూడ ప్రబలి గ్రామములు మూలమట్టుకు గృంగిపోయినవి. ఇట్టి విపద్దశయందు చిక్కుకొనిన ప్రజలు ఎట్టి యుత్సవములను సలుపగలరు? వీరు సలుపు ఉత్సవములలో నెట్టి జవసత్వములును గనబడవు. బాలబాలికల బొమ్మల పెండ్లిండ్లవలె బరిహాసాస్పదములైన వినోదములకంటె, నీయుత్సవములలో నెట్టి విశేషమును గన్పట్టదు. జ్ఞాన విలసనమా, లేదు. కళాశోభయా, అంతకంటె లేదు. సంఘీభావమా, మొదటనే అడుగంటినది. కార్యదక్షత కేవలము మృగ్యము. రెండు వేపమండలు, ఒక సన్నాయిజోడు, ముచ్చిబంగారపు అతుకులు, గ్యాసోమల్లుల తళతళలు—ఇవితప్ప మన యుత్సవములలో నెట్టి సహజశక్తిప్రాభవము గోచరించుట లేదు. గృహములోపల, బయటగూడ దరిద్రమోడుచుండ, ఇంతకంటె వినోదము లెచ్చటనుండి వచ్చును? మన భాగ్య మింతకంటె నెట్లు హృద్గతమగును? దేశము పూర్తిగ దారిద్ర్యవంతమైనది. ఆర్థికముగనే కాదు, ఆరోగ్యములో, బుద్ధిలో, సౌందర్యములో, కళలలో—సర్వము శూన్యమైనది. మన దారిద్ర్యము మన నాటకశాలలో బొత్తిగ బ్రత్యక్షమగుచున్నది. ఈ నాటకములు కేవలము బూటకములనిన, అబద్ధముగాదు. అవి జాతియొక్క హృదయమునుండి బహిర్గతములైనవి కావు. వానికి దేశమును గదలింపగల ప్రబోధకశక్తి యే మాత్రమును లేదు. తోలుబొమ్మలాటలకైన నాశక్తి కలదేమో కాని, వీనికి వినోదమును గల్పించు నైపుణ్యము కూడ గొరవడినది. నేడు నాటకము ఒక కళకాదు. కేవలము ఉత్తేజనరహితమైన కాలక్షేపము. నేటి హరికథా కాలక్షేపములవలె నివి కూడ నొకకృత్రిమ వినోదములైనవి.

ఇట్టిదుర్గతి సంఘటించినది కేవలము జానపదులలోనేకాదు. జనపదము లజ్ఞానబంధురములని మన మొకవిధముగ సాకుచెప్పవచ్చును. విద్యాధికులలో గూడ నిజమైన సహజములైన విలాసోల్లాసములు కానరావు. వీరిక్లబ్బులను, వీరిసభలను, జూచిన ఈవిషయము తేటపడును. ఈవిద్యాధికులకు ధైర్య సాహసములను బురికొల్పు ఆటపాటలయం దట్టిచొరవయు లేదు. స్త్రీలుకూడసహింపని చీట్లపేక యొక్కటియే విద్యాధికులకు నేడు ప్రశంసాపాత్రమగుచున్నది. ఇక వీరి చర్చలకు నేటిసభలే తార్కాణములు. ఈ క్రిస్మసు సెలవులలో దేశమునం దంతట సభలు చెలరేగినవి. ఒకవిషయమును గూర్చికాదు——సైన్సుసభలు, ఫిలాసఫీసభలు, ఎకనామిక్సు సభలు, సంగీత సభలు, పొలిటికలుసభలు, నాటక సభలు——పేరునకు సమస్త విషయములు స్పృశింపబడినవి. విదుషీమణులుకూడ నీసభలను జరుపుటలో బురుషపుంగవుల కేమాత్రము వెనుకబడలేదు. కరాచీలోజరిగిన అఖిలభారత మహిళా సభను జూచినను, లేక విశాఖపట్టణములో జరిగిన ఆంధ్ర మహిళాసభను జూచినను, ఒకటేనాటకము గోచరించును. ప్రజలు గతానుగతికముగ జరుపు ఉత్సవములతో విద్యాధికుల కెట్టి సంబంధము లేదు. వీరు తమ పిల్లలకు దసరాపండుగలలో విల్లునంబులను, దీపావళికి సీమటపాకాయలను, సంక్రాంతికి జపానుబొమ్మలను గొనిపెట్టుటతప్ప వీరి కెట్టి స్థానములేదు. వీరికి సభలే వేడుకస్థానములైనవి. ఈసభలు చాలవరకు విద్యాధికుల వేడుకలనిన అతిశయోక్తికాదు. ఇంటి కష్టములను మరచుట కీ మూడు రోజుల విశ్రాంతి దొరికినందుకైనను వారు సంతసించెదరు. మామూలుత్సవములు కల్పించలేని ఉత్సాహోల్లాసము లీ సభలు కొంతవరకు గల్పించగలవు. సభాధిపత్యము లభించుట కొందరి జీవితమునకు జరితార్థతయగును. చర్చలలో బాల్గొననిచ్చిన చాలును తమ చాకచక్యమును బ్రదర్శించుకొనుటకని కొందరు అభిలషించెదరు. చర్చలలో పుట్టు వేడిమికి చలిపోగొట్టుకొనువారు కొందరు. తమ తీర్మానము నెటులైన నెగ్గించుకొనిన ఒక మహాయుద్ధములో గెలిచివచ్చినట్లుగ సంతోషించువారు కొందరు. ఈ సభలు ముందుముందు జరుగు ఎన్నికలకు సాయపడునని ఆశపడువారు కొందరు. ఈభావములకే ఈసభలు విశేషముగ దోహద మొసగగలవు క్రిస్మసు సెలవులలో బూర్వము కాంగ్రెసు కూడుచుండినప్పుడు, తక్కిన సభలన్నియు దాని ఛాయక్రింద మరుగయ్యెడివి. ఇప్పుడు కాంగ్రెసు సమావేశ సందర్భము మారుటచే, నీయుపసభల కన్నిటికి గొంత ప్రాముఖ్యము వచ్చినది. ఈ సభావృత్తాంతములను బత్రికలలో జూచిన, భారతవర్షమంతయు మూలమట్టుకు గదలిపోవుచున్నట్లు గన్పట్టును. కాని ఈ సభలకును ప్రజాసముదాయమునకును ఎట్టి సంబంధము లేదని తెలిసికొనినప్పుడే యీభ్రమ వీడగలదు. విద్యాధికులలోనైనను వారి మెదడులో గొన్ని కణములు తాత్కాలికముగ గదలుట తప్ప మరియొక విశేషము లేదు. బాలురకు బంతియాటవలె, నీ విద్యాధికులకు గొన్ని భావములతో నాడుకొనుట యొక క్రీడయైనది. ఈసభలలో నీభావముల క్రీడయే యెక్కువగ గోచరించును. "సోషలిజము" భావము కొందరిలో రోషాశ్రుహర్షభీత్యాది చేష్టా విలాసములను బురికొల్పును. సంతాన నిరోధక వాదము కొందరిలో గిలికించితము, బిబ్బోకము మొదలగు శృంగార చేష్టాదులను గలిగించును.

ఈనూతన భావపుంజములతో గ్రీడించుట వారికొకవిధమైన వేడుక. ఆవాదములు చెవిని బడుటతోనే మతిస్థిమితము తప్పినవారివలె చిందులు త్రొక్కుట మరికొందరికి వేడుక. ఈసభలు విద్యాధికులు కల్పించుకొనిన వేడుకలు. దేశము నిర్జీవమైనప్పుడు, జాతీయ జీవనమునం దెట్టి యుద్రేకాతిశయములు గలుగనప్పుడు, భావాభినివేశముగల విద్యాధికు లీకృత్రిమములైన వేడుకలను గల్పించుకొనుటలో నాశ్చర్యము లేదు. పత్రికలును ఈనాటకములోజేరి తమ పాత్రను యుక్తరీతిని బోషించుకొనుచున్నవి. పత్రికలే లేనియెడల ఈ సభలకు బ్రచారముగాని, సభాసదులకు ప్రకటనము గాని లేదు. సభలే లేనియెడల పత్రికలకు దగిన ఆహారముండదు. పత్రికలకును సభలకును అవినాభావ సంబం

ఘము గలదు. రెండును అన్యోన్యాశ్రయములు. ఈ రెండును దేశము బయటివేకాని, దేశములోనివిమాత్రము గాదు. దేశము మహావిపద్దశ నందియున్నది. ప్రజల మొరలు అరణ్యరోదనము లగుచున్నవి. దారిద్ర్య మన్ని ప్రాణుల పీడించుచున్నది వేడుకలనైనను సరిగ నడుపు కొనగల కౌశలమును దేశము పూర్తిగ గోలుపోయినది. పారతంత్ర్యమున మునిగెన దేశమునకు నిట్టిగతి అనివార్యము. ఏటిలోనీరు లేనప్పుడు, గట్లు త్రెగునను భయ మెందులకు?

(1935 జనవరి 5-వ తేది కృష్ణాపత్రిక)

---

## కార్కాల్ వద్దనున్న గుమ్మటరాజువిగ్రహము

మంగుళూరికి ఈశాన్యమున ముప్పదిమైళ్లలో కార్కాలను చిన్న ఊరొకటి ఉన్నది. ఇక్కడ ఉండే 'బస్తి' అనే జైన దేవాలయము, 'గుమ్మ రాజు'యొక్క పెద్ద శిలావిగ్రహమును అనేకుల నాకర్షించుచున్నవి. ఈయూరు పూర్వము చాలా ప్రఖ్యాతమైన జైననగరమయి యుండ వచ్చునని యిందువల్ల స్పష్టమగుచున్నది.



గుమ్మటరాజ శిలావిగ్రహము, కార్కల్ .D. A. R.

జైన నిర్మాణావశేషములు ముఖ్యము యినవి మూడు రకము లవి యిచ్చట గలవు: (౧) బెట్టులు, అనగా ఒక పెద్దవిగ్రహము, దాని చుట్టు గోడలు, (౨) 'బస్తీలు' అనగా జైన దేవాలయములు, (౩) జైన స్తంభములు- జైన నిర్మాణావశేషము లనేకములు దక్షిణకన్నడజిల్లాయందు కార్కాల్‌లోను, ఆ పరిసరములలోను గలవు.

'బెట్టులు' అనునవి పై మూటిలోను చాల ముఖ్యమయినవిగ పరిగణించు చున్నారు. ప్రపంచమున కంతయు

ఇవి మూడుమాత్రమే ఉన్నవి. అందు రెండు దక్షిణకన్నడములో—ఒకటి కార్కాలువద్ద, రెండవది వెన్నూరువద్దను ఉన్నవి. మూడవది మైసూరులో శ్రవణబెళగొలలో నున్నది. ఈమూడుచోట్లను గుమ్మటరాజు విగ్రహములే యున్నవి. శ్రవణబెళగొలలో నున్న విగ్రహము అన్నింటిలో పెద్దది. దానిఎత్తు ౫౭ అడుగులు. కార్కాల్వద్దనున్న విగ్రహము యెత్తు సుమారు ౪౧౪ అడుగులు. వెన్నూరునొద్దనున్న విగ్రహము ఎత్తు ౩౫ అడుగులు. ఉత్తరదేశవాసులగు జైనులీగుమ్మటరాజు పేరు గరు. కార్కాల్లోని విగ్రహముబరువు షుమారు ౮౦ టన్నులుండునట.

కార్కాలు వెన్నూరులలోని విగ్రహములను జక్కనాచారి యను శిల్పి మలిచెను. శిల్పికి ఒకచేయి దుర్బలమయిపోయినందువల్ల ఒక చేతితోనే వెన్నూరులో చిన్నవిగ్రహమును మాత్రము చేయగలిగెనని జనుల యభిప్రాయము.

కార్కాలులోని విగ్రహముమీద ఒకశాసనము గలదు. దానిప్రకారము క్రీ. శ. ౧౪౩౧–౩౨ లలో ఆవిగ్రహ నిర్మాణము పూర్తియయినటుల తెలియుచున్నది. ఈశాసనమువల్ల యింకను కొన్నివిషయములు తెలియుచున్నవి. ఇది, వీరపాండ్యునిచేత క్రీ. శ. ౧౪౩౨ లో, ప్రథమతీర్థంకరుడగు విషభుని కుమారుడగు బాహుబలిపేర ప్రతిష్ఠింపబడినది. శ్రావణబెళగొలలోని విగ్రహమును చాముండరాయడు క్రీ.శ. ౯౮౩లో స్థాపించెను. వెన్నూరులోని విగ్రహము కార్కాలునందున్న దానికంటె ప్రాచీనమైనదట. కావున ఈగొప్పవిగ్రహములన్నిటిలోను కార్కాల్నందలిది యిటీవలిది.

కార్కాల్లోని విగ్రహము చాల పెద్దదేకాక, అత్యున్నతమైన కొండపైన ఆకర్షణీయమగు ప్రదేశమున నిర్మింపబడియున్నది. ఈవిగ్రహము రామసముద్రమను చిన్నసరస్సుఅంచుననే యున్నది. ఈబెట్టకు ౨౦౦ మెట్లున్నవి. ఆపైన విగ్రహమున్నది.

ఇది దిగంబరవిగ్రహము. ఒకటే నల్లరాయిలో చెక్కబడియున్నది. అనేకశతాబ్దములనుంచి ఎండకు ఎండి వానకు తడిసిన కారణమున విగ్రహము నల్లబడిపోయినది. విగ్రహము చేతులను వ్రేలాడవేసుకొని గాంభీర్యమును ప్రకటించుచు నిలుచుకొనియున్నది. ఈవిగ్రహము పాదములు ఒకటొకటి ౪ అ. ౯ అం గుళములపొడుగు గలిగియున్నది. చిన్న అరుగుమీద విగ్రహము నిర్మింపబడియున్నది. దీనిచుట్టు రాతి ఆవరణ మొకటున్నది. విగ్రహము పాదములలోనుంచి ఒక తామరతీగ పుట్టినట్లు శిల్పి తననైపుణ్యమును ప్రకటించెను. ఈతీగ పైకిప్రాకి రెండుకాళ్లను చేతులను పెనవేసికొన్నటులకూడ నున్నది. ఇది సర్పాకృతిగలిగి ఉన్నది. బౌద్ధులు, జైనులు సర్పపూజచేయుచుండిరనుట కిది గొప్పనిదర్శనము.

౬౦ సం. ల కొకసారి కార్కాలులో ఒకఉత్సవము జరుగుచున్నది. మనదేశమందలి జనులనేకు లపుడిచటికి వచ్చెదరు. వారిలో అనేకులు జైనులే. ఆనాడు ఈవిగ్రహమునకు టెంకాయపాలతో అభిషేకము చేయుదురు. ఇందునిమిత్తము ౪౫ అడుగుల ఎత్తున నున్న విగ్రహముశిరస్సుకు సరిగ ఒకమంచెను కట్టెదరు.

---

## గమకి – గమకకళ

గమకమంటే యేమిటి? దానికేమర్థము? అది కూడా ఒక కళనా?

అంటే: 'గమయతీతిగమకః' అని గమధాతువు నుండి పుట్టిం దీశబ్దము. మరి గమనార్థకాలన్నీ జ్ఞానార్థకాలవుతాయనే నిరూఢివుండనేవుందిగా. కనుక బోధించేది, మనస్సులకు తెలివిడిపరచేది గమకమన్నమాట. విషయాన్ని వివరించకుండానే, వినేవారిమనస్సులకు బోధపడేటట్టు చదవడమే గమకము. ఇది సంస్కృత ధాతువునుంచి పుట్టిందయినా కన్నడదేశంలోనే కన్నడ భాషలోనే నిలిచిపోయింది. ఈ గమకంకూడా ఒకకళే. కళ భావసూచకమయింది (Art is Suggestive). అది మానవునిమనస్సులో ఆలోచనాతరంగములనులేపి హృద

యాని కాహ్లాదమునుగూర్చును. మరి ఈలక్షణాలన్నీ గమకానికున్నప్పుడు అదిమాత్ర మెందుచుకళగాదు ? అర్థ రసభావములు గల కావ్యాన్ని అర్థరసభావగర్భితంగా పఠించి, తన్మూలంగా శ్రోతలహృదయాన్ని కరగించడమే గమకానికి లక్ష్యము.

ఈగమకాన్ని అలవరచుకొన్నవాడు గమకి. సామాన్యంగా మనము గమకిని, కవిని వేరేవేరేగా భావిస్తున్నాము. కాని కవి విధిగా గమకి కాలేడుగాని గమకి మాత్రము తప్పక కవియవుతాడు. కవికి వుండవలసిన గుణాలన్నీ కూడా మనము గమకిలో చూడవచ్చు. కవికి బుద్ధిశక్తి, కల్పనాశక్తి అమితంగా వుండాలి. రవికాననివానినికూడా కవిగాంచ నేరుస్తాడు. కనుక అతడు కొత్తకొత్తభావాలను, కొత్తకొత్తమానసిక చిత్రాలను తనకృతిలో చూపగలడు. కవియాకృతిని గమకి తనబుద్ధిబలమువల్లా, కల్పనాసామర్థ్యమువల్లా అర్థరసభావగర్భితంగా పఠించి, ఒక్కొక్కప్పుడు కవికి తోచనిభావాలనుగూడా కొన్నిటిని శ్రోతలమనస్సులకు పట్టింపగలడు.

కవి రసజ్ఞుడూ, భావజ్ఞుడూకూడా అయివుండవలెను. కవిత రసభావపుష్టమయియున్నప్పుడే ఉత్తమ కవితయనిపించుకొంటుంది. గమకికూడా కవివలెనే రసజ్ఞుడూ, భావజ్ఞుడూ అయివుండాలి. కావ్యంలో కవి చిత్రించినరసాలను తాను తెలిసి, అనుభవించి అదే రసభావాలను శ్రోతలహృదయాల్లో అతడు పుట్టించవలసి వుంటుంది. ఈవిషయంలో గమకికీ నటునికీగూడా సామ్యముంది. నటుడు నాటకకర్త ప్రతిపాదించిన రసభావాలను తాను స్వతః అవగాహనచేసుకొని, ప్రేక్షకులమనస్సులకు వానిని పట్టిస్తాడు. నటునికి దృశ్యకావ్యము వస్తువయితే గమకికి శ్రవ్యకావ్యము వస్తువు.

కవి తనమనస్సులోని భావాలను తెలిపేటందుకు భాషను సాధనంగా గొంటాడు. కనుక అతడు తాను ప్రయోగించే శబ్దాలస్వరూపాన్ని బాగా తెలుసుకొని వుండాలి; ఛందోవ్యాకరణాలంకారాలు ఎరిగివుండాలి. మొత్తంమీద కవి భాషాపాండిత్యాన్ని సంపాదించియుండాలి. అలాంటికవిని అర్థంచేసుకొని, ఆయన ప్రతిపాదించిన అర్థాలను వివరించవలెనంటే గమకికి ఇంతో, ఇంకాహెచ్చు పాండిత్యం అవసరం.

ఇలాంటిసామ్యాలు ఇద్దరికీవుండడంవల్ల ఇద్దరినీ ప్రత్యేకపరచడానికి వీలులేదు. కవి ఒకవేళ గమకిగా వుంటే వుండవచ్చు, లేకపోతే లేకనూపోవచ్చు కాని గమకిమాత్రం తప్పకుండా కవి కావాలి.

కావ్యంలోని రసభావాలను ప్రతిపాదించడమే గమకిపని. దీనికి రెండేసాధనాలు: మొదటిది అభినయము. రెండోది సంగీతము. ఈరెండూకూడా గమకకళకు ముఖ్యాంగాలు. అభినయం నటునికిమాత్రమే అవసరంఅనడం పొరపాటు. నాటకంలోని రసభావాలను ప్రేక్షకహృదయాల్లో కలగజేయడానికి నటుడు అభినయాన్ని సాధనంగా తీసుకొంటాడు; నాటకసన్నివేశము, పాత్రరచన, రసభావాలకు తగినట్లు ముఖభావాలను, స్వరకంపనాన్ని, అంగవిన్యాసాలను చూపిస్తాడు; తన్మూలంగా ప్రేక్షకులకు ఆహ్లాదం కలిగిస్తాడు. రసభావప్రతిపాదనకు అభినయము నటునికి సహకారియవుతుందన్నప్పుడు, అదేరసభావాలను ప్రతిపాదించే గమకికీ సహకారియవుతుందని వేరేచెప్పబనిలేదు. పాశ్చాత్య కళాకోవిదులుకూడా భావప్రదర్శకమైన పఠనానికి ఎంతో ప్రాశస్త్య మిచ్చారు.

కాని కావ్యపఠనమప్పుడు గమకి కొన్ని రసభావాలను అభినయమాత్రంతో చూపించజాలలేక పోతాడు. అటువంటప్పుడు ఆఅభినయానికి మించిన సాధనం ఒకటి చేపట్టవలసివుంటుంది. అదేసంగీతం.

గమకకళలో సంగీతానికి స్థానంవుందాఅనేవారు గద్యపద్యాలకుండే తారతమ్యాన్ని బాగా తెలుసుకొని వుండాలి. గద్యకావ్యానికంటే పద్యకావ్యానికి ప్రాముఖ్యం ఎక్కువ. పద్యకావ్యము కవిఉదాత్తమనోభావాలను, రసపోషణను వ్యక్తంచేస్తుంది. ఇలాంటి ఉత్తమ భావాలను ప్రతిపాదించడానికి సంగీతము గమకికి చాలావరకు ఉపకరిస్తుంది. సంగీతము రసభావగర్భితమయింది. కావ్యము రసభావపూర్ణము.

గమకికి సంగీతంలో రాగంమాత్రం ఆవశ్యకం. రాగము రసభావప్రధానమయింది. హంసధ్వని రాగా

లాపాన్ని విన్నమాత్రాన హృదయం పరవశోద్రిక్తమవుతుంది. నాదనామక్రియాలాపన శోకాన్ని, ఆరభి, దేవగాంధారి, మధ్యమావతి ఆలాపనలు భక్తిరసాన్ని ఉద్రేకింపజేస్తాయి. సాహిత్యరహితమైన కేవలరాగమే ఇంత సులభంగా రసోద్రేకాన్ని కలుగజేస్తే రసభావయుక్తమైన సాహిత్యంకూడా దానితో చేరితే పాలకు చక్కెర చేసినట్టే. చక్కెర చేర్చకపోతే పాల కంత రుచిలేదు. ఒకవేళ చక్కెర ఎక్కువయినా పాల రుచి చెడిపోతుంది. ఇదే తత్త్వాన్ని మనం గమకకళలో చూడవచ్చు. సాహిత్యమనే పాలకు సంగీతమనే చక్కెరను సరియైన మోతాదులో సంయోజనచేయటంలో ప్రాముఖ్యం గమకిలోమాత్రం వుంది. గాయకునకు రాగమే రసము—పదము అతని కక్కర లేదు. భాషాబోధకులకు పదమే రసము — రాగము వద్దు. పురాణికులకు పదమూ, రాగమూ రెండూ వద్దు. గమకికి పదమూ రసము; రాగమూ రసము. గమకి తానే పద్యాలరసభావాలనూ, అటని రాగాలనూ మైత్రి వుంటుంది.

రాగం ఎప్పుడూ సాహిత్యంతో పొందిక కలిగివుంటుంది. శృంగారరస సందర్భంలో నీలాంబరిని, వీరరససన్నివేశములో నాదనామక్రియను, శోకరసస్థానములో జేగంటను ఉపయోగించి రసాభాసాన్ని నిజమైన గమకి ఎప్పుడూ చేయడు. కావ్యరసభావాలను పోషించేటందుకు గమకి సమయోచితాలయిన రాగాలనే వాడుతాడు. విశేషరాగాలాపనవల్ల రాగప్రస్తారం చేసేవాడు గాయకుడేగాని గమకికాడు. గమకికి కావలసింది రాగసత్త్వము (Essence of Raga). -

(సుబోధ)

---

## వలయపథము



నెలదిగో యొక్కనాఁడు మగవేసము పూని ప్రియంబుమీఱ న
న్నేల చెలువారఁగాయుతరి నీవు ననుం గయిదండపూని మే
నొలసెడు తావి జొంపముల నుండెడి పూలకు వద్దికిచ్చుచుఁ
'వలయపథంబు'లన్ దిరిగి వచ్చినసంగతి జ్ఞప్తియున్నదే?

[కుమారదేవ—మకరందస్యందనమునుండి]

---

## సర్ మాల్కొం క్యాంబెలు, అతని మోటారుకారు




ఇతడు ప్రపంచమున నెక్కువ వడిగ కారును నడిపి ప్రథమబహుమతిని పొందెను. ఇంకను వేగముగ నడుపుటకయి యీకారును తయారుచేసినారు. ఆతడు కారులో నిలిచియున్నాడు.

---

## మోహిని రాజదేవాలయము

మోహినిరాజదేవాలయము ఏడువందల ఏండ్ల నాటిది. అహమదునగరు జిల్లా యందు 'నవాస' గ్రామమున నున్నది. ఇది 'దినేశ్వరుని' ఇష్టదేవతామందిరము (చి౧). భగవద్గీతవంటి గ్రంథమును, 'దినేశ్వరి 'ని మహారాష్ట్ర భాషయందు దినేశ్వరుడు రచియించెను. ఇత డీ గ్రంథమును రచించినపుడు ఆనుకొని యుండిన స్తంభము (చి ౨)నకు 'దినేశ్వర' స్తంభమని పేరు వచ్చినది. ఈ స్తంభమున్న భవన (చి 3) మొక దివ్యతీర్థము. ఏటేట నక్కడ ఉత్సవము జరుగుచుండును. దిక్కున ప్రజలు వేలకొలదిగ నచ్చటకు చేరుదురు.



కృష్ణతృతీయ

[ శ్రీ యస్. కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీన చిత్రసంచయమునుండి ]




౨. దినేశ్వర స్తంభము

---

## బుక్కపట్టణపు చెఱువు

అనంతపురముజిల్లాలోని చెఱువులలో నెల్ల బుక్కపట్టణపుచెఱువు మిక్కిలి పెద్దది—ముఖ్యమైనది. రాయలసీమలోని మిగిలిన చెఱువులవలెనే ఇదియును మూడుప్రక్కల కొండలచే జుట్టబడి కేవల వర్షాధారమున నిండుచుండును. ఈచెఱువు మిగిలినచెఱువులవలె సులభముగా నిండదు. వర్షాకాలములో అనేకములయిన కొండవాగులు దీనిలోనికి ప్రవహించినను పదిసంవత్సరముల కొక్కమారు ఇది నిండును. వెనుక నిది, ౧౯౩౦-౩౧ సంవత్సరమున నిండెను. ఈసీటిచే చాల విస్తీర్ణము సేద్యమగుటచే చెఱువునిండిన ఒకటి రెండు సంవత్సరములవరకును లేమియనునది యుండదు.

ఈచెఱువునకు నాల్గవప్రక్క ఒక ఎత్తైనగట్టు కలదు. సుమారు మూడుమైళ్ల పొడవగు ఈగట్టునకు ఒక ప్రక్క బుక్కపట్టణమును, మరియొకప్రక్క క్రొత్తచెఱువను నొకయూరును గలవు. బుక్కపట్టణము చెఱువున కెంతప్రసిద్ధియో క్రొత్తచెఱువు పసుపులసంతె (పరష యనబడును) కంతప్రసిద్ధి. ఈచెఱువు నిండినప్పుడు అనేకజనులు ప్రక్కయూళ్లనుండికూడ వచ్చి చెఱువుగట్టుక్రింద గుడిలోనున్న చౌడమ్మయను దేవతకు పూజలు సలుపుదురు.

పురాతనములగు ఈచెఱువులో సౌకర్యములగు నూతనపద్ధతితూములు లేకపోయినను చెఱువునీరు పొలముల కుపయోగించుటకు చెఱువుక్రిందనుంచి యొక కాలువ తీయబడియున్నది. దీనియం దెంతనీరు వలయునో యంత నీరు వదలుటకు చెఱువులో నొక రాతితూము, దానిపయి నొకతిన్నె కట్టబడియున్నవి. ఇది గట్టునకు సుమారు ౧౫ గజములదూరమున నున్నది. చెఱువు నిండినప్పుడు ఉప్పరవాండ్రు (వీరే ఈ పని చేయవలెనని కట్టడి కలదు.) ఈదుకొనిపోయి నీటిని వదలుదురు.



౧. చెఱువుగట్టుమీదనుంచి చెఱువునిండినప్పటి దృశ్యము. శాంతముగా, గంభీరముగా ప్రకృతిని ప్రతిబింబించుచున్నది.

ఈ చెఱువుక్రింద నేరు సెనగ, చెఱకు, తమలపాకులు, రాగి, సజ్జ, వరియును ముఖ్య

మయిన పంటలు. వరిపంట యుపయోగమునుగూడ చాల తక్కువ. వేరుసెనగయే వారికి అధికమయిన రాబడికి కారణము.

ఇక వేసవియందు ఈ చెఱువునందు నీరే యుండదు. ఒక కాలువమాత్రము కొద్దిగ పారుచుండును. ఈ యూరంతకును నదియే జలాధారము. ఇట్టి సందర్భములలో చెఱువు నిండక కఱవు సంప్రాప్తించె ననిన నది యొక వింతకాదు. ప్రాచీనులగు రాజులు, పుణ్యపురుషులు ప్రజాసౌఖ్యము కొఱకు సకలకష్టములు పడి చెఱువులు త్రవ్వించియుండిరి. ఇప్పుడు యంత్రసహాయముండియు ప్రజలకు కఱవుబాధ తప్పు నుపాయములు చేయుట కవకాశములు లేకపోవుట విచారకరము. భగవంతుడైనను ఎక్కడలేని బీదలపై దయగలిగి వర్షప్రాప్తి గలుగజేసి ప్రజలను పోషించుగాక! అంతవరకును దేశమునందలి ప్రజలందరును విరివిగా క్షామనివారణార్థము తోడ్పడుట వారివిధి. కావున ఎవరికి తోచినసహాయము వారు చేయుదురుగాక యని వేడుచున్నాను.



౨. కుడిచేతి ప్రక్క గట్టును, దానికి కొంచెముదూరములో నొక తిన్నెయు కనిపించును. ఈదృశ్యము ఒక ఎత్తయిన కొండమీదనుంచి తీయబడినది.



3. ఈచెఱువువలన సాగుబడియగు పొలములలో ఒక్కపట్టణపుపైపున నున్నవాటి దృశ్యము.

యన్. జగన్నాథస్వామి.

## దిద్దుపాటు

'భారతి' ౧౨వ సంపుటము, మొదటిసంచిక, ౭౫వ పుటయందు ప్రకటితమయిన 'నీతికంఠ ప్రాతము' యొక్క యేడవపద్యముయొక్క నాలుగవపాదమునందు "సుధ దొరకని చోటునందు" అని యున్నది. దానిని "సుధ దొరకనితావునందు" అని సవరించి చదువవలెను.



# ఆంధ్రాభ్యుదయము

## శ్రీ పి. టి. రాజుగారు



వీరు ఆంధ్రులు; వర్ధమానులగుచున్న తాత్త్వికులు: వీరు విదేశీయతత్త్వశాస్త్రపత్రికలకు వ్యాసముల వ్రాయుదురు. వీరివ్యాసములు చాల మెప్పును గాంచినవి. 'ప్రేగు'న జరుగనున్న తత్త్వశాస్త్రమహాసభయందు 'నేటినాగరికత తత్త్వశాస్త్రసందేశము' అనువిషయమును గూర్చి యుపన్యసింప నిర్వాహకుల వీరి కాహ్వానమువచ్చినది.

ఇట్టిగౌరవమునకు పాత్రులయిన కొలదిమంది భారతీయులలో వీరొకరు. శంకరునియొక్కయు, హెగెలు యొక్కయు మతముల తత్త్వమును పోల్చి పరిశీలించుటయందు వీరు ప్రత్యేకముగ కృషిచేయుచున్నారు.

---

## యజ్ఞమిల్లి శ్రీరామచంద్రుడుగారు, M. A.



ఈయన కాకినాడ నివాసి. కాశీ విశ్వవిద్యాలయమున నిటీవల జరిగిన అఖిలభారత వాదసామర్థ్య ప్రదర్శనసభయందు ద్వితీయబహుమానమును పొందెను.

ప్రథమ బహుమానమును బొంబాయి లా కాలేజి విద్యార్థి పొందినాడు.

---

## శ్రీ బాలకృష్ణసింగుగారు గోటితో నొక్కిన చిత్రమునకు ప్రతికృతి



ఈచిత్రమును చిత్రించిన బాలకృష్ణసింగుగారు గుంటూరు నివాసులు; వీరిప్రాయము ముప్పది. వీరికి చిన్నతనమునుండియు చిత్రకళయందు చాల అభిరుచి. పదునైదేండ్లు స్వయంకృషిచేసి వీరు చిత్ర, శిల్పకళల బాగుగ నభ్యసించిరి. వీరికి చెక్కడపు పని (Engraving), ఫోటోలుతీయుట, మృదంగము, కంచరము, కుట్టుపనికూడ చక్కగా చేతనగును. వీరు బొటనవ్రేలిగోటితో కాగితముపయి నొక్కి ఉబ్బెత్తుచిత్రములను తయారుచేయుట యందు చాల నిపుణులు. ఇది తేలికపని కాదు. వీరునేర్చినకళలలో నిది ప్రధానమయినది. ఇట్టి చిత్రములను తయారుచేయగలుగువారు చాల అరుదుగ నుందురు. వీరు ఈబొమ్మలయందు పోలికలుగూడ తేగలుగుదురు. వీరు తయారుచేసినదే పైచిత్రము. ౧౯౨౫ సంవత్సరమున బి. ఏ. పరీక్షకు వెళ్లియుండిరి.

# భారతీయ మహిళామండలి

శారదానికేతనము-గుంటూరు



౧. వైద్యాలయము

నూతనగృహప్రవేశము



౨. గుఱ్ఱపుస్వారీపరీక్ష

## ఆంధ్ర మహిళా మహాసభ - కంభముమెట్టు



శ్రీమతి వెల్లాప్రగడ సీతాకుమారి
అధ్యక్షురాలు



౧. శ్రీ వ. ఇందిరాదేవి ౨. శ్రీ .కే. లక్ష్మీబాయి
స్థాయిసంఘ కార్యదర్శులు



3. శ్రీ న. సుందరమ్మగారు
(ప్రథమాంధ్రమహిళాసభాధ్యక్షురాలు)
కన్యావిక్రయ, వరవిక్రయ నిషేధపు తీర్మానమును
ప్రతిపాదించుచున్నారు.



# గ్రంథ స్వీకారము

## శ్రీమదాంధ్రభగవద్గీతాసంగ్రహము

గ్రంథకర్త్రి: మందిరాజు సీతమాంబగారు, అప్పికట్ల. చిన్నసైజు ౧౮౨ పుటలు. వెల ౦-౩-౦.

---

## సుధాలహరి

అనువాదకులు: పైడిమఱ్ఱి సూర్యనారాయణ శాస్త్రిగారు, గోలకొండపత్రికాలయము, హైదరాబాదు. చిన్నసైజు, ౩౨ పుటలు, వెల ౦-౨-౦.

---

## ఆహుక చరిత్రము

గ్రంథకర్త: పండితారాధ్యుల సూర్యనారాయణమూర్తిగారు, బోర్డుహైస్కూలు, అమలాపురము. క్రౌను ౩౬ పుటలు, వెల ౦-౧౨-౦.

---

## నూతన సంస్కృత వ్యాకరణ బాలబోధిని (ప్రథమభాగము)

గ్రంథకర్త: బుక్కపట్నం అణ్ణయాచార్యులు గారు, జిల్లాబోర్డుహైస్కూలు సంస్కృతపండితులు, పెనుగొండ, అనంతపురంజిల్లా. క్రౌను ౮౦ పుటలు వెల ౦-౬-౦.

---

## రామానుజగురువరణము (ఏకాంకనాటకము)

గ్రంథకర్త: కరి నారాయణాచార్యులుగారు, ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు, రామతీర్థము, నెల్లిమర్లపోస్టు, విశాఖపట్టణంజిల్లా. క్రౌను ౪౮ పుటలు, వెల ౦-౧౨-౦.

---

## పద్మినీబాయి (చారిత్రక నవల)

రచయిత: వనం వేంకటనరసింహారావుగారు, ఖమ్మంమెట్టు (N. G. S. R.) క్రౌను ౨౦౫ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

## స్వప్నకథ

గ్రంథకర్త: జి. జాషువగారు, వినుకొండ క్రౌను ౫౦ పుటలు, వెల ౦-౧౨-౦.

---

## నెలపొడుపు

గ్రంథకర్త: కృత్తివెంటి వెంకటసుబ్బారావు గారు, రాజమండ్రి. క్రౌనుసైజు, వెల: విద్యార్థులకు రు. ౦-౧౨-౦. ఇతరులకు రు. ౧-౦-౦.

---

## శారదాకాంచిక చతుర్థకింకిణి
## గ్రామ్యభాషాప్రయోగనిబంధనము

గ్రంథకర్త: వేదము వేంకటరాయశాస్త్రిగారు. ప్రకాశకులు: వేదము వేంకటరాయర్, మల్లికేశ్వరగుడి సందు, లింగిశెట్టివీధి, జి. టి. మదరాసు. డెమ్మీ ౬౪ పుటలు, వెల ౦-౧౨-౦.

---

## మణిద్వీపము

గ్రంథకర్త: జమ్మలమడక సూర్యనారాయణ శాస్త్రిగారు, శ్రీ లలిత గ్రంథమాల, రామారావుపేట, కాకినాడ. డెమ్మీ ౧౪౫ పుటలు, వెల తెలియదు.

---

## విశ్వకర్మబ్రాహ్మణవంశాగమలఘువిమర్శనము

గ్రంథకర్త: ఎస్. నారాయణాచార్యులుగారు, నెం. ౧౨, బ్రాడ్వే, జి. టి. మదరాసు. డెమ్మీ ౧౯ పుటలు, వెల ౦-౨-౦.

---

## శ్రీకృష్ణ జంత్రి

కర్త: దుద్దుకూరు శ్రీకృష్ణమూర్తిగారు, దుద్దుకూరు, ఒంగోలు. డెమ్మీ ౧౯౦ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

## సర్వేశ్వర శతకము

గ్రంథకర్త: రావిపాటి లక్ష్మీనారాయణగారు, గురజాల. డెమ్మీ ౧౫ పుటలు.

---

## గౌతమి

కొత్త సచిత్ర మాసపత్రిక. ఆచంట సూర్య నారాయణమూర్తిగారు రాజమహేంద్రవరమునుండి ప్రచురిస్తున్నారు. సాలు చందా ఒకరూపాయ. విడిపత్రిక రెండణాలు. సాంఘిక, నైతిక, ఆర్థిక, భాషా విషయాలను చర్చిస్తుంది ఈపత్రిక.

---

## పూలదండ

మరియొక మాసపత్రిక; కొత్తది. ఇదికూడా రాజమహేంద్రవరమునుండి వెలువడుతున్నది. సంపాదకులు తమిరిశ శ్రీరామ అప్పారావుగారు. విడిపత్రిక రెండణాలు. ఈపత్రిక కథలనే ఎక్కువగా ఆహ్వానిస్తూంది; వ్యావహారిక భాషను కోరుతూంది.

---

## గోలకొండకవుల సంచిక

సంపాదకుడు: సురవరము ప్రతాపరెడ్డిగారు, ప్రకాశకులు: గోలకొండపత్రికవారు, హైదరాబాదు. గోలకొండపత్రిక చందాదారులకు వెల రు. ౧. ఇతరులకు రు. ౨.

---

# మనవిమాటలు

**ఆంధ్రవిశ్వకళాపరిషత్తు-గౌరవబిరుదప్రదానము**

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు మొన్నటి కాన్వకేషను సమయమున జయపురప్రభువు శ్రీ



శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు

విక్రమదేవవర్మ మహారాజులుంగారికిని, మదరాసు గవర్నరు శ్రీ స్టాన్లీ ప్రభువుగారికిని డి. లిట్. బిరుదముల నిచ్చి సత్కరించినది. మొదటివారు బహుధన ప్రదానమునను, రెండవవారు ఉద్యోగధర్మ నిర్వహణమునను కళాపరిషత్తునకు మిక్కిలి సాహాయ్యము నొసగించినవారు. వారి యా సాహాయ్యమును స్మరించుచు పరిషత్తు కేవలము పాండిత్య గౌరవసూచకమగు నీబిరుదమును వారి కొసగినది. ప్రభువులిరువురు విద్యాధికులు, విద్యాపోషకులు నగుదురు. కాని, తత్ప్రసక్తి యీ బిరుదప్రదానమునకు కారణము గాలేదు. ఇట్టి సంప్రదాయ మితర విశ్వవిద్యాలయములందు నుగలదు. 'గతానుగతిక' న్యాయమున ననుసరించి ఆంధ్రవిశ్వకళాపరిషత్తును ఆసంప్రదాయముచే యవలంబించినది; గౌరవబిరుద ప్రదానమున, తన పెంపున కుపకరించిన ప్రభుద్వంద్వము నెడ, తన కృతజ్ఞతను ప్రకటించుకొనినది. ఈయుత్తమ బిరుదప్రదానమే పరిషత్తు చేయగలిగిన యుత్తమ సత్కారము- ప్రభువుల యుపకారమునకు చాలినను చాలకున్నను.

విశ్వవిద్యాలయములసంపద బిరుదములు. అవి పాండిత్యవిషయకములు. గౌరవబిరుదములందును శ్రేష్ఠములు. వానిని చేయితగులకుండ వ్యయింపనగును గానియౌచిత్యమును పాటింపవలెను. పాండిత్యగౌరవప్రకటనమునకే వానిని వినియోగింపవలెను. అన్యవిషయములకు వినియోగింపజనదు. ఇతరసంపద లేమి నీ 'యేక మూలికా ప్రయోగ'పద్ధతి ఏర్పడియుండవచ్చును. కాని, యిది ప్రశస్తము కాదు. ఉన్నతవిద్యాపీఠములగు విశ్వవిద్యాలయముల కీపద్ధతి యేమాత్రమును తగదు.

ఇదివరకు నీ యాంధ్రవిశ్వకళాపరిషత్తు పండితవతంసములగు వేదము వేంకటరాయ శాస్త్రి ప్రభృతుల కుత్తమ గౌరవబిరుదముల నొసగి సత్కరించినది. అది దాని 'తాహత్తు'

నకు దగిన కార్యము. అట్లే ఆంధ్రదేశము నందలి పండిత వతంసములను, ముఖ్యముగ నాంధ్రవాఙ్మయాభివృద్ధి కుపకరించినవారిని, అర్హములగు (గౌరవ) బిరుదముల నొసగి సత్కరించుచుండుట పరిషత్తునకు తగును. ఆంధ్రవాఙ్మయ వికాసమున కుపకరింపగల వారినికూడ గుర్తించి సత్కరించుట వివేకము. ఇందువలన నాంధ్ర వాఙ్మయాభివృద్ధి కవకాశము విశేషముగ లభింప గలదు. ఆంధ్రవాఙ్మయాభ్యుదయమే ఆంధ్రవిశ్వకళా పరిషత్తునకు పరమలక్ష్యము కావలెను.

---

### ఆంధ్రవిశ్వకళాపరిషత్తు- శాస్త్రగ్రంథరచనము

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రకటించిన ఎనిమిదవ సాంవత్సరికనివేదికయందలి ౪౯-వ పేరావలన 'దేశభాషద్వారమున విద్యాబోధనము కావింపవలె' ననుసంకల్పము నాచరణమునకు దెచ్చుటకయి గణితాది శాస్త్రగ్రంథములను, చరిత్ర గ్రంథములను ఇంటర్మీడియటు తరగతికి తగునట్లు తెనుగున రచియించి, ౧౯౩౭-వ సంవత్సరము ఏప్రిల్ నెలకు పూర్వము ముద్రణార్థము తన కందజేయ సమర్థులను నియమించినట్లు తెలియుచున్నది. ఇది సంతోషవిషయము. ఇట్లొనర్చి పరిషత్తు అభినందనార్హమయినది.

కాని, తాను నియమించిన యా 'సమర్థు' లెవ్వరో ప్రకటించినది కాదు. అది పొరపాటు; ఒండె అలవాటు. పరిషత్తు ప్రజాసంస్థ. తాను పుట్టినది ప్రజాభ్యుదయముకొరకు; తా జేయు కార్యములకు వివేకసంపన్నులు, విజ్ఞాననిధులు నగు ప్రజాప్రముఖుల యంగీకారమావశ్యకము. ఈవిషయమున నాలోచన చెప్పగలపెద్దలు, పరిషత్తు దృష్టికందని సమర్థులను పరిషత్తున కెరుకపరచగలవారు పలువురుందురు. వారిసలహాలను సయితము కొని, తననిర్ణయమును కావింపవలసియుండెను. కాని అన్యథాజరిగినది. చివరకీగ్రంథరచనము 'కొండనుత్రవ్వి ఎలుకనుపట్టుట' కాకుండవలెను.

కాక, గ్రంథములు ఇంటర్మీడియెటు తరగతికి తగునట్లు ఉండవలె ననునియమము తత్తద్విషయపరిజ్ఞానమునకు హాని కలిగించు ననవలసియున్నది. అంతకుముందు తరగతులకు తగినగ్రంథము లున్నపు డానియమమున కర్థముండును; ప్రయోజనముండును. ఇంతకును ఈతెరలోనికలాపమంతయు వెలికే వేషమున రానున్నదో చూతము.

---

### ఆంధ్రవిశ్వకళాపరిషత్తు- చరిత్రగ్రంథరచనము

ప్రారంభముననుండి విద్యాలయములయందు దేశచరిత్రపఠన మొకప్రధానభాగముగ నున్నది. చిన్నతరగతులకును దేశచరిత్రగలదు. అం దాంధ్ర దేశచరిత్ర, ఆంధ్రుల చరిత్ర అత్యల్పము. అదియు నసంబద్ధము.

భారతదేశ చరిత్రగ్రంథము లనేకము లాంగ్లమున గలవు; కాని, ఆంధ్ర దేశచరిత్రమునకు ప్రత్యేకగ్రంథ మొక్కటయినలేదు. అసలాంధ్రదేశచరిత్రమునకే వానియం దంతగా ప్రసక్తిని కల్పించినారుకారు తద్రచయితలు.

ఆంధ్ర దేశచరిత్రము, ఆంధ్రుల చరిత్రము లేని దక్షిణభారత దేశచరిత్రము సగమునకు తక్కువ. దానిసరపూర్ణతకు సమగ్రాంధ్ర దేశచరిత్రరచన మత్యావశ్యకము.

ఆంధ్రుల కాంధ్ర దేశ చరిత్ర జ్ఞానము మొదటిది; తరువాత ఇతర దేశ చరిత్రల జ్ఞానము మాట.

ఇటీవల బహుళ పరిశోధనఫలముగ ఆంధ్ర దేశచరిత్రసామగ్రి అనంతముగ బయలు పడుచున్నది. దానివలన పూర్వాపూర్వసిద్ధాంతములు తలక్రిందు లగుచున్నవి! చరిత్ర యంతయు నూత్న రూపమును దాల్చనున్నది. కాని యది సానుపూర్వికముగ గ్రంథ రూపము నింకను పొందజాలకున్నది.

అట్టియమూల్య చరిత్ర సామగ్రిని, నిరంతర బహుకాలపరిశోధనమున హస్తగతము కావించుకొనినాడు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ. ఆయన ఉపజ్ఞగల చరిత్రపరిశోధకుడు. ఆయన తీర్చినసిద్ధాంతములు ప్రమాణబద్ధములు. సమదర్శులగు తజ్జ్ఞులకు వాని ప్రామాణ్యము నంగీకరింపక తప్పదు. ఆంధ్రులలో సమగ్రాంధ్ర దేశచరిత్రరచనమునకు దగినసామర్థ్య మాయనకొక్కనికే కలదు.

ఆయన స్వాతిశయమును ప్రకటించుకొన నొల్లడు; ప్రసిద్ధికయి ప్రాకులాడడు. కాని ఆయనచరిత్రపాండిత్య మాంధ్రచారిత్రకలోక మాబాలగోపాలమునకు నెఱుకయే. కాదను టాత్మవంచనము.

ఆంధ్రేతర దేశచరిత్రరచనమునకు నూత్నపరిశోధన మక్కరలేదు. ఆంగ్లగ్రంథముల ననుసరించి తద్రచనమును సాగింప నగును. అట్లు సాధ్యముకానిది ఆంధ్ర దేశ చరిత్రరచనము.

నేడాంధ్రులకు మృగ్యమయిన ఆంధ్ర దేశచరిత్రమును ప్రత్యేకము సమగ్రముగ రచియింపించు టాంధ్రవిశ్వకళాపరిషత్తునకు ప్రథమము, ప్రధానము నగు కర్తవ్యము.

ఇపుడు కళాపరిషత్తు శాస్త్ర, చరిత్ర గ్రంథముల నింటర్ మీడియటు తరగతికి తగినట్లు రచియింపింప తలపెట్టి ఆయావానిని రచియింప 'సమర్థుల' నియమించితి ననుచున్నది. చరిత్రగ్రంథరచనమున కెవ్వరెవ్వరిని నియమించినది? అం దాంధ్ర దేశచరిత్ర రచనము నెవ్వరి కప్పజెప్పినది? అందుకు సర్వవిధముల సమర్థుడయిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి మాత్రము కాదు.

ఏల? పరిషత్తుదృష్టి కాయన యందలేదా? పరిషత్తు సభ్యులలో నాయన సామర్థ్యము నెరిగినవారు లేరా? ఒండె ఆయన యందు 'డిగ్రీ'లపొంగు లేమియా? ఆయన చరిత్రజ్ఞానము 'డిగ్రీ'లిచ్చుజ్ఞానమునకు వేయిడిగ్రీలు పెద్ద యని పరిషత్తునకు దెలియదు కాబోలు! 'డిగ్రీ' అవశ్యమేని అర్హమగుదాని నొసగు నధికారము పరిషత్తునకు లేకపోలేదు. ఆయన కొక గౌరవ—'డిగ్రీ' నిచ్చిన పేరునకయిన యాయనదర్హత తొలగిపోవును.

కాబట్టి యట్లొనరించి ఆయన చేత సమగ్రాంధ్రదేశ చరిత్రమును రచియింపించవలెను. కళాపరిషత్తు, విజ్ఞానధనుల సమ్మానము, విజ్ఞాన సంపాదన సంరక్షణములు విశ్వకళాపరిషత్తునకు నిత్యకర్తవ్యములు. కర్తవ్యముల నేనాడును ఒప్పరికింపకూడదు, ఉన్నతవిద్యాపీఠమగు విశ్వకళాపరిషత్తు.

మఱియు, నాంధ్రదేశచరిత్ర రచనము విషయమున నింటర్ మీడియెటు తరగతికి తగునట్లు రచియింప వలె నను నియమము పనికిరాదు. అది సంపూర్ణముగ రచియింపబడవలెను. దానిలో నాతరగతికి తగిన భాగముల తరువాత నిర్ణయించుకొననచ్చును. దాని నొక తెనుగున నేకాదు, ఇంగ్లీషునను రచియింపవలెను.

---

## శాస్త్రగ్రంథములు, పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘము

సాహిత్యప్రధానములగు గ్రంథములకే వ్యాకరణాదినిర్బంధములు వలదోయని మొరవెట్టుచున్న యీకాలమున విషయప్రధానములగు శాస్త్రగ్రంథములను (Science Books) వ్యాకరణాదినిర్బంధము లింకను పీడించుచుండుట విషాదమును కలిగించుచున్నది. శాస్త్రరచనములకు సాంగోపాంగముగ చిన్నయ్యసూరిసూత్రములను పట్టింప చూచుట ప్రాజ్ఞత యనిపించుకొనదు. అట, ఇంకలలో నరసున్న లేకున్నను, కొరకు, కరకులలోనిది 'బండిర' కాకున్నను ఆపదముల యర్థమునకు లోపము కలుగదు. 'అరటిపిల్ల' అనుపదమున 'ర' తరువాత అర్ధానుస్వారము లేదనియు, 'పిల్ల' అని మొలకకు చెప్పరాదనియు ఒకానొకగణిత గ్రంథమున కనర్హతాముద్రను తగిల్చెనట పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘము! ఇది ప్రాజ్ఞతయో అజ్ఞతయో, ధీమంతులు నిర్ణయించుకొందురు.

శాస్త్రగ్రంథనిర్ణాయక సంఘమువారికి వ్యాకరణాది లక్షణపరిజ్ఞాన మందుబాటులోనిది కాదు. కాకున్న బాలవ్యాకరణమునందలి యుదాహరణపదము లొండురెండు కన్నులనెక్కగా దాచుకొనియుందురుకాబోలు, అట్టివి గ్రంథముల కనుపడగనే పోల్చి చూచుటకు! బాగుబాగు, వీరిప్రజ్ఞ!

శాస్త్రగ్రంథములు విషయప్రధానములు. వానిరచనము సుగమముగనుండవలెను. వానిని వ్యాకరణనియమములతో బంధించిన యెడల నవి కొరకరానికొయ్యలయి తమ ప్రయోజనమును కోలుపోవును. అట్లని కేవలము గ్రామీణములగు పదములు, ప్రయోగములు—నేడు పత్రికలయందు తలకొకతెరుగున కనుపించునవియు తగవు. వానికొకతీరు, ఒకతెన్ను లేదు; నిలుకడలేదు. అవి అందఱకును అర్థముకావు. కావున నట్టివానితో నిండినవ్రాత యంగీకార్యముకాదు. మఱియు, వ్యాకరణనియమముల కట్లు, అర్ధానుస్వార

శకటరేఫములబరువు, సంస్కృతసమాసముల బిగువు శాస్త్రగ్రంథములకు నేపాటియు పనికి రాదు. కేవలము సరళము, సుగమము నగు రచనమే వానికుండవలసినది. పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘమువా రింతమాత్రము చేయ గలిగినచాలును, చక్కనిగ్రంథములు బాలు రకు లభింపగలవు.

---

'హిందూదేశము–ఎకానమిక్ ప్లానింగ్'

ఈవ్యాసము డాక్టరు బి. వి. నారాయణస్వామినాయుడుగారు, కొప్పర్తి వెంకటరావుగారు ఇరువురు రచియించినట్లు జెనుకటి (జనవరి) సంచికయందు ప్రకటితమయ్యెను. దాని నాతీరున వెంకటరావుగారు ప్రకటనమునకు పంపిరి.

తరువాత డాక్టరుగారు తాము దాని ఆంధ్రానువాదమునకు జబాబుదారి కామని యు, ఆవిషయమును భారతియందు ప్రకటింప వలసినదనియు లేఖవ్రాసిరి. ఆ లేఖనుబట్టి దాని యాంగ్లమూలము డాక్టరుగారిదనియు, వెంకటరావుగారు దానికి అనువాదము చేసిన వారు మాత్రమేయనియు విస్పష్టముగా తెలియుచున్నది. అనువాదకులగు వెంకటరావుగారు మూలకర్తృత్వమున భాగస్వాము లేల కాగోరిరో ఎరుకకందకున్నది. కాని ఇది గర్హ్యాతిగర్హ్యమగు కార్యము. మునుముందు ఇట్టికార్యముల నొనరింపకుండుటకయి శ్రీ వెంకటరావుగారి కిది గట్టిసలహా.

---

ఆంధ్రనాటకకళాపరిషత్తు – నాటకబహూకృతి

ఆంధ్రనాటకకళాపరిషత్తు బహూకృతి నాటకరచనమున నాటకకర్తలకు కొన్ని 'నిబంధనలు' తొలుత ప్రకటించినది. ఆనిబంధనలు నేడు సంస్కారములకు లోబడి ఈ క్రింది 'సూచనలు'గ పరిణమించినవి. ఏవో కొన్ని చిన్నఅసందర్భములు- ఎప్పుడువలసిన నపుడు దిద్దుకొనదగినవి–తప్ప ఇవి గ్రంథకర్తృరచనాస్వాతంత్ర్యము నరికట్టునవికావు దేశకాలములనుబట్టి ప్రదర్శనసౌకర్యముకొరకయినవి కాని.

అయిన, నీబహూకృతినిర్ణయము నాటకములను చదువుటతో తృప్తిచెంది కావింపబడునా? ప్రదర్శనమున తేరినపిదపనా? ఇది పెద్దసమస్య. నాటకము చదువ నింపుగ నుండవచ్చును. కాని ప్రదర్శనమున పాడు కావచ్చును-గొప్పనటకులే ప్రదర్శింతురుగాక! లేక, ప్రదర్శనము బాగుగ నుండవచ్చును, కాని చదువ వెగటుకొలుపవచ్చును. చదివినను, ప్రదర్శించినను రంజకముగనుండినదే బహూకరణార్హము కాదగినది—నాటకము ముఖ్యముగ ప్రదర్శనమున కుపయోగింపవలసినది కాన!

●

ప్రపంచసారస్వతముతోపాటు చిరంజీవమయి వెలయదగిన నాటకరాజమును–శాకుంతలమును–రచియించిన కవికులసార్వభౌముడు తననాటకప్రయోగమువిషయమున 'ఆ పరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ

విజ్ఞానం!' అని శంకించినాడు. అంత గొప్పనాటకమువిషయమునకూడ నటకులు ప్రదర్శనము నేమిపాడుచేయుదురో అని ఆయనకు భయపడవలసివచ్చినది. ప్రయోగము నటవిషయము. నాటకకర్త ఏమిచేయగలడు, నటులు పాడుచేసిన? ఈసమస్యకు పరిషత్తు చేయగ్గల పరిష్కార మెట్లుండునో!

(నాటకకర్తలకు సూచనలు)

1. బహూకృతికోసము పంపేనాటకము స్వతంత్రరచన కావలెను; అచ్చుపడి ఉండకూడదు; ప్రదర్శించి ఉండకూడదు.

2. ఈ సంవత్సరము బహూకరించవలసిన నాటకము సాంఘికముగా ఉండవలెను.

3. నాటకము ఇంచుమించుగా మూడుగంటల కాలములో ప్రదర్శించడానికి అనుకూలముగా ఉండవలెను.

4. నాటకములో ఎక్కువరంగాలు ఉండగూడదు. సాధ్యమైనంతవరకు పాత్రలు తక్కువగా ఉండవలెను; స్త్రీపాత్రలు మరీ తక్కువగా ఉండవలెను.

5. స్వగతములు, జనాంతికములు (asides) సాధ్యమైనంతవరకు ఉండకూడదు.

6. నాటకము వాడుకభాష (వ్యావహారికాక్రమము)లో ఉండవలెను.

7. కథాశరీరము గద్యాత్మకమై ఉండవలెను.

బహూకృతి నిర్ణాయక సంఘసభ్యులు ఎవరూ బహూకృతికి తమ నాటకము పంపకూడదు.

బహూకృతికోసము నాటకకర్తల తరఫున ఎటువంటి ప్రచారమూ జరగకూడదు.

బహూకృతి విషయములో నిర్ణాయక సంఘమువారి తీర్పు ఖాయము.

వచ్చిన నాటకాలలో ఏదీ సంతృప్తిగా కనబడనప్పుడు బహూకృతి నిలిపివేయడానికి నిర్ణాయక సంఘమువారికి అధికారమున్నది.

బహూకృతి పొందిన నాటకప్రదర్శనము హక్కులూ ప్రథమ ముద్రణాధికారమూ రెండు సంవత్సరములపాటు ఆంధ్రనాటక కళాపరిషత్తువారికే ఉండును.

బహూకృతికి పంపేనాటకము తాలూకు మూడుప్రతులు 1938-వ సంవత్సరం ఆగష్టు 31-వ తేదీలోపుగా పరిషత్కార్యాలయానికి చేరవలెను.

నాటకము దళసరి కాకితాలమీద ఒక వైపునే సిరాతో అక్షరాలు విడివిడిగా వ్రాయవలెను. పుస్తకములో ఎక్కడా నాటకకర్త పేరు వ్రాయకూడదు. పుస్తకముపేరు, నాటకకర్త పూర్తి విరునామా సీలువేసిన కవరులో కార్యదర్శులకు పంపవలెను.

బహూకృతికి వచ్చిన నాటకాలలో ఏదైనా ప్రచురించడము గాని, ప్రదర్శించడము గాని పరిషత్తువారు ఆగ్రంథకర్తసమ్మతిమీద చేయవచ్చును.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.



# సాభిప్రాయ విశేషములు

ప్రపంచ పరిణామమునందు దేశకాల పాత్రల ధర్మేతిహాసము లెప్పటి కప్పుడు విచిత్రముగను గనుపడుచుండును. "ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు...... ఏమి జరిగినది ?" అనెడిప్రశ్నకు ప్రత్యుత్తర మెప్పటికప్పుడు క్రొత్తదిగనే తోచుచున్నను సమాధానమువ్మాత్రము సందిగ్ధముగ నుండును. వేలయేండ్లకుపూర్వము మహాభారత యుద్ధారంభమునందు విజయునకు గలిగిన ధర్మ సందేహమునకు శ్రీకృష్ణుడు చేసిన సందేహనివృత్తి నిత్యమును ప్రపంచప్రవృత్తి యందు సార్థకమగుచున్నను కార్యాచరణ మునందు క్రొత్తమై సందేహములు గలుగు చుండును. ఇంద్రప్రస్థము, హస్తినాపురము, పృథ్వీరాజపురము, షెర్షాపురము, తొగ్లకాబాదు, హుమాయూను నగరము, షహజహానుపురము, నవడిల్లీనగరము మొదలగు నగరోదంతములు, భారత యుద్ధారంభము నందు ధృతరాష్ట్రుడు సంజయు నడిగిన "ఏమి జరిగినది?" అని చేసిన ప్రశ్నకే పరిపరి విధములను సమాధానమును నొసంగుచున్నను మానవధర్మసంస్థాపనమునకు డిల్లీ ప్రస్థాన మింకను చాల దూరమునందే యున్న దని ధర్మజిజ్ఞాసువులకు విశదమగుచున్నది. విశాలమైన డిల్లీప్రదేశము భిన్నయుగములం దనుభవించిన సుఖదుఃఖములు, భాగ్యభోగములు, గౌరవదైన్యములు హిందూస్థాన మనుభవించిన గౌరవ దైన్యములకు ప్రమాణములు. విశాలమైన డిల్లీప్రదేశ మనుభవించిన రక్తపాతములు, హత్యలు, మంత్రాంగములు, పాపకృత్యములు, పుణ్యకార్యములు, దానధర్మములు, త్యాగయోగములు పూర్వకాలమునందువలెను వర్తమాన కాలమునందును భయభ్రాంతులకును, ప్రజాకర్షణమునకును వినియోగపడుచున్నవి. డిల్లీయాత్ర పూర్వకాలమునందువలెను వర్తమానకాలమునందును ఆశాపూరితముగ నున్నది. ప్రాచీన నవీన సామ్రాజ్యముల సంయోగము, ప్రాచీననవీన సంస్కారముల సమ్మేళనము ప్రపంచపరిణామమునందు దివ్యదృశ్యములుగ నున్నవి. డిల్లీప్రస్థమునందు సంగ్రామములు సంభవించినను, రాజ్యములు మారినను, దుర్గములు శిథిలము లైనను, మతము లంతరించినను డిల్లీధర్మయాత్ర విఘ్నముల నతిక్రమించి జరుగుచునే యున్నది. డిల్లీనగరనిర్మాణమును సంకల్పించిన మహానుభావుని సంకల్పసామ

ర్థ్యము భరతవర్షధర్మప్రతిష్ఠకు ప్రమాణముగ నుండగలదు. అస్సిరియా, బాల్డియా, ఈజిప్టు, గ్రీకు, రోము మొదలగు సామ్రాజ్యము లంతరించి నామమాత్రావశిష్టము లైనను భరతవర్షసంకల్ప మవిచ్ఛిన్నముగను ఢిల్లీ ప్రస్థమునందు ప్రవర్ధమానం బగుచున్నది. ఢిల్లీప్రస్థమునందు దేశ కాల పాత్రలు నామ రూపములందు కారణాంతరములవలనను భేదమును బొందినను భారతసంస్కారప్రవాహమునందు సంగమించి భారతసంస్కార ప్రవాహమును సారవంతము చేయుచున్నవి. పురాతనమైన ఇంద్రప్రస్థమును, దుర్గమందిర పరంపరలును నామరూపపరిణామములందు అస్సెంబ్లిమందిరము, రాజప్రతినిధిమందిరము మొదలగు నవఢిల్లీమందిరములుగ పరిణమించినను భరతవర్షసంస్కారప్రతిష్ఠకు ప్రమాణములు. అస్సెంబ్లిమందిరమునుండి ప్రారంభ మైన రెజీనారోడ్డు, క్వీన్సురోడ్డు, కింగ్సురోడ్డు విధి లేకను అశోకరోడ్డును, షహ్జారోడ్డును, తారకోరారోడ్డును, యంత్రమంత్రరోడ్డును కలిసి పోవుట భరతవర్షసంస్కార ప్రాబల్యమునకు నిదర్శనములు. భారతసంస్కారప్రతిష్ఠకు బాహ్యరూపములందు ప్రత్యక్షప్రమాణము లుగ నున్న మందిరములు, మార్గములు, వృక్షములు, క్షేత్రములు, నదులు, వన ములు మానవధర్మపరిణామమునకును ప్రమాణములుగ నున్నవి.

అశోకుడు ౨౨౦౦ ఏండ్లకు పూర్వము కళింగదేశవిజయానంతరము సంగ్రామసన్యాసముచేసి స్థాపించిన శిలాధర్మశాసనములు సంగ్రామజ్వరపీడ ననుభవించుచున్న ప్రపంచమునకును, సామ్రాజ్యాభిమానులకును జ్ఞానోదయమును గలుగజేయుటకు దగియున్నది. వెల్సుగారు వారిప్రపంచచరిత్రయందు వ్రాసినటులు రాజమార్గములందు అశోకమార్గ ముత్తమమై పరంజ్యోతివలెను ప్రకాశించుచున్నది. బాహుబల శాస్త్రబల సంరంభములకు ప్రాచీనకాలమునందువలెను వర్తమానకాలమునందును ఢిల్లీ రాజ్యాంగములు నిదర్శనములుగ నున్నవి. మానవస్వాతంత్ర్య ధర్మపరిణామమునందు బాహుబల శాస్త్రబల ప్రయోజనములకు ఢిల్లీదృశ్యములు పరమార్థ నిదర్శనములు.

### బాహుబల ప్రదర్శనము

మహాభారతయుద్ధానంతరము వేలయేండ్లుగతించినను బాహుబల ప్రయోగమునందు రూపపరిణామమునుపొందినను బాహుబలము యథేచ్ఛగను వర్తమానకాలమునందు విహరించుచున్న విధమును ఢిల్లీదృశ్యములు స్మరింప జేయుచున్నవి. కాలక్రమమునను కోటలు జీర్ణించినవి; కందకములుపూడిపోయినవి; గజములు నిరుపయోగములైనవి; అశ్వములు బలచిహ్నములుగనిలిచినవి; తుపాకులు, కత్తులు మూలపడినవి; యంత్రాయుధములు ప్రబలినవి; టాంకులు, మోటారుబండ్లఫిరంగులు,

విమానములు, బాంబులు బాహుబలస్థానము నాక్రమించినవి. జనవరి 3౧-వ తేదియందు ఢిల్లీయందు ప్రదర్శింపబడిన సైన్యవ్యూహములు భయంకరములైన సంగ్రామవ్యూహములను స్మరింపజేయుచున్నవి. వేలమంది పదాతులు, ఆశ్వికులు, యాంత్రికాయుధధారులు, సాయుధమోటారుబండ్లు, సాయుధవిమానములు మొదలగు సంగ్రామసన్నాహములు ఢిల్లీ శిబిరమునకు రణరంగలక్షణమును సమకూర్చినవి. ఢిల్లీ శిబిరమునందు బ్రిటీషు సామ్రాజ్యబలము నేపాలు మహారాజునకును ప్రజలకును ప్రదర్శింపబడినది. గవర్నరు జనరలుగా రస్వస్థతవలనను రాజాలకపోయిరి. వారిస్థానమును సహజముగను విల్లింగ్డను ప్రభ్వి ఆక్రమించినది. కాని సైన్యదళములు వందనములను సేనాధిపతికి సమర్పించినవి. సైన్యబలప్రదర్శనము ఢిల్లీకి సహజస్థితియైనను శాస్త్రోక్తబలప్రమాణము బాహుబలారాధనమునకు వినియోగించుట ప్రపంచము నావరించిన దుర్దశకు నిదర్శనము. ప్రజలద్రవ్యము సంగ్రామసన్నాహముల కేరితిని వ్యయమగుచున్నదియును భారతశాసనసభ్యులుచూచుట సమంజసమని గవర్నరు జనరలుగారు వారిప్రసంగమునందు సూచించిరి. ప్రజలన్నాతురులై పరితపించునపుడు వ్యర్థవ్యయ మెంతయైనను ప్రజామోదమును బడయజాలదు. ప్రపంచవ్యవహారములందు జ్ఞానయోగమును బలప్రయోగమునకు వినియోగించుటకు - కల్పింపబడిన శాసనములు, మారణయంత్రములు జ్ఞానయోగప్రయోజనమును నిరర్థకము చేసినవి. శాసనసభావ్యవహారములును నీసందర్భములనె చాటుచున్నవి. అస్సెంబ్లిమందిరమునందు నిరంకుశ శాసనపరిపాలనమును, వెలుపలను సైన్యబలప్రదర్శనమును బ్రిటీషుప్రభుత్వబలమునకు ప్రమాణములు.

### శాసనపాలనము

శాస్త్రప్రమాణము కార్యాకార్యములందు ప్రతికూలానుకూల ప్రయోజనములకు వినియోగపడుట శాస్త్రార్థములకు విచిత్రవ్యాఖ్యానము. రాజ్యాధికారులు, సంఘసంస్కర్తలు, మతాచార్యులు, ఆర్థికపండితులును వారి వాదములను సిద్ధాంతాచరణములను సమర్థించుటకును, నిరసించుటకును నవలంబించెడి ప్రజ్ఞావాదములు మానవధర్మాభ్యుదయమునకు మహా ప్రతిబంధకములు. రాజ్యాంగములందు ప్రభుత్వశాసన తిరస్కారము రాజద్రోహము, ద్వేషము, విప్లవము. సాంఘికవ్యవస్థలందు నవీనాచారవ్యవహారములు దురాచారములు, హేయములు. మతమీమాంసలందు నవీన విశ్వాసారాధన విధానములు నాస్తికములు, చార్వాకములు. ఆర్థికవ్యవహారములందు నూతన నిర్మాణసాధనము లాసురములు, భయంకరములు. పండితులకు స్వపక్షసమర్థనమునకును, పరపక్ష నిరసనమునకును శాస్త్రప్రమాణము లనంతములు సిద్ధముగ నున్నవి. ప్రపంచవ్యవహారములందు స్వపక్షసమర్థనమును, పరపక్ష

నిరసనమును సహజములైనను ప్రపంచ మన వరతమును యథావిధిని పరివర్తనమును పొందుచున్నది. విపరివర్తనమె జగత్తునకు లక్షణము. పరివర్తనశబ్దమె భారతప్రభుత్వమునకు భయమును పుట్టించిన విధమును గాంధిమహాత్ముని గ్రామోద్యోగోద్యమము పట్లను ప్రభుత్వ మవలంబించిన భేదనదండనోపాయములు విశదముచేసినవి. గాంధిమహాత్ము డుపక్రమించిన సకల వ్యవహారములందును శాసనతిరస్కారమునకు సాధనములను శంకించుట ప్రభుత్వమునకు ధర్మముకాదు. గాంధిమహాత్ముడు సత్యాగ్రహమును విరమించి గ్రామోద్యోగ ప్రయత్నములకు సకలసంఘపక్షముల సానుభూతిసహాయముల నపేక్షించునపుడు ప్రభుత్వము ననేమిరా యనుటయేకాకను ప్రతిఘటనమును గూడ కల్పించుట యన్యాయము. లా మెంబరు సర్కారుగారును, హోంమెంబరు క్రెయికు గారును జిన్నా వల్లభపంతులుగారులు వేసిన ప్రశ్నలకు చెప్పినసమాధానములు పరిహాసపాత్రము లయినవి. శాసన తిరస్కారోద్యమము లేదని యెన్నిసారులు చెప్పినను ప్రభుత్వాధికారులకు సంతృప్తి కలుగదు. సత్యసంధుడైన గాంధిమహాత్మునిమాటలను నమ్మకను పత్రికాభిప్రాయములను, వ్యాఖ్యానములను నమ్ముట వివేకము గాదు. శాసనసభల వ్యవహారములు శాసనసమర్థనమునకు విని యోగపడునటులు ధర్మసమర్థనమునకు విని యోగపడజాలవు.

* * * *

భారతశాసనసభ

భారతశాసనసభయందు కాంగ్రెసుపక్షప్రవేశ మపూర్వమైన సంచలనమును గలుగజేసినది. కాంగ్రెసు పక్ష సభ్యులు రశిమాత్రమే యైనను సభ్యుల క్రమప్రవర్తనము పక్షమునకు బలగౌరవములను సమకూర్చినది. భూలాభాయి దేశాయిగారి నాయకత్వముక్రిందను కాంగ్రెసుపక్షబలము ప్రభుత్వబలము నతిక్రమింపగల విధమును సభ్యుల సంభాషణప్రవర్తనములు విశదము చేసినవి. అధ్యక్షుని ఎన్నిక యందు రాష్ట్రీయ సాంఘికాభిమానములు కాంగ్రెసుపక్ష విజయమునకు ప్రతిబంధకములైనను, సామాన్య విషయములం దయినను ప్రతిబంధకములు గాకుండుట సంతసింప దగియున్నది. శ్రీ యుత శరచ్చంద్రబోసుగారి నిర్బంధ విషయమునను, ఇండోబ్రిటీషు వర్తకపుసంధి విషయమునను ప్రభుత్వమునకు గలిగిన పరాజయము ప్రభుత్వదౌర్బల్యమును రుజువు చేసినది. ప్రభుత్వసభ్యులను, ప్రభుత్వనియమితసభ్యులను మినహాయించిన యెన్నుకొనిన సభ్యులందు కాంగ్రెసుజాతీయపక్షముల బలమెప్పుడును నధికముగ నుండగలదు. ఆరంభశూరత్వ మెంతవరకు నిలుచునదియును కాలము తెలుపగలదు. ఇండోబ్రిటీషువర్తకసంధివిషయమై జరిగిన చర్చ

యందు భూలాభాయి జిన్నాగారల గంభీరోప న్యాసములు మోడిజహాంగీరుగారలకు జ్ఞానోదయమును గలుగజేయుటకు దగియున్నవి. జహాంగీరుగారి యధికప్రసంగముకు దేశాయిగారి తిరస్కారము నాయకలక్షణమునకు దగియున్నది. మోడిగారి వాదదౌర్బల్యము పరిహాసపాత్ర మైనది. వర్తకసంధిచర్చ సాంగోపాంగముగను జరిగినను ప్రయోజనము గలుగలేదు. సర్ జోసెఫు భోరుగారి ప్రత్యుత్తరము సమయోచితముగను, యుక్తియుక్తముగను నున్నను ప్రాణములేని సంధి కెవరు ప్రాణముపోయగలరు? ఇండో-బ్రిటీషుసంధిని వలెను జాయింటుకమిటిరిపోర్టును శాసనసభ నిరాకరించుటయును సహజము.

*       *       *       *

**జాయింటుకమిటి రిపోర్టు**

జాయింటుకమిటి రిపోర్టు స్వాతంత్ర్య చిహ్నములైన దేశరక్షణాధికారమును విదేశాంగ సంబంధములను, ఆర్థిక స్వాతంత్ర్యమును నిరాకరించినను సామాన్యవిషయములందును స్వాతంత్ర్యసారమును గలుగజేయుటలేదు. అన్నిపక్షములవారును నేదో విధమునను పార్లమెంటుకమిటి రిపోర్టును నిరసించుచున్నను రిపోర్టును నిరాకరించుటయందేయేపక్షములు కలిసివచ్చునదియును, దురూహ్యముగ నున్నది. కమిటిరిపోర్టునందు సాంఘికప్రాతినిధ్యనిర్ణయము విభేదములకు మూలముగ నున్నది. హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు కలిసి సాంఘికప్రాతినిధ్య సమస్యను నిర్ణయింపజాలకపోవుట దేశము నావరించిన దౌర్భాగ్యమునకు నిదర్శనము. సాంఘికప్రాతినిధ్యముపట్లను కాంగ్రెసు తిరస్కారభావమును బూనియున్నను కాంగ్రెసునకు సాంఘికనిర్ణయమును తిరస్కరించుటయును, సమర్థించుటయును సాధ్యముగాకున్నది. జిన్నాగారు సాంఘికప్రాతినిధ్యము నంగీకరించుచు రాష్ట్రీయ స్వపరిపాలనము విశాలము కావలయుననియును, ఫెడరేషను నిరర్థకమనియును తీర్మానమును ప్రతిపాదించుచున్నారు. జాతీయపక్షము సాంఘికనిర్ణయమును, కమిటిరిపోర్టును నిరాకరించుచున్నది. నిర్బంధముల కల్పనలందు శ్వేతపత్రమును మించి జాయింటు కమిటిరిపోర్టును, రిపోర్టును మించి ఇండియాప్రభుత్వ శాసనమును పోవుచున్నవి. శాసనమంతయును బ్రిటిషు నిరంకుశాధికారరక్షణమున కేర్పడినపుడు ప్రత్యేక భాగ విమర్శనము కార్యసాధనము గాదు. ఇండియాప్రభుత్వశాసనము బాధ్యతను సంకుచితము చేయుటకునువలెను విశాలము చేయుటకు వినియోగపడదు. గవర్నరు జనరలు గవర్నరుల నిరంకుశాధికారము, రెండు శాసన సభలు, పరోక్ష నియోగము, ఉద్యోగ రక్షణములు, వ్యాపార రక్షణములు, సంస్థానముల సంయోగము, కార్యదర్శి, రాజు, పార్లమెంటు అధికారములు స్వాతంత్ర్యమును నామమాత్రము చేయుచున్నవి. పార్లమెంటుకమిటిరిపోర్టు

నిరాకరింపబడినను శాసనరూపమును ధాల్చి నను డిల్లీ చాల దూరమునం దున్న ధను లోకోక్తి స్వరాజ్య సమరమున కన్వయింప గలదు. ఎన్ని సమరములు సంప్రాప్తముగా నున్నను డిల్లీ ప్రభావముమాత్ర మవిచ్ఛిన్న ముగను సాగుచుండును.

* * * *

డిల్లీ వైభవము.

రాజులు మారినను, రాజ్యము లంత రించినను, మహా సంగ్రామములు సంప్రాప్త మైనను డిల్లీవైభవము మాత్రము నిరాటంక ముగను సాగుచున్నది. డిల్లీనగరము సంస్థా నాధీశులకును, వారి మంత్రులకును, ప్రజా నాయకులకును, సైన్యనివహములకును, పరి వారములకును, వర్తకులకును, వంచకుల కును, భక్తులకును, వార్తాహరులకును, ప్రభు త్వాధికారులకును, రాజప్రతినిధికిని వాస స్థలమై వైభవము ననుభవించుచున్నది. వివి ధములైన రైలు మార్గములు, మోటారు బండ్లు, టాంగాలు, వాయు విమానములు డిల్లీవైభవమును చాటుచున్నవి. డిల్లీ నలంక రించిన విద్యాలయములు, వైద్యాలయములు, దేవాలయములు, సౌధములు, మందిర ములు, నందనోద్యానములు డిల్లీ వైభవ మును విస్తృతముచేయుచున్నవి. డిల్లీవైభవ వ్యాపనస్థాపనమునందు విల్లింగ్డను ప్రభ్వి చూపుచున్న శక్తిసామర్థ్యములు ప్రశంసా పాత్రములు. సంస్థానములకును బ్రిటీషుప్రదేశ ములకును గల సహజస్థితిని డిల్లీదృశ్యములు విశదముచేయుచున్నవి. రాజప్రతినిధిని సంద ర్శించుటకును, సంస్థానాధీశులసభ నలంక రించుటకును సంస్థానాధీశులు, మంత్రులు వచ్చియుండిరి. డిల్లీయంతయును రాజాధి రాజులతోను, మంత్రులతోను, పరివారములు తోను, ప్రజాప్రతినిధులతోను, సైన్యముల తోను నిండిపోయి జిజ్ఞాసకు పాత్రమైనది.

* * * *

స్వదేశ సంస్థానములు

ప్రపంచవ్యవస్థలందు స్వప్రయోజనముల కును పరహితప్రయోజనములకును సంయోగ సాహచర్యములు దుర్లభములు. పరప్రయోజ నములందే యథార్థముగను స్వప్రయోజన ములు గోచరంబగుచుండును. పాటియాలా బికానీరు మహారాజులును, ఇతరసంస్థానాధీశు లును సంయుక్తపరిపాలనము సంగీకరించుచు స్వప్రయోజనరక్షణములను గోరుట బ్రిటీషు ప్రభుత్వము కోరెడి రక్షణముపలె నున్నది. రోధగుమియరుప్రభువు రాంపూరు నవాబు నకును,నితరసంస్థానాధీశులకును పంపిన సందే శము బ్రిటీషుడైహర్ద్యంభావములనే కాకను బ్రిటీషుప్రజలభావములను విశదము చేయు చున్నది. అయిదుగురు సంస్థానాధీశులను రాజులనుజేయుటకు బ్రిటీషుప్రభుత్వముచేయు చున్న ఏర్పాటులును నీ సందర్భములనే తెలుపుచున్నవి. అన్ని పక్షములవారును నేదోవిధమునను స్వరాజ్యసంస్థాపనమున కా టంకములను గల్పింప దలచినటులు. సదుపా యములను గల్పించుట లేదని స్పష్టమగు

చున్నది. సంస్థానాధీశులును నిరంకుశాధికార ప్రియులైనను స్వాతంత్ర్యప్రియులు, స్వదేశాభిమానులు. బ్రిటీషుప్రదేశములకును, సంస్థానములకును సంయోగసాహచర్యములు లేనిదే హిందూస్తానస్వాతంత్ర్యమును, యోగక్షేమములును దుర్లభములు. జపానుదేశమునందు ప్రభువులు ప్రజలు దేశప్రయోజనములకు స్వప్రయోజనములను విడిచి బల భాగ్య జ్ఞానవంతులైనవిధము భారతీయులకును నాచరణ యోగ్యముగ నున్నది. ఏవ్యక్తి కావ్యక్తియును, ఏసంఘమున కాసంఘమును, ఏపక్షమున కాపక్షమును, ఏమహారాజున కామహారాజును, ఏమతస్థున కామతస్థుడును, ఏస్థలమున కాస్థలమును ప్రతిఘటనమును బూనుచున్నపుడు స్వరాజ్యప్రాప్తి ఢిల్లీప్రవేశము వలెను దూరమునందే యుండుట సహజము. భగవదనుగ్రహమువలనను చిరకాలాగతంబైన భారతసంకల్పము సార్థకమగు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.